అపరాధపరిశోధన అనుబంధం—164

# మూడు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందిస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## నీలినీడలు

రచన: వి. యస్. రావ్

## స్నేహం

రచన: వసుంధర

## దేవుడు చేసిన నేరం

రచన: కె. బి. ఎస్. కుమార్

అన్వేషణ — పదునాలుగవ భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్—164
ఆగస్టు, 1987
వెల: రు. 7-50
ఏడాది చందా: 90 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
ఏ. వీ. మోహన్రావ్
బొమ్మిడి అచ్చారావు
వి. యస్. రావ్
సుంకరి రాంప్రసాద్
విద్వాన్ షిలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64848

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1,

# నీలి నీడలు

## వి.యస్. రావ్

డిటెక్టివ్ టెంపో చదువుతున్న స్కాట్లాండ్ యార్డు క్రైమ్ రిపోర్టుని పక్కనే సోఫామీద పడేసి, ఆవులిస్తూ వాచీ చూసుకున్నాడు. పదకొండు దాటింది. సోఫాలోంచీ లేచి చేతులు పైకెత్తుతూ అలసటగా వొళ్ళు విరుచుకున్నాడు.

టెంపో కోటును తీసి సోఫామీదికి వదిలాడు. అతని కుడి చెయ్యి నెక్టైని ఊడదీసే ప్రయత్నం చేయసాగింది. ఛైమ్స్ రాగయుక్తంగా ధ్వనించాయి. అర్ధరాత్రి అతిథి యెవరా అనుకుంటూ హాల్లోకి నడిచాడతను. బోల్టు లాగి, తలుపు తెరిచాడు. గుమ్మంలో నిలబడ్డ వ్యక్తిని ఆశ్చర్యంతో చూశాడు. ఖరీదైన సెంటు మత్తెక్కిస్తూ అతనివైపు దూసుకొస్తోంది.

టెంపో ఏదో అడగబోయాడు. ఆమె అతన్ని దాదాపు తోసుకుంటూ లోపలకు దూరింది. ఆశ్చర్యంతో టెంపో ఆమెవేపు తిరిగాడు.

"మిస్టర్ టెంపో, తలుపు మూసెయ్యండి!" ఏదో చెట్టుమీంచి కోయిల తన గదిలోకి ఎగురుతూ వచ్చి, వాలి కూసినట్టనిపించిందతనికి. అప్రయత్నంగా అతని చెయ్యి తలుపుని మూసింది.

"గొళ్ళెం పెట్టేయండి!"

టెంపో ఆమెవైపే చూస్తున్నాడు. అతని ఎడమ చెయ్యి ఆమె చెప్పినట్టుగా గొళ్ళెం పెట్టేసింది. లేత గులాబిరంగు ఆర్గండీ చీర. అదే రంగు స్లీవ్ లెస్ జాకెట్. భుజాల్ని తాకుతూ అలల్లాగా కిందికి సాగిన బాబ్డు హెయిర్. బోర్లించిన అరచేతుల్లా వున్న కనుబొమల కింద దీపాల్లా వెలుగుతున్న పెద్ద పెద్ద కళ్ళు. చెవులకి డైమండ్ రింగ్స్. తలమీద ముసుగులా వున్న పైటని ఆమె కిందికి లాగింది.

"మిస్టర్ టెంపో, క్షమించండి. ఏదీ కానివేళ ఇలా జొరబడ్డాను!" అందామె. "నన్ను పరిచయం చేసుకోవాల్సిన అవసరం లేదనుకుంటా!" ఆమె నవ్వింది. చాకచక్యంగా, చక్కగా రికార్డు చేసిన సెలయేటి గలగల క్యాసెట్ ఆమె కంఠంలో మోగినట్టనిపించింది. ఆమె కళ్ళు నవ్వుతున్నాయి.

డిటెక్టివ్ టెంపో నవ్వాడు. "నీ ఫొటోలేని ఫిలిం మ్యాగజైన్, కథల మాసపత్రిక, సచిత్ర వారపత్రిక ఏదో వొకటి సంపాదించడానికి ఎంతో ప్రయత్నించి, వోడిపోయాను!"

ఆమె, శశిప్రియ హాయిగా నవ్వింది. చిగురుటాకుల చాటునుంచీ తొంగిచూసే మొగ్గల్లా, ఎర్రటి పెదవుల సందులోంచీ తెల్లటి పళ్ళు తళుక్కుమన్నాయి. "ఏకవచనంలో సంబోధించినందుకు థాంక్స్! నా ఫొటో

అంటే మీకు అయిష్టమా?" ప్రశ్నిస్తూ నవ్విందామె.

టెంపో చిన్నగా నవ్వాడు. "యూ ఆర్ మిస్టేకన్. నీ ఫోటో ప్రచురించబడని పత్రిక ఆంధ్రదేశంలో లేదు అని నా అర్థం! అచిరకాలంలో నువ్వు టాప్ స్టార్ అయిపోయావు! తారాపథంలోకి దూసుకెళ్ళిపోయావు."

"తారాపథంలోకి దూసుకెళ్ళిన వ్యక్తికి మళ్ళీ నేల మీదికి, ధూళిలోకి కూలిపోయే ప్రమాదం కూడా వుంటుంది మిస్టర్ టెంపో!" శశిప్రియ నవ్వుతూ అంది. ఆమె నవ్వులో ఏదో లోపించింది. టెంపో కళ్ళు చిట్లించాడు.

"టాప్ హీరోయిన్ ఇలా అర్థరాత్రి...." అంటూ ఆగాడతను.

"మిస్టర్ టెంపో, ఎంతో కష్టపడి, మారువేషం వేసుకున్నంత పని చేసి, చుట్టూ ముసురుకున్న వందిమాగధులనుంచీ, జలగలనుంచీ ఎలాగో తప్పించుకుని, చాలా రహస్యంగా ఇక్కడికొచ్చాను. మళ్ళీ త్వరగా నేను నా బంగారు పంజరంలోకి చేరిపోవాలి!" అప్రయత్నంగా ఆమె కుడిచెయ్యి బంగారు కమ్మీలో గుచ్చిన డిస్కో నల్లపూసల్ని తడివింది.

"ఆ గదిలో కూచుందాం...." టెంపో కదిలాడు. ఆమె అనుసరించింది.

టెంపో ఆమెకి సోఫా చూపించాడు. ఖరీదైన వానిటీ బాగ్ ని వొళ్ళో పెట్టుకుని, సోఫాలో కూచుని, కాలు మీద కాలు వేసుకుంటూ శశిప్రియ తెల్లటి పళ్ళు చూపిస్తూ నవ్వింది. ఆ క్షణంలో తన చేతిలో కెమెరా లేనందుకు టెంపో విచారించాడు.

"కాఫీ, టీ, కూల్ డ్రింక్?" టెంపో ప్రశ్నించాడు.

"ఏదో వొకటివ్వండి....ఐ వాంట్ స మ్ థిం గ్

హాట్ ..." శశిప్రియ తడబడింది.

టేబుల్ మీద ఫ్లాస్కులో వున్న టీని రెండు కప్పుల్లో పోసి, ఆమెకి ఒక కప్పు అందించాడు టెంపో. ఏకాగ్రతతో టీ చప్పరించసాగింది శశిప్రియ. కప్పు అంచుల మీదుగా ఆమె చేపల్లాంటి కళ్ళు టెంపోనే చూస్తున్నాయి. "థాంక్స్. టీ టీలాగే వుంది!" కప్పుని టిపాయ్ మీద పెడ్తూ అంది శశిప్రియ.

టెంపో ఆశ్చర్యంగా ప్రశ్నార్థకంగా చూశాడు. ఆమె చిరునవ్వు నవ్వింది. "ఇంటా, బయటా నాకు స్పెషల్ టీ సమర్పించబడుతుంది. అదెప్పుడూ, ఇలా ఒరిజినల్ టీలా వుండదు!"

టెంపో నవ్వుతూ సిగరెట్ వెలిగించాడు. శశిప్రియ అప్రయత్నంగా ముక్కు చిట్లించింది. "సిగరెట్ వాసన నాకు నచ్చదు...."

"అయామ్ సారీ. ఐ కాంట్ హెల్ప్ ఇట్. నాకు నచ్చని వాసనని నేను ఇందాకట్నుంచీ సహిస్తున్నాను."

"మిస్టర్ టెంపో...."

"నాకు సెంట్లు నచ్చవు. మనిషి అసలు వాసనని కప్పెట్టేస్తాయవి. మనిషి అసలు వాసననిబట్టి వ్యక్తిత్వాన్ని అంచనా వేయడం నాకు ఇష్టం!" టెంపో నవ్వుతూ వివరించాడు. శశిప్రియ తేలిగ్గా నవ్వింది. టెంపో వదిలిన స్మోక్ రింగ్ ఆమెవైపు గమ్మత్తుగా కదులుతోంది. మెల్లిగా దాన్ని దూరంగా ఊదేసి, శశిప్రియ నవ్వింది.

మిస్టర్ టెంపో, మీరు దాపరికం లేకుండా మాట్లాడుతున్నారు. సినీతారను చూస్తే మామూలుగా మగాడిలో అవుపించే ఆత్రుతా, ఆకలీ, ఇన్ఫీరియారిటీ

మీ కళ్ళల్లో మచ్చుకైనా లేవు...."

"థాంక్స్. వినీతారలుకూడా రెండుకాళ్ళ మనుషులనే నా ఉద్దేశం! ఇంతకీ...."

"మిస్టర్ టెంపో,....నాకు.....నాకు రారాని కష్టం వచ్చింది..." శశిప్రియ ఆగి అదోలా చూసింది.

టెంపో ఆమెని ప్రశ్నార్థకంగా చూశాడు. ఏదో సందేహం ఆమె కళ్ళల్లో లీలగా ప్రత్యక్షమైంది.

"వినడానికి తయారుగా వున్నా!" టెంపో నవ్వుతూ అన్నాడు, నిద్రకు పైలట్ గా తోసుకొస్తున్న ఆవులింతని బలవంతంగా మింగుతూ.

"మొదట చూడండి. తరవాత విందురుగానీ," అంటూ శశిప్రియ వానిటీ బాగ్ లోంచీ ఒక వీడియో క్యాసెట్ ని ఇవతలికి తీసింది. టెంపో ప్రశ్నార్థకంగా చూశాడు. శశిప్రియ అతనివేపు చూడ్డంలేదు. ఆమె మెల్లగా లేచింది. గోడవారగా వున్న వీడియో క్యాసెట్ ప్లేయర్ వైపు వెళ్ళింది. టెంపో ఆమె వీపునే చూస్తూ మౌనంగా కూచున్నాడు. కాసెట్ ని విసిపిలో పెట్టి బటన్ నొక్కి శశిప్రియ వెనక్కి తిరిగింది. ఆమె మొహంలో చిరునవ్వు లేదు. మెల్లగా సోఫావైపు నడిచింది. ఆమె అడ్డుతొలిగాక టీవీ స్క్రీన్ టెంపో దృష్టిని ఆకర్షించింది.

టెంపో కళ్ళు చెదిరిపట్టయ్యాయి. కలర్ టీవీస్క్రీన్ మీద అతని దృష్టి తాపడం అయిపోయింది. బాత్ రూమ్ తలుపు మూసిన స్త్రీ ఆకారం వెనక్కి, టెంపోవైపు తిరిగింది. సముద్రంలోంచీ అప్పుడే పైకివచ్చిన జలకన్యలా వుందామె. ఆమె శరీరంమీద నీటిముత్యాలు తప్ప మరే ఆచ్ఛాదనా లేదు. ఎత్తైన సుంద్రటి రెండు పుట్టలమధ్య

సన్నటి పాములా నీళ్ళు ఆమె స్తనాలమధ్య జారుతున్నాయి. రెండు చేతుల్నీ పైకెత్తి బాబ్డు హెయిర్ని కదుపుతూ, కెమెరాలోకి నవ్వుతూ చీకూచింతా లేకుండా కదుల్తోందామె.

మెల్లగా, కెమెరా డబుల్ బెడ్ మీదికి తిరిగింది. మంచానికి ఆనుకుని అతను నిలబడ్డాడు. అతనూ కూడా ఆమెలాగే అప్పుడే పుట్టిన బిడ్డలా వున్నాడు, కాకపోతే ఆమెలాగే వయసొచ్చిన తరువాత పుట్టిన వాడిలా వున్నాడు. ఇద్దరి మొహాల్లో నవ్వు. ఆ నవ్వులో కోరిక నవ్వుతోంది. అతను చిలిపిగా చూస్తూ రెండు చేతులూ చాచాడు. అతని చేతులలోకి ఉద్రేకంతో జారిందామె; ఆమె....శశిప్రియ ...

బాగా, ఎర్రగా కాలిన లోహం ముక్కలు ఒకదానికొకటి అతుక్కుపోయినట్టు ఆమే, అతనూ... టెంపో లేచాడు. చకచకా టీవీవైపు నడిచాడు. కలల్లో జరుగుతున్న తరవాత నాటకాన్ని చూడాల్సిన అవసరం లేదు. టెంపో చెయ్యి కదిలింది. నాటకం ముగిస్తూ తెరని లాగేసింది. టెంపో వెనక్కి తిరిగాడు.

శశిప్రియవైపు చూశాడు. ఆమె అతన్ని చూడ్డంలేదు. రెండు చేతుల్తో కణతల్ని నొక్కుకుంటూ తలవాల్చి కూచుందామె. ఆరిపోయిన సిగరెట్ని కిందపడేసి, టెంపో మరో సిగరెట్ వెలిగించాడు. మెల్లగా నడిచి, శశిప్రియ ముందు ఆగి, ఆమెవేపు, కిందికి చూశాడు.

“ప్రేక్షకుణ్ని ఎన్నుకోడంలో నువ్వు పొరపాటు చేశావ్!”

శశిప్రియ ఉలిక్కిపడి తలెత్తింది. ఆమె కళ్ళు బలహీనంగా, దీనంగా చూస్తున్నాయి. తెల్ల మొహం వేసు

ఉన్న టీవీని వొకసారి చూసి, తన చూపుల్ని టెంపో వైపు ఎత్తిందామె.

"టెంపోగారూ, చూశారా?" ఆమె కంఠం వణికింది.

"ఒక మెతుకుపట్టి చూశాను; చాలు. అన్నం అంతా చూడక్కర్లేదు! పైగా, ముందే చెప్పాను; నువ్వు ప్రేక్షకుడి సెలక్షన్లో...."

"లోకంలోని ప్రేక్షకులు దాన్ని చూడకూడదనే ఉద్దేశంతో ఈ ప్రేక్షకుణ్ని ఎన్నుకున్నాను, మిస్టర్ టెంపో.'

డిటెక్టివ్ టెంపో ప్రశ్నార్థకంగా చూస్తూ ఆమె యెదురుగా కూచున్నాడు. యెక్కడికో యెగిరిపోయిన నిద్ర గురించి ఆలోచిస్తూ. వెనక్కి వాలాడు.

"చూడ్డం అయింది. ఇంక విందామా?" అన్నాడు నవ్వుతూ

శశిప్రియ నిట్టూర్చింది "మిస్టర్ టెంపో, మళ్ళీ ఎప్పుడు మీలా తేలిగ్గా, హాయిగా నవ్వగలనా అనిపిస్తోంది నాకు....ఏడాది క్రితం నాకు పెళ్ళయింది. తెలుసుగా?"

"సినిమా పత్రికలూ, గాసిప్ కాలమ్సూ నేను చదవను."

"పెళ్ళి గాసిప్ కాదు!" శశిప్రియ అడ్డుతగిలింది.

"నెవర్ మైండ్! ఇప్పుడు తెలిసిందిగా? నీకు ఏడాది క్రితం పెళ్ళయింది. ....ప్రొసీడ్!" టెంపో నవ్వుతూ సీన్నాడు.

"నా పెళ్ళి చాలా డ్రమెటిగ్గా జరిగింది. 'చీకట్లో నీడలు' అన్న అట్టర్ ఫ్లాప్ ఆర్ట్ ఫిలింతీసిన డైరెక్టర్

గంగాధర్‌తో నా పరిచయం అచిరకాలంలో ప్రణయంగా ఎదిగింది. 'చీకట్లో నీడలు' బాక్సాఫీస్ దగ్గర పల్టీ కొట్టినా, నిర్మాత దాదాపుగా చిత్రసన్యాసం తీసుకున్నా, గంగాధర్‌కి డైరెక్టర్‌గా గొప్ప పేరొచ్చింది. గంగాధర్ టాలెంటూ, కమిట్‌మెంటూ, కళాతృష్ణా, సామాజిక దృక్పథం నన్ను అతనికి దగ్గరగా చేశాయి. నేను యాక్ట్ చేస్తున్న ఒక చిత్రం పెళ్ళి సీనులో, అదే సెట్టింగులో, హఠాత్తుగా మా పెళ్ళి జరిగిపోయింది. సినిమాటిగ్గా జరిగిన మా పెళ్ళి పెద్ద సంచలనం సృష్టించింది."

"శశిప్రియా, ఉపోద్ఘాతం ఆంజనేయుడి ఎలాస్టిక్ తోకలా పెరుగుతోంది!" టెంపో నవ్వుతూ అడ్డు తగిలాడు.

శశిప్రియ బలవంతంగా నవ్వింది. "శ్రీ లేకపోతే శుభంలేదు. అసలు పాయింటులోకి అడుగుపెడ్తున్నా. పెళ్ళయిన ఆర్నెల్లదాకా హనీమూన్ వెళ్ళలేకపోయాం: నా చిత్రం పూర్తికాని కారణంగా. వేరే కాల్‌షీట్స్ కేన్సిల్ చేసుకుని, హనీమూన్ వెళ్ళాం. ఫారిన్ కంట్రీస్ లండన్, న్యూయార్క్, వెనిస్...చివరికి పారిస్..." శశిప్రియ ఆగింది.

సిగరెట్ పీకని యాష్‌ట్రేలో నొక్కి టెంపో ఆమెవైపు కానిమ్మన్నట్టు చూశాడు.

"మేం వెళ్ళిన ప్రతిచోటికీ స్వర్గం దిగొచ్చింది. గతాన్నీ, భవిష్యత్తునీ మరిచిపోయి, అందర్నీ, అన్నింటినీ మరిచిపోయి ఇద్దరమే....ఇద్దరూ ఒక్కరుగా ఆనందానికీ, తృప్తికీ ప్రతిరూపాలుగా గడిపాం. పారిస్‌లో.. పారిస్‌లో అగ్నిపర్వతం బద్దలైంది. మా స్వర్గాన్ని ఆ

లావా దారుణంగా ముంచేసింది.." శశిప్రియ కంఠం క్రమక్రమంగా తగ్గుతూ, గుసగుసగా మారిపోయింది.

## 2

పారిస్.

హోటల్ డి పారిస్. బ్రైడల్ సూట్.

కిలకిల నవ్వుతూ శశిప్రియ గదిలో ప్రవేశించింది. ఆమె వెనకనే గదిలోకి మారి తలుపు మూసి గంగాధర్ తటాలున ఆమె పైట పట్టుకున్నాడు. శశిప్రియ గిరుక్కున తిరిగి వీపుచుట్టూ పైటని చుట్టుకుంటూ అతని దగ్గరగా జరిగింది. ప్రేమగా, అలసటగా అతన్ని ఆనుకుని, వెడల్పాటి ఛాతీమీద తల వాల్చింది. గంగాధర్ చేతులు ఆమె మొహాన్ని ఇరువైపులా పట్టుకుని పైకెత్తాయి. చుట్టూ మసిబారిన ప్రమిదల్లో వెలుగుతున్న జ్యోతుల్లా మెరుస్తున్న శశిప్రియ కాటుక కళ్ళు అతని కళ్ళల్లోకి చూశాయి. ఎర్రటి పెదవులు చిరుగాలికి కదిలే చిగురాకుల్లా అల్లల్లాడాయి ఆమె కళ్ళల్లోని కోరికని పెదవులు ధ్వనిలేని భాషలో వ్యక్తం చేస్తున్నాయి. అప్రయత్నంగా ఆమె శరీరం చెట్టుబోదెని హత్తుకునే లేత తీగలా అతని పొడుగాటి శరీరాన్ని హత్తుకుంది. మెల్లిగా నిట్టూర్చిందామె.

చెంపల్ని నొక్కుతున్న అతని చేతుల్ని సున్నితంగా తొలగిస్తూ శశిప్రియ దూరంగా జరిగి, బాత్‌రూమ్‌లోకి వెళ్ళింది. గంగాధర్ చిరునవ్వుతో ఆమె వెళ్ళినవైపే చూస్తున్నాడు. కాసేపట్లో బాత్‌రూమ్‌లోంచీ ఆమె ఇవతలికి వచ్చింది. ఉలిపిరికాగితంలాంటి మాక్సీ ఆమె సౌందర్యాన్ని ఎత్తిచూపుతోంది. ఇంకా ఫుల్ సూట్‌లోనే వున్న భర్తని ఆక్షేపంగా చూసిందామె.

నవ్వుతూ దగ్గరగా జరిగి, కోటు గుండీలు విప్పే ప్రయత్నం చేసింది. గంగాధర్ కాడల్లాంటి ఆమె వేళ్ళని పట్టుకున్నాడు. పైకెత్తి ఎర్రటి అరచేతుల్ని ముద్దెట్టుకున్నాడు.

"ప్రియా, మాక్సీతో నా కళ్ళని కప్పేస్తున్నావెందుకు?" అన్నాడు నవ్వుతూ.

శశిప్రియ సిగ్గుపడుతూ నవ్వింది. "ఆకుల చాటున వుంటేనే పువ్వుకి అందం!"

"నో. నువ్వు నువ్వుగా కనిపించాలి నాకు! నీ దుస్తుల్ని కాకుండా నిన్ను ప్రేమిస్తున్నానేను!" గంగాధర్ కంఠంలో ప్రేమ ఆవేశంగా ధ్వనించింది. అతని కళ్ళు ఆరాధనగా మారిపోయి ఆమెని చూస్తున్నాయి.

"నాకు .సిగ్గు.." శశిప్రియ మెల్లిగా అంది. మళ్ళీ ఆమె చేతులు అతని కోటు గుండీల్ని పట్టుకున్నాయి. మళ్ళీ అతని చేతులు ఆమె చేతుల్ని పట్టుకుని ఆపాయి.

"కమాన్.... బాక్స్ రిజర్వ్ చేయించాను. మూవీ కెళ్దాం" అన్నాడతను.

"వొద్దు. సైట్ సీయింగ్ తో అలిసిపోయాను. రోజంతా జనం మధ్యలోనే గడిచిపోయింది. ఇంక మళ్ళీ లోకంలోకి రాను. మీ దగ్గరగా.."

"గంటన్నరేగా? కమాన్!" అంటూ గంగాధర్ ఆమె నొదిలేసి వార్డ్ రోబ్ వైపు కదిలాడు. ముదురు పసుప్పచ్చరంగు కంజీవరం పట్టుచీర తీసి మంచంమీద పడేశాడు. "కట్టుకో కట్టుకో పట్టుచీర!" రాగయుక్తంగా పాడుతూ నవ్వాడు.

శశిప్రియ బుంగమూతి పెట్టింది.

"హోటల్ కి దగ్గరే. ఓడియన్ థియేటర్. కొత్త దంపతులు చూసితీరాల్సిన కళాఖండం ఆడుతోందని

ప్రొప్రయిటర్ జార్జ్ అడక్కుండానే టికెట్స్ తెప్పించేశాడు. "వండర్ ఫుల్ స్టిములెంట్ ఫర్ న్యూలీ వెడ్స్!" అన్నాడతను. వెళ్ళకపోతే మన కల్చర్ని సందేహిస్తాడు. పారిస్ దృష్టిలో ఇండియన్ కల్చర్ని మనం అవమానించకూడదు. పైగా మనిద్దరం షోబిజినెస్ వాళ్ళమని అతనికి తెలుసు!"

శశిప్రియ అతన్ని అలసటగా చూసింది. "తెలుగు సినిమాలో అతిచిన్న డైలాగ్ సైజులో మాట్లాడేస్తున్నారు! ఆల్ రైట్. ఓడిపోయాను. కళ్ళు మూసుకోండి. కంజీవరంలో ప్రత్యక్షమవుతాను!" అంది నవ్వుతూ...

కమర్షియల్స్ పూర్తయ్యాక అసలు సినిమా ప్రారంభమైంది. టైటిల్స్ లేవు. చివర్న వేస్తారా? ఆలోచిస్తూ చూస్తున్న శశిప్రియ ఉలిక్కిపడింది. మునివేతిని గిల్లుకుని, రెప్పలు రెపరెపలాడించి, మళ్ళీ చూసింది. ఆమె గుండె ఆగినంత పనయింది.

వెడల్పాటి స్క్రీన్ మధ్యలో ఆ యువతి నూలుపోగు లేకుండా ప్రత్యక్షమైంది. నీటిముత్యాలు ఆమె శరీరంమీద పూసల్లా మెరుస్తున్నాయి. బాత్ రూమ్‌లోని మిరర్ లో తనని చూస్తున్నట్టు అనుభూతి కలుగుతోంది ఆమెలో. కలా? నిజమా?

లోపల్నుంచీ తన్నుకొస్తున్న కేకని బలవంతంగా గొంతుకలోంచీ అణగదొక్కి, పక్కనే కూచున్న భర్తవేపు ఆందోళనతో చూసిందామె. గంగాధర్ మంత్రముగ్ధుళ్ళా చూస్తున్నాడు. అప్రయత్నంగా ఆమె అతని చేతిని పట్టుకుంది. గంగాధర్ చెయ్యి చల్లగా వుంది. ఆమె వేళ్ళు వణుకుతున్నాయి. అతను ఆమె చేతిని తీసి

చేయలేదు. ఆమెవైపు చూడలేదు. చీకట్లో అతని మొహాన్ని చదవడానికి శశిప్రియ వ్యర్థప్రయత్నం చేసింది.

సన్న మూలుగు ఆమె దృష్టిని తెరవైపు లాగింది. ఆమె శరీరం ఒక్కసారిగా చల్లబడింది. పొడుగ్గా, లావుగా వున్న యువకుడు మంచంమీద నగ్నంగా పడుకున్నాడు. అతనిమీద..తను...తనేనా? శశిప్రియ తలలో రాకెట్లు విపరీతంగా శబ్దం చేస్తూ దూసుకెళ్తున్నాయి. చెవుల్లో భయంకరమైన హోరు. కళ్ళు తిరుగుతున్నాయి. ఏమాత్రం సిగ్గూ, సంశయం లేకుండా తను అతనిమీద... తన మొహం అతని మొహంమీదికి వాలింది. నాలుగు పెదవులు రెండుగా కరిగి అతుక్కుపోయాయి. సన్నగా చప్పుడు. తన శరీరం వెర్రిగా, వెర్రిగా, వేగంగా కదులుతోంది. కడుపులోంచి తన్నుకొస్తున్న వాంతిని శశిప్రియ బలవంతాన ఆపుకుంది.

గంగాధర్ వేపు కంగారుగా చూసింది. అతను ఊపిరి పీల్చుకోని విగ్రహంలా కూచున్నాడు. ఆమె చెయ్యి అతని మణికట్టువేపు భయం భయంగా పాకింది. గంగాధర్ హార్టు....ఫెయిలైందా? టకటక కొట్టుకుంటున్న నాడి ఆమె వేళ్ళకి తగిలింది.

మరో కేక ఆమె దృష్టిని తెరవైపు లాగింది. తన ఆకారం ఇప్పుడు మంచంమీద అడ్డంగా పడివుంది. కాళ్ళు నేలని తాకుతున్నాయి. అతను కింద నించున్నాడు. అతను....అతని శరీరాన్ని, భయంకరంగా, అసహ్యంగా లజ్జలేకుండా అవుపిస్తున్న అతని శరీరాన్ని మరిచిపోతూ ఆమె అతని మొహంమీద దృష్టిని కేంద్రీకరించింది. ఎవరు? ఎవరతను? శశిప్రియ కళ్ళు మూసుకుంది. ఏదో

చీకటి అగాధంలోకి తను వేగంగా జారిపోతోంది. చిక్కటి కాటుక సముద్రంలో మునిగిపోతోంది. తారు లాంటి అలలు తనని మింగేస్తున్నాయి.

ఉన్నట్టుండి తన చేతిని ఎవరో లాగుతున్నారు... చెయ్యి పట్టుకుని తనని కాటుక సముద్రంలోంచి ఇవతలికి లాగుతున్నారు. శశిప్రియ ఉలికిపాటుతో కళ్ళు తెరిచింది. తనని యెవరూ లాగడం లేదు. తన వేళ్ళమధ్యనుంచీ గంగాధర్ చెయ్యి విడిపించుకోబడింది. అతను అటు వేపు నిలబడ్డాడు. అప్రయత్నంగా ఆమె లేచింది. తూలిపడబోతూ నిలదొక్కుకుంది.

తెరమీంచీ తను విచిత్రంగా పెడుతున్న చిన్న కేకలూ, మూలుగులూ ఆమె దృష్టిని బలవంతంగా లాగాయి. కళ్ళు మూసుకుని తలని ఆవేశంతో అటూ ఇటూ ఆడిస్తూ తను అర్థంలేని చప్పుళ్ళు చేస్తోంది. చర్మం వొలిచేసిన జింకతో కసాయివాడు శాడిస్టిక్‌గా ఆడుకుంటున్నట్టు యెవరో రాక్షసుడు తన శరీరాన్ని.... కానీ ఆ కసాయివాడి కార్యక్రమాన్ని తను సంపూర్ణంగా, హాయిగా ఎంజాయ్ చేస్తోంది!

బాక్స్‌లో తనొక్కతే వున్నట్టు ఆమె గుర్తించింది. కంగారుగా ఇవతలికి పరుగెత్తింది. పదడుగుల దూరంలో తల వాల్చుకుని, రెండు చేతుల్నీ కోటుజేబుల్లో దోపుకుని గాయపడిన సైనికుడిలా నడుస్తున్నాడు గంగాధర్. తడబడే అడుగుల్తో ఆమె అతన్ని వెంబడించింది. చెమటతో తన శరీరం తడిసి ముద్దయినట్టు శశిప్రియ గుర్తించింది. మెదడు పూర్తిగా మొద్దుబారిపోతోంది. అప్రయత్నంగా పట్టుచీర చెంగుని తలమీదుగా కప్పుకుని భర్తను అనుసరించింది.

గంగాధర్ వెనుతిరగలేదు. మంత్రముగ్ధుడిలా, స్లీప్ వాకర్‌లా కదులుతున్నాడు. అండర్ గ్రౌండ్ థియేటర్లోంచీ తను ఎలా బైటికి వచ్చిందో శశిప్రియకి తెలీదు. హోటల్ దాకా ఎలా నడిచిందో ఆమెకి తెలీదు....

మూసిన తలుపుకి బలహీనంగా జార్లాబడి అలాగే నిలబడిపోయిందామె. గదిలో ఆమె లేనట్టే గంగాధర్ ప్రవర్తిస్తున్నాడు. ఆమెవేపు చూడకుండా సూటు విప్పేశాడు. లుంగీ కట్టుకుని బాత్‌రూమ్‌వైపు నీరసంగా కదిలాడు. చెమటతో తడిసి బిగుసుకుపోయిన అతని మొహాన్ని కన్నీటి తెరల వెనకనుంచీ చూసిందామె. ఆర్నెల్లపాటు జబ్బుతో మంచంపట్టి, అప్పుడే లేచి మొదటిసారి నడుస్తున్న వ్యక్తిలా మెల్లిగా నడుస్తున్నాడు గంగాధర్. బాత్‌రూం తలుపు మూసుకుంది.

దుఃఖం వెల్లువలా ఆమెలోంచీ పొంగుతోంది. శశిప్రియ మంచంవేపు కదిలింది. అడ్డంగా బోర్లాపడిపోయి వెక్కి వెక్కి ఏడవసాగింది. ఏడుపు ఆమె భుజాల్నీ, వీపునీ గడగడ వణికిస్తోంది. ఏడుపు కన్నీళ్ళ రూపంతో ఆమె మొహాన్నీ, మెత్తటి పరుపునీ తడిపేస్తోంది....

* * *

శశిప్రియ ఉలిక్కిపడింది. ఆమె శరీరంలోని సర్వశక్తినీ ఏడుపు కన్నీళ్ళరూపంలో ఖాళీ చేసేసినట్టుంది. మెల్లిగా తలెత్తి మంచంమీద చూసింది. గంగాధర్ లేడు. శశిప్రియ గుండె దడదడ కొట్టుకుంది. కంగారుగా మంచంమీంచీ కిందికి దిగిందామె. తడబడే అడుగులతో బాత్‌రూమ్‌వేపు కదిలింది. బాత్‌రూమ్‌లో అతనులేడు. దుఃఖాన్ని దిగమింగే ప్రయత్నంలో పంటితో కింది పెదవిమీద గాటుపడుతోంది.... కింద, మంచం దగ్గర

కుప్పగా పడున్న గంగాధర్ గ్రే కలర్ సూట్ మీద ఆమె చూపులు వాలాయి.

శశిప్రియ గుమ్మంవేపు కదిలింది. వణికే చేత్తో తలుపు లాగింది. ఒక్కసారిగా ఆమె గుండె దడ తగ్గింది. ముందు గదిలో సోఫామీద వెనక్కి వాలి, కాళ్ళని టీపాయ్ మీద పెట్టి గది కప్పుని తదేకంగా చూస్తున్నాడు గంగాధర్. అతని పెదాలమధ్య సిగరెట్ వెలుగుతోంది. పొగ మేఘంలా అతని పైన వేళ్ళాడుతోంది! గంగాధర్ మళ్ళీ సిగరెట్ కాలుస్తున్నాడు!

శశిప్రియ వేగంగా అతనివైపు కదిలి, కొంచెం దూరంలో తటాలున ఆగింది. అతని కాళ్ళ పక్కన టీపాయ్ మీద సగం పైగా ఖాళీ అయిన షీవాస్ రీగల్ విస్కీ బాటిలుంది. పక్కనే ఖాళీ లోటా....శశిప్రియ ఆశ్చర్యంతో నోరు తెరుస్తూ అతన్ని సమీపించింది. గంగాధర్ తలతిప్పలేదు.

శశిప్రియ అమాంతం సోఫాలో కూలిపోయి, అతని వొళ్ళో తలదూర్చి వెక్కి వెక్కి ఏడవసాగింది. ఆమె చేతులు పెనుగాలిలో లేత తీగల్లా వణుకుతూ అతని శరీరాన్ని చుట్టే ప్రయత్నం చేస్తున్నాయి. గంగాధర్ చెయ్యి కదల్లేదు. ఆమె తలమీద వాలలేదు.

తన తల కిందినుంచీ అతను దూరంగా జరుగుతున్నట్టు ఆమె గుర్తించింది. అతని శరీరంమీంచీ ఆమె చేతులు బలహీనంగా జారాయి. ఆమె ముఖానికి సోఫా మెత్తగా, చల్లగా తగిలింది. విస్కీ లోటాలోకి దూకుతూ చప్పుడు చేస్తోంది. శశిప్రియ తటాలున తలెత్తి చూసింది.

లోటా అందుకుని అతను నిటారుగా నించున్నాడు.

అటు వేపు తిరిగి ఒక్క గుక్కలో దాన్ని ఖాళీచేశాడు.

"ఏమండీ....." శశిప్రియ ఏడుపు అతి కష్టం మీద పిలుపుగా మారింది. గంగాధర్ మరబొమ్మలా తల తిప్పాడు. ఎర్రగా వున్న అతని కళ్ళల్లో చైతన్యం, జీవం లేవు. విశ్వంలోని దుఃఖం, ఓటమీ ఆ కళ్ళల్లో స్పష్టంగా అవుపిస్తున్నాయి.

"నేను.... నేను.. ఏ పాపం ఎరగను.... మీరు తప్ప నన్ను ఎవ్వరూ.... తాకలేదని మీకు తెలుసు.... అదంతా ఏమిటో.... ఆ.... తెరమీది.... అన్యాయం.... ఏమిటో.... నిజంగా నాకు తెలీదు...." ఏడుపు ఆమెకి అడ్డుతగిలింది.

గంగాధర్ తదేకంగా క్షణకాలం ఆమె కళ్ళల్లోకి చూశాడు. నూనె రాసినట్టు అతని మొహం చెమటతో మెరుస్తోంది. మెల్లిగా అతని పెదవులు కదిలాయి. చిరునవ్వు అతని కండరాల్ని కదిలించింది. జీవంలేని చిరునవ్వది. ఓటమిని కళ్ళకి చూపించే చిరునవ్వు. కిందికి వొంగి విస్కీబాటిల్ని అందుకున్నాడతను. మెల్లిగా బెడ్‌రూమ్ వేపు కదిలాడు.

"ఏ....మం.. డీ !" శశిప్రియ దీనంగా అరిచింది. గంగాధర్ మెల్లిగా వెనక్కి తిరిగాడు. వణుకుతూ సోఫాలో కూచుని, కన్నీళ్ళతో తనని ప్రాధేయపూర్వకంగా, దయనీయంగా చూస్తున్న శశిప్రియ మొహంలోకి అయోమయంగా చూశాడు. అతని పెదవులు అదిరాయి.

"మాక్సీ లేకుండా నా కళ్ళకి కనపించాలంటే నీకు.. చచ్చేంత సిగ్గు! కదూ?" గంగాధర్ కంఠం బొంగురుగా వుంది.

శశిప్రియ భోరున ఏడుస్తూ రెండు చేతుల్లో మొహాన్ని

దాచుకుంది. బిగ్గరగా చప్పుడు చేస్తూ బెడ్ రూమ్ తలుపు మూసుకుంది. కన్నీళ్ళతో ఆమె అరచేతులు తడుస్తున్నాయి.

# 3

శశిప్రియ కన్నీళ్ళతో డిటెక్టివ్ టెంపోని చూసింది. టెంపో ఆమెని సానుభూతితో చూశాడు. పారిస్ ప్రణయం—వివరించడానికి ఆమెపడ్డ నరకయాతన ఆ కళ్ళల్లో స్పష్టంగా అవుపిస్తోంది.

"తరవాత?" ప్రశ్నించాడు టెంపో.

"గంగాధర్ నామీద విరుచుకుపడలేదు. కనీసం కోపం ప్రకటించలేదు. బంగారు బొమ్మ బదులు మట్టి బొమ్మ తనకి లభించిందన్న వోటమి, దైన్యం తప్ప మరో భావం ఆయన మొహంలో కనిపించలేదు. ఆయన తిట్టినా నాకు కొంత శాంతి లభించి వుండేది...."

శశిప్రియ చెప్పుకుపోతోంది.

"పారిస్ హోటల్ బెడ్ రూమ్ తలుపు మూసుకుంది. తరవాత?" టెంపో ఆమెని అసలు విషయంలోకి లాగాడు.

"ఆయన ఆ గదిలో, నేను ముందుగదిలో.... వుండిపోయాం. ఆ తరవాత నేను లేసట్టే ప్రవర్తించాడాయన. హనీమూన్ కాన్సిల్ చేశాడు. ఆయన విమానం ఎక్కాడు. నేనూ ఎక్కాను. ఇద్దరం ఇంటికి వచ్చాం. నన్ను వొది లేసి, ఎటో వెళ్ళిపోతాడని హడలిపోయాను. ఆయన నన్ను ప్రాణంలా ప్రేమించాడు. ఏదీ తేల్చుకోని అయోమయ స్థితిలో కొంతకాలం వుండిపోయాను. పారిస్ బ్లూ ఫిలిమ్ ఆయనకి నన్ను దూరం చేసింది; విస్కీని దగ్గర చేసింది. ఈ ఆర్నెల్లగా ఇద్దరం అపరిచిత వ్యక్తుల్లా ఒకే

కప్పుకింద జీవిస్తున్నాం."

టెంపో తలపంకిస్తూ సిగరెట్ వెలిగించాడు.

"నేను ఏ అపరాధం చేయలేదనీ, ఆ ఫిలింలోని మిస్టరీ ఏమిటో అర్థంకావడంలేదనీ, నిజాన్ని తేల్చి ఏదో నిర్ణయం తీసుకుందామనీ చెప్పి చూశాను. నా నిజాయితీని విప్పిచెప్పడానికి ప్రయత్నించాను."

"గంగాధర్ ఏమన్నాడు?" టెంపో ప్రశ్నించాడు.

"మిస్టర్ టెంపో! రాతివిగ్రహం ముందు మాట్లాడితే ఏ రెస్పాన్స్ వస్తుందో అదే వచ్చింది...."

టెంపో ఆశ్చర్యంగా చూశాడు.

"గంటసేపు నేను మాట్లాడినా గంగాధర్ పెదవి కదపడు. మాట్లాడే శక్తిని కోల్పోయిన వ్యక్తిలా, ప్రపంచంలోని బాధనంతా పోగుచేసి నింపుకున్న గిన్నెలాంటి కళ్ళతో నా మొహంలోకి చూస్తాడు. మెంటల్ షాక్ లాంటిది తగిలిందేమో అని భయపడ్డాను. గంగాధర్ కి తెలీకుండా సైకియాట్రిస్టు సుహాసినిని ఆయన్ని పరీక్షించమన్నాను. నాలుగు వారాలు టెస్టుచేసి గంగాధర్ నార్మల్ గా వున్నాడంది ఆమె!"

"ఆల్ రైట్ .... ఈ క్యాసెట్ ఎక్కడిది?" టెంపో విషయం మార్చి ప్రశ్నించాడు.

"పారిస్ లో ప్రత్యక్షమైన క్యాసెట్ ఇంకా ఎక్కడెక్కడ ప్రదర్శించబడుతోందో అని హడిలి చచ్చిపోయాను. తిరిగి రాగానే శేఖర్ ని ఆ పనిమీద నియమించాను ...."

"శేఖర్ ఎవరు?"

"నన్ను చిత్రరంగానికి పరిచయం చేసిన వ్యక్తి. నా డైరీ అతనే చూసేవాడు."

"చూసేవాడు అంటే ఇప్పుడు చూడ్డంలేదా?" టెంపో అడ్డుతగిలాడు.

"అర్నెల్లుగా గంగాధర్ ఆ పని చూస్తున్నాడు. గతాన్నీ, వర్తమానాన్నీ మరిచిపోడానికి తనకి ఆ పని అవసరం అన్నాడు. పారిస్‌నుంచీ తిరిగొచ్చాక నాతో మాట్లాడింది ఆ ఒక్కసారే! ఏదో వ్యాపకం చేతిలో వుంటే గంగాధర్ మామూలు మనిషి అవుతారనీ మా అనుబంధం చక్కబడుతుందనీ భావించాను. అన్నట్టు 'డైరీ' అంటే మీకు తెలుసనుకుంటాను."

"ప్రొడ్యూసర్స్‌కి నీ కాల్ షీట్స్ ఇవ్వడం" టెంపో నవ్వుతూ అన్నాడు. "రైట్, శేఖర్ని క్యాసెట్ పని మీద నియమించావు."

"యస్. మొదట ఇండియా అంతా గాలించమన్నాను. దొరికినచోట ఎంత డబ్బయినా పారేసి క్యాసెట్స్‌ని కొనేయమన్నాను. నాలుగు నెలలపాటు శేఖర్ భూప్రదక్షిణం చేశాడు. ఇంగ్లండ్, అమెరికా గల్ఫ్ కంట్రీస్, ఆఫ్రికా .... ఒకటేమిటి? అన్నీ. చివరికి పారిస్‌లోనే ఈ కాసెట్‌ని అతను పట్టాడు. కొన్ని లక్షల ఖర్చుతో ఈ క్యాసెట్ సంపాదించగలిగాను...."

"కాపీలు వుండొచ్చు!"

"ఉండొచ్చు....ఇవాళ కాకపోతే రేపు మార్కెట్లో కోకొల్లలుగా పుట్టుకురావొచ్చు. అది జరక్కుండా ఆపాలి!" శశిప్రియ ఉద్రేకంతో అంది.

డిటెక్టివ్ టెంపో ఫ్లాస్క్‌లోని టీని రెండు కప్పుల్లో పోశాడు. శశిప్రియ కృతజ్ఞతతో చూస్తూ ఒక కప్పు అందుకుంది.

"బ్లూ ఫిలిమ్స్ అమ్మే ప్రతిచోటా, అద్దెలకిచ్చే ప్రదేశాల్లో, ప్రదర్శించబడే ప్రదేశాల్లో శేఖర్ నిర్విరామంగా ప్రయత్నించాడు. అయినా, ఎక్కడో మరొక కాపీ దాక్కుని వుండొచ్చు. అంచేత మీరు అన్నిచోట్లా, అన్ని దేశాల్లో ప్రయత్నించి...."

టెంపో చెయ్యెత్తి ఆమెని వారించాడు. టీ కప్పుని కింద పెట్టి సిగరెట్ వెలిగించాడు. ఆమెవేపు తదేకంగా చూశాడు.

"శశిప్రియా. సముద్రంలో కలిసిపోయాక ఇంగువని పట్టుకోలేం. లోకమంతా వెతకడం కన్నా, ఈ క్యాసెట్ ఎక్కణ్ణుంచీ పుట్టుకొచ్చిందో ముఖ్యంగా మనం కనిపెట్టాలి!"

శశిప్రియ మాట్లాడకుండా చూసింది.

"ఈ సమస్యని ఎదుర్కోడానికి సరైన పద్ధతి అదే. దానికి నీ సహాయం పూర్తిగా, సంపూర్తిగా కావాలి."

"చెప్పండి. ఏం కావాలి?" శశిప్రియ ఉద్రేకంతో అంది.

"నిజం!"

శశిప్రియ కళ్ళు చిట్లిస్తూ చూసింది. టెంపో చిరునవ్వు నవ్వాడు.

"నేనడిగే ప్రశ్నలకి నువ్వు ఖచ్చితంగా నిజమైన సమాధానాలు చెప్పాలి!"

"అబద్ధాలాడాల్సిన అవసరం నాకు లేదు. అడగండి!" అందామె ఆవేశంతో.

"క్యాసెట్లోని ఆ వ్యక్తి ఎవరు?"

"తెలీదు."

"పెళ్ళికి ముందు నీకు ఎవరెవరితో శారీరక సంబంధం

వుందేమి?"

శశిప్రియ దెబ్బతిన్నట్టు చూసింది.

"శీలాన్ని సంతర్పణచేస్తే గానీ సినిమారంగంలో పైకి రావడం అసంభవమన్నది దాదాపుగా నిజమే. కానీ నా విషయంలో అది అబద్ధం. శరీరంతో కాకుండా సౌందర్యంతో నేను వెండితెరమీదికి ఎక్కాను. శరీరంతో కాకుండా టాలెంట్‌తో తారాపథం చేరుకున్నాను..."

టెంపో చిన్నగా నవ్వాడు. "సినిమా ప్రపంచంలో అని నేను అడగలేదు. 'పెళ్ళికి ముందు' అన్నాను!"

"మిష్టర్ టెంపో, గంగాధర్‌తో పెళ్ళి జరిగేదాకా నేను కన్యనే!"

టెంపో తలపంకిస్తూ సూటిగా ఆమె కళ్ళల్లోకి చూశాడు. "పెళ్ళి జరిగాక?"

శశిప్రియ చిన్నగా నవ్వింది. "పెళ్ళయ్యాక యే ఆడదీ కన్యగా కంటిన్యూ కాలేదని మీకు తెలుసు!"

టెంపో నవ్వలేదు. "పెళ్ళయ్యాక నీ కన్యాత్వం గురించి నేను ప్రశ్నించలేదు. పెళ్ళయ్యాక, నీ భర్త కాకుండా మరెవరేనా...."

"మిష్టర్ టెంపో....అయామ్ సారీ....నా భర్త గంగాధర్ ఒక్కడికే నేను భార్యను. ఆ మగాడికి ఒక్కడికే నేను ఆడదాన్ని!"

"పెళ్ళికిముందు నీకు మగాళ్ళతో శారీరక సంబంధం లేదు. పెళ్ళయ్యాక వేరే మగాడితో సంబంధంలేదు. మరి 'అది ఎలా తయారైంది?" టెంపో ప్రశ్నించాడు.

"అదే అర్థం కావడంలేదు...." శశిప్రియ నిస్సహాయంగా అంది.

డిటెక్టివ్ టెంపో సోఫాలోంచీ లేచాడు. పాంటు

జేబుల్లో చేతులు దూర్చి పచార్లు ప్రారంభించాడు. శశి ప్రియ తల అతను ఎటు తిరిగితే అటు తిరుగుతోంది. టెంపో తటాలున ఆగి ఆమెని తదేకంగా చూశాడు.

"శశిప్రియా, నీ ముఖం మాత్రం నేను చూడగలుగు తున్నాను. ఫిల్మ్‌లో 'నీ మొహం' మాత్రం నీదిగా నేను గుర్తించగలను. ముఖం కాకుండా తతిమ్మా శరీరం.... నీదో కాదో నాకు తెలీదు...." టెంపో ఆగాడు.

"నాకు తెలుసు: నాదే!"

టెంపో సాలోచనగా తల పంకించాడు. "ఆ మధ్య పేపర్లలో చదివే వుంటావు....ఒకానొక హిందీ నటి, ఒకానొక సినిమాలో ఒక మోస్తరుగా వివస్త్ర అయ్యే సీనుంది. ఆ తరవాత ఆ నటి నటించిన-నటించిన అనాలో పాల్గొన్న అనాలో నాకు తెలీదు—బ్లూ ఫిలిం క్యాసెట్లుగా వచ్చేసింది ."

"తెలుసు...."

"సినిమాలో గుడ్డలు ఊడదీసుకుంటున్న బిట్‌కి చాక చక్యంగా కంటిన్యూటీ అందించి, ఆ నటి మొహానికి మరో ఆడదాని శరీరాన్ని అతికించి ఆ బ్లూ ఫిలిం తయారుచేయ బడిందని తరవాత బైటపడింది...."

"తెలుసు. అలాంటి అవకాశం ఇక్కడలేదు. అయి దడుగులా అయిదంగుళాలూ సాక్షాత్తూగా శశిప్రియే!'

"నువ్వు ఇక్కడికొస్తున్నట్టు ఎవ్వరికి తెలుసు?" టెంపో ఉన్నట్టుండి విషయం మార్చి ప్రశ్నించాడు.

"వంటమనిషికే చెప్పాలి. ఫ్రెండింటికి వెళ్తున్నట్టు చెప్పాను. ఫ్రెండింటికి వెళ్ళాను. నా కార్ని అక్కడ వదిలేశాను. ఆమె కారు తీసుకొచ్చాను. జనం నా కార్ని గుర్తుపడ్తారు. అది ప్రమాదం...."

"అయితే నువ్విక్కడికి రావడం ఎవ్వరికీ తెలీదన్న మాట?" టెంపో అడ్డొస్తూ ప్రశ్నించాడు.

"తెలీదు. సుజాత ఇంటికి వెళుతున్నట్టు నా ఫ్రెండుకి చెప్పాను."

"గుడ్. చాలా పొద్దుపోయింది. నువ్వెళ్ళిపో. ఏం చేయాలో ఆలోచిస్తాను ..."

శశిప్రియ బాగ్ లోంచీ వందరూపాయల కట్టలుతీసి, టీపాయ్ మీద పెట్టింది. టెంపో వేపు చిరునవ్వుతో చూసింది. "ముఫ్ఫై వేలు. టోకెన్ అడ్వాన్స్! తరవాత ఎప్పుడు ఎంత కావాలంటే అంత ఇస్తాను. ఖర్చుకి వెనకాడకండి. ఆ ఫిలింలోది నేను కాదని నిరూపించండి. నా భర్తతో నన్ను కలపండి!"

టెంపో ఆమెవైపు అదోలా చూస్తూ సిగరెట్ వెలిగించాడు.

"గంగాధర్ కి నువ్వంటే యెంతో ప్రేమ అంటున్నావు. అతని ప్రేమ దీన్ని మన్నించలేదా?"

"శశిప్రియ నిట్టూర్చింది. "మిష్టర్ టెంపో, గంగాధర్ కి అదొక భయంకరమైన షాక్. అతని నమ్మకానికి దెబ్బ. అతని ప్రేమకి అగ్నిపరీక్ష. ప్రేమ వుంది కనకే ఇంకా నా దగ్గరే వున్నాడు. లేకపోతే ఎప్పుడో, ఎటో వెళ్ళిపోయేవాడు! నా నిజాయితీని నమ్మడానికి అతను ప్రయత్నిస్తున్నాడు. ఆ ప్రయత్నానికి దోహదంచేసే సాక్ష్యాన్ని సరఫరాచేస్తే గంగాధర్ మళ్ళీ మునుపట్లా అవుతాడు!"

"ఐసీ...." టెంపో మెల్లిగా అన్నాడు.

"తనని నిర్లక్ష్యంచేస్తూ, మరో ఆడదానితో సంబంధం పెట్టుకున్న భర్తని స్త్రీ సులువుగా క్షమిస్తుంది.

తనని నిర్లక్ష్యంచేస్తూ మరో మగాడితో తిరిగే భార్యని మగాడు అంత సులువుగా క్షమించలేడు! ప్రస్తుతం గంగాధర్ అదే స్థితిలో, ఆరాటంలో వున్నాడు!" శశిప్రియ ఉద్రేకంతో అంది.

"పెళ్ళిముందుగానీ, పెళ్ళయ్యాకగానీ, ఎప్పుడేనా నువ్వు హిరాయిన్, మారిజువానా, హషీష్‌లాంటి మాదక ద్రవ్యాల్ని శాంపిల్ చూశావా?"

శశిప్రియ ఉలిక్కిపడింది. "ఎందుకలా అడుగుతున్నారు?"

"వాటిన్ని ఉపయోగిస్తే నువ్వు మేఘాలమీద ఎగురుతూ వుంటావు అలాంటి స్థితిలో నువ్వేం చేస్తున్నావో నీకు తెలీదు. అలాంటి స్థితిలో వున్న నిన్ను వాడుకుని ఎవరేనా ఆ ఫిలిం తీసివుండొచ్చు...." టెంపో వివరించాడు.

"టెంపోగారూ, నేను నిద్రమాత్రకూడా వేసుకోను! నన్ను నమ్మండి!" శశిప్రియ ఆవేశంతో అంది.

"నీకు తెలీకుండా ఎవరేనా నీమీద వాటిని ప్రయోగించి వుండొచ్చు...."

శశిప్రియ తల ఆవేశంతో వూగింది. "నెవర్! నేనెప్పుడూ అలాంటివాళ్ళతో కలిసి తిరగలేదు!"

"ఓకే. నువ్వు తాటిచెట్టుకిందికి వెళ్ళలేదు. పాలు తాగలేదు. అయితే నువ్వు తాటిచెట్టుకింద పాలు మరిచి కల్లు తాగినట్టు బ్రహ్మాండమైన సాక్ష్యాలున్నాయి!" టెంపో చిన్నగా నవ్వాడు.

"మిస్టర్ టెంపో, ఆ సాక్ష్యాలు అబద్ధాలని నిరూపించండి. నా నిజాయితీని నిరూపించండి' నాలో కళంకం లేదని నా భర్తకి చాటిచెప్పండి! దీనికంతకీ

కారకులైన వ్యక్తుల్ని పట్టుకుని శిక్షించండి!" లేచి నిలబడి శశిప్రియ ఉద్రేకంతో అంది.

"ప్రయత్నిస్తా. వెళ్ళిరా. నాకు నీ ఫోన్ నంబరు కావాలి...." అన్నాడు టెంపో.

శశిప్రియ చిన్న కార్డుతీసి అందించింది. అతనివైపు అనుమానిస్తూ చూసింది.

"క్యాసెట్ ...."

"క్యాసెట్ నా దగ్గరే వుంటుంది."

"టెంపోగారూ, ఇదేదో తెలితేగానీ నాకు భవిష్యత్తులేదు. యాంత్రికంగా సినిమాల్లో నటిస్తున్నా..." శశిప్రియ దీనంగా అంది.

"నువ్వు త్వరగా, అతిత్వరగా తారాజువ్వలా పైకి చేరుకున్నావు. శశిప్రియా, నీకెవరేనా శత్రువులున్నారా?"

"ఎవ్వరూ లేరు. ఇంకా బైటపడకుండా శత్రుత్వాన్ని పెంచుకుంటూ ఎవరేనా ఉన్నారేమో నాకు తెలీదు!"

"ఓ.కే. రేపు ఉదయం శేఖర్ నన్ను కల్సుకోవాలి. వెళ్ళిరా. గుడ్ నైట్!"

## 4

"టెంపోగారూ, నమస్కారాలు. శశిప్రియ నన్ను పంపించింది...."

"కమిన్ శేఖర్!" టెంపో నవ్వుతూ అన్నాడు.

పొడుగాటి ఆకారం. పొడుక్కి తగ్గ లావు. కోల మొహం. వంకీలు తిరిగిన క్రాఫు. సన్నటి మీసాలు. శేఖర్ గదిలోకి వచ్చి, టెంపో ఎదురుగా సోఫాలో కూచున్నాడు.

"శేఖర్, శశిప్రియ క్యాసెట్‌ని ఎలా సంపాదిం

చావు?" టెంపో ప్రశ్నించాడు.

"ఇంగ్లండ్ ....యూరోయస్ యే...." శేఖర్ ప్రారంభించాడు.

"మళ్ళీ ఆ దేశాలన్నీ మనం తిరగొద్దు నేరుగా పారిస్ లోని ఓడియన్ థియేటర్ కి వెళ్దాం?" టెంపో అడ్డుతగిలి నవ్వాడు.

శేఖర్ చిన్నగా నవ్వాడు. అతని కళ్ళ చివర్లలో సన్నటి గీతలు ఏర్పడ్డాయి. "ఓడియన్ థియేటర్ ప్రొప్రయిటర్ విక్టర్ ఫ్రాన్స్ ని కల్సుకున్నాను. నాకు కావాల్సిన క్యాసెట్ ని ట్రేస్ చేయడానికి చాలా శ్రమపడ్డాను. చాలా ఖర్చుచేశాను. లేట్ షోస్ అయిపోయాక అతని స్టాక్ లో వున్న పాతిక బ్లూస్ ని శాంపిల్స్ చూశాను. మిస్టర్ టెంపో, దేశదేశాలూ తిరగడంకన్నా అది చాలా కష్టమైన పని! చివరికి ఇరవైయేడో ఫిల్మ్ మనది. మన కరెన్సీ లెక్కలో లక్షా పాతిక వేలు ఇచ్చేదాకా అతను క్యాసెట్ ఇవ్వలేదు!"

"అతను కాపీలు తీసుకున్నాడా?" డిటెక్టివ్ టెంపో ప్రశ్నించాడు.

"లేదనే అన్నాడు. అతనికి అనుమానం రాకుండా అడిగిచూశాను. అతన్ని నమ్మొచ్చనే అనుకుంటున్నా. ఎందుకంటే ఆ క్యాసెట్ లోనిదంతా 'డల్ స్టఫ్' అన్నాడతను...."

టెంపో ప్రశ్నార్థకంగా చూశాడు.

"నాచురల్ ఇంటర్ కోర్స్ ప్రస్తుతం ప్రేక్షకులకి మరీ సాదా అయిపోయింది. అది చాలా సింపుల్. పర్వర్టెడ్ కాంజుగల్ యూనియన్ లో మాత్రమే వాళ్ళకి కావాల్సింది దొరికేలా వుంది! అయినా సాదా సెక్సుని

లైక్ చేసే వ్యక్తులూ వుంటారు కాబట్టి విక్టర్ ఫ్రాన్స్ అడగ్గానే అమ్మడానికి నిరాకరించాడు...." శేఖర్ ఆగి, చూశాడు.

టెంపో అతన్ని సూటిగా చూశాడు. "శేఖర్, ఆ ఫిల్మ్‌లో తల మాత్రం శశిప్రియదీ, శరీరం మరొకరిదీ అవొచ్చా?"

శేఖర్ ఇబ్బందిగా చూశాడు. "లేదనుకుంటాను. శశి....ప్రియ అలా అనుకోవడంలేదు...."

"ఆమె ఉద్దేశం అటుంచు. నువ్వేమంటావ్?"

"తలనుంచీ కాళ్ళదాకా ఆమే అనుకుంటున్నాను."

టెంపో లేచి, సిగరెట్ వెలిగించి, అతనిముందు పచార్లు చేయసాగేడు. ఆగి, అతని కళ్ళల్లోకి తీక్షణంగా చూశాడు.

"నీకెలా తెలుసు?"

టెంపో ప్రశ్న చెంపదెబ్బలా తగిలిందతనికి. ఒకసారి నాలుకతో పెదాల్ని తడుపుకున్నాడతను. మాట్లాడకుండా, అర్థంకానట్టు టెంపోని చూశాడు.

"శేఖర్, శశిప్రియను ఆ ఫిల్మ్‌లో నువ్వు నగ్నంగా చూశావు. సాక్షాత్తుగా ఆమెని నగ్నంగా చూస్తే కానీ ఫిల్మ్‌లోని శరీరం ఆమెదో కాదో నీకు తెలీదు! అవునా?" టెంపో గంభీరంగా ప్రశ్నించాడు. అతని కళ్ళు శేఖర్ చూపుల్ని లాగిపట్టాయి.

శేఖర్ మొహం సిగ్గుతో ఎరుపెక్కింది. అతను అయోమయంగా చూస్తూ విగ్రహంలా కూచుండి పోయాడు. మెల్లిగా తెప్పరిల్లి చిరునవ్వు నవ్వే ప్రయత్నం చేశాడు.

"తలపైనుంచి ప్రపోర్షనేట్‌గా బాడీ వుంది. పైగా

శశిప్రియ అది తనే అని అంటోంది. అందువల్ల అలా అనుకున్నాను...."

"అంటే, ఫిల్ములోని స్త్రీ పూర్తిగా శశిప్రియే అని నువ్వు ఖచ్చితంగా చెప్పలేవు! అంతేగా?" టెంపో ప్రశ్నించాడు.

"....ఆఫ్ కోర్స్. అయితే...."

"శేఖర్, ఒక ఎక్స్‌పర్టు కెమెరామన్ నాకు కావాలి" టెంపో అడ్డొస్తూ అన్నాడు. "అతను శశిప్రియ చిత్రాలకి పనిచేసిన వ్యక్తి అయితే మరీ మంచిది."

"గిరీశ్ ఆర్యకి ఎక్స్‌పర్టుగా మంచి పేరుంది. ట్రిక్ ఫోటోగ్రఫీలో ఆయన బాబూభాయ్‌మిస్త్రీని మించిపోయాడు. అయితే అతనికి తీరిక వుండదు...."

"శశిప్రియ చిత్రాలకి అతనే పనిచేశాడా?" టెంపో అడ్డొస్తూ అడిగాడు.

"ప్రస్తుతం ఆమె నటిస్తున్న ఎనిమిది చిత్రాలకీ ఆయనే పనిచేస్తున్నారు....అయితే...."

"అయితేలూ, గియితేలూ లేవు, శేఖర్! రాత్రి ఏడు గంటలకి అతను ఇక్కడుండాలి! అవసరమైతే శశిప్రియకి భయంకరంగా పడిశం పట్టేస్తుంది. షూటింగ్ కాన్సిలవుతుంది!" టెంపో నవ్వుతూ అన్నాడు.

"శశిప్రియ చేస్తున్న ఎనిమిది చిత్రాలూ చాలా పెద్ద ప్రొడ్యూసర్సవి. పైగా గంగాధర్ గారు ఆ కాల్ షీట్స్ ఫిక్స్ చేశారు. శశిప్రియ ఏ కారణంచేత షూటింగ్ కాన్సిల్ చేయించినా, ప్రొడ్యూసర్ గంగాధర్ గార్ని కల్సుకుంటాడు. ఆయన ఆఫెండవుతాడు....అసలే.... వాళ్ళిద్దరిమధ్యా బొత్తిగా బాగోలేదు...." అన్నాడు శేఖర్ మెల్లిగా.

బెంపో మౌనంగా సిగరెట్ ముట్టించి, శేఖర్ వైపు చూస్తూ సోఫాలో కూచున్నాడు. "శేఖర్, హనీమూన్ తరవాత కూడా గంగాధర్ ఆమె డైరీ చూస్తున్నాడా?"

శేఖర్ తలాడించాడు. "ఆయనే చూస్తున్నారు.... మనోవ్యాకులతవల్ల కాల్‌షీట్స్‌ని సక్రమంగా ఆయన డిస్ట్రిబ్యూట్ చేయడంలేదని అనుకుంటున్నా. ఆమెకి ఇతర ఆర్టిస్టులకీ, ప్రొడ్యూసర్లకీ, డైరెక్టర్లకీ ఆ కాల్‌షీట్స్ మరీ క్రౌడెడ్‌గా వున్నాయి. శశిప్రియకు మార్కెట్ వాల్యూ వుంది గనక అందరూ కిక్కురుమనకుండా వున్నారు. ముఖ్యంగా శశిప్రియకి రెస్టులేకుండా పోయింది...."

"ఐసీ..." అన్నాడు బెంపో. శేఖర్ మాట్లాడుతున్నాడు. ఒకోసారి ఎదుటి వ్యక్తి మాటల్ని చెవులప్పగించి వినడం మంచిది.

"ఇండస్ట్రీలో చాలామంది శశిప్రియ కాల్‌షీట్స్ గురించి నాతో అన్నారు. ఉక్కిరిబిక్కిరి చేసే కాల్‌షీట్స్‌వల్ల చిత్రం క్వాలిటీ దెబ్బతింటుంది. క్వాలిటీ దెబ్బతింటే మెయిన్ ఆర్టిస్టు మార్కెట్ పడిపోతుంది; నిర్మాతలు ఆరిపోతారు గనక!"

"ఐసీ. .గంగాధర్ క్వాలిఫైడ్ డైరెక్టరని విన్నాను. అతనికి ఇది తెలీదా?" బెంపో ప్రశ్నించాడు.

"తెలుసు. బ్లూ ఫిల్మ్ ఆయన హృదయాన్ని గాయపరిచింది. దాన్ని ఆయన మరిచిపోలేరు. శశిప్రియ ప్రేమని గుర్తుంచుకోలేరు! ఆమెకీ తనకీ తీరికలేని వ్యాపకంవుంటే తప్ప మనశ్శాంతి వుండదన్న అభిప్రాయం ఆయనకి వున్నట్టుంది..."

"శేఖర్, శశిప్రియ డైరీని గంగాధర్ తీసేసుకున్నాక, నువ్వు ఎవరి డైరీ చూస్తున్నావు?" టెంపో ప్రశ్నించాడు.

శేఖర్ సోఫాలో ఇబ్బందిగా కదిలాడు. అరచేతుల్ని బోర్లించి పదిగోళ్ళనీ జాగ్రత్తగా పరీక్షించుకున్నాడు. మెల్లిగా తలెత్తి టెంపోవైపు చూశాడు. "శశిప్రియను నేనే పరిచయం చేశాను. ఆమెలోని మార్కెట్ వాల్యూని గుర్తించి, చిల్లర ఆర్టిస్టుల డైరీల్ని వదిలేశాను. ఇప్పుడు కొత్త నటీనటులకోసం గాలిస్తున్నాను. కొత్త వాళ్ళని పోటీలో ఇరికించడం అంత సులభంకాదు లెండి...."

డిటెక్టివ్ టెంపో క్షణకాలం యేదో ఆలోచిస్తూ కళ్ళు మూసుకొని, సోఫా వెనక్కి తలవాల్చాడు. కళ్ళు తెరిచి శేఖర్ ముఖంలోకి తదేకంగా చూశాడు.

"టెంపోగారూ, నేను వెళ్తాను. గిరీశ్ ఆర్య గురించి శశిప్రియకు చెప్తాను...." శేఖర్ లేచే ప్రయత్నం చేస్తూ అన్నాడు.

"శేఖర్, శశిప్రియను నువ్వు ప్రేమించావ్!" టెంపో కంఠం గంభీరంగా ధ్వనించింది.

శేఖర్ ఉలిక్కిపడ్డాడు. అతని ముఖం తెల్లబడడం ప్రారంభించింది. తనకి అర్థంకాని కొంకిణి భాషలో టెంపో ఏదో అన్నట్టు చూశాడతను.

"టెంపోగారూ.... మీది ప్రశ్న కాదు! తెలిసిన విషయం గురించి చెప్పినట్టు అన్నారు.... నేను...." శేఖర్ తడబడుతూ ఆగాడు.

"చాలా సేపట్నుంచీ నేను అడగని ప్రశ్నకి నీ కళ్ళు సమాధానం చెప్తున్నాయి. శశిప్రియ గురించి మాట్లాడిన ప్రతిసారీ నీ కళ్ళల్లో లీలగా ఆనందం, స్పష్టంగా బాధా

పెనవేసుకోడంలో విఫలమవుతున్న పాముల్లా అవుపిస్తున్నాయి శేఖర్!" డిటెక్టివ్ టెంపో గంభీరంగా అన్నాడు.

శేఖర్ ఓటమిని అంగీకరిస్తూ బరువుగా నిట్టూర్చాడు. "మిస్టర్ టెంపో, ప్రేమ విషయంలో అబద్ధాలాడకూడదు. ఆమెని....ప్రేమించాను....అదంతా గతం..."

"ఇంకా ప్రేమిస్తున్నావు. ఇదంతా వర్తమానం!" టెంపో నవ్వుతూ అన్నాడు.

శేఖర్ నిస్సహాయంగా, నీరసంగా చూశాడు. "టెంపోగారూ, మీదికాని తోటలోని గులాబీని మీరు దూరంనుంచి చూసి ఆనందించగలరు. అంతే! కోసి, కోటుకి గుచ్చుకోలేరు...."

డిటెక్టివ్ టెంపో అతన్ని చిరునవ్వుతో చూసాడు. "యూ ఆర్ రైట్. శేఖర్, మీ ప్రేమ గురించి గంగాధర్ కి తెలుసా?"

"మీ ప్రేమ అంటున్నారు. అది 'నా' ప్రేమ మాత్రమే! నేను చాలా స్లో మనిషిని. సకాలంలో నా ప్రేమ గురించి శశిప్రియకు వ్యక్తం చేయలేదు,"

"అకాలంలో వ్యక్తం చేశావా?" టెంపో నవ్వుతూ ప్రశ్నించాడు.

శేఖర్ తల బలహీనంగా అటూ ఇటూ ఊగించి. "..లేదు. నేను సిద్ధమవుతూవున్నప్పుడే గంగాధర్ గారూ, శశిప్రియా రాకెట్లో యెగిరిపోయారు! గిన్నెలు ఖాళీ అయ్యాక, నా ఆకలి గురించి చెప్పడం దండగ!"

టెంపో నవ్వుతూ చూశాడు. "శేఖర్, పెళ్ళయ్యేదాకా శశిప్రియ కన్యగానే వుందా?

శేఖర్ కంగారుగా చూశాడు. అతని పెదవులు కొద్దిగా అదిరాయి.

"నాకు.... నాకు.... తెలీదు...."

"శశిప్రియ నాతో పని అప్పగించింది. ఆ పని జయప్రదంగా పూర్తిచేయాలంటే నాకు ఎన్నో నిజాలూ, ఇంకెన్నో అబద్ధాలూ, నిజాల్లా ధ్వనించే అబద్ధాలూ అబద్ధాల్లా ధ్వనించే నిజాలూ కావాలి! నువ్వు నీకు తెలిసిన నిజాన్ని పూర్తిగా చెప్పడం లేదని నాకు తెలుసు, శేఖర్!" టెంపో గంభీరంగా అన్నాడు. అతని కళ్ళు సూర్యకాంతిలో తళుక్కుమనే కత్తి కొసల్లా మెరుస్తున్నాయి.

శేఖర్ కళ్ళు చిట్లించాడు. "మిస్టర్ టెంపో...."

"బ్లూ ఫిల్మ్‌ని ట్రేస్ చేయడానికి ఆమె నిన్ను పంపించింది. తనని స్పష్టంగా చూసిన వ్యక్తి కాకపోతే బ్రహ్మాండమైన నమ్మకం లేకపోతే ఆమె నిన్ను తన విశ్వరూపం వున్న డర్టీ ఫిల్మ్‌ని చూడ్డానికి పంపించేది కాదు!"

శేఖర్ కంగారుగా, అయోమయంగా చూశాడు. మెల్లిగా అతని పెదవులు కదిలాయి.

"పెళ్ళికిముందు, గంగాధరంతో ఆమె పరిచయం ముదరక ముందు ఒక సంఘటన జరిగింది.. ఆ రోజు రాత్రి పదిదాటాక శశిప్రియ ఇంటికి వెళ్ళాను. ఉదయం నుంచీ ఆమె ఆరోగ్యం బాగోలేదని నాకు తెలుసు. తలుపులన్నీ మూసి వున్నాయి. గొళ్ళేలు పెట్టలేదు. ఆమె గదిలోకి వెళ్ళాను. మంచంమీద దాదాపు అపస్మారక స్థితిలో ఆమె పడుకుంది. ఆమె శరీరం పూర్తిగా చెమటతో తడిసిపోయింది మొహంమీంచీ కారుతున్న చెమటతో తలగడ తడుస్తోంది. కంగారుగా ముట్టుకుని

చూశాను. ఆమె శరీరం కాలుతోంది.

"అప్రయత్నంగా ఆమె దుస్తుల్ని తొలగించాను. తడిగుడ్డతో ఆమె శరీరాన్ని పూర్తిగా, జాగ్రత్తగా తుడిచాను. డాక్టర్‌కి ఫోన్ చేశాను. ఇంజక్షన్స్ ఇచ్చాననీ తడిగుడ్డని నుదురుమీద కప్పమనీ డాక్టర్ అన్నాడు. అలాగే చేశాను. తెలవజాము దాకా, ఆమెకి దుప్పటి కప్పలేదు. చెలమలోంచీ నీరు ఊరుతున్నట్టు ఆమె శరీరం లోంచి చెమట ఊరుతూనే వుంది. అప్పటికే ఆమె నా ఆరాధ్య దేవత అయివుంది. రెప్పపాటు లేకుండా ఆమెను చూస్తూ అలాగే కూచుండిపోయాను. అరోజా, ఆ క్షణాల్లో నేను చూసిన ఆమె నగ్న సౌందర్యం నా మెదడుమీద పచ్చపొడవబడింది. ఆ అందాన్ని ఎన్ని జన్మలెత్తినా మరిచిపోలేను.." శేఖర్ ఆగి, నుదుర్ని కమ్మిన చెమటను తుడుచుకున్నాడు.

టెంపో అతన్ని చిరునవ్వుతో చూశాడు.

"కానీ, మిష్టర్ టెంపో, నాలో బ్రద్దలవుతున్న కోరికని ఆమె అసహాయిస్థితి కంట్రోల్ చేసింది. మామూలు సమయంలో ఆమెని అలా చూసివుంటే నన్ను నా కోరికను కంట్రోల్ చేసుకునేవాణ్ని కానేమో! నిస్సహాయంగా, అప్పుడే పుట్టిన పాపాయిలా నాముందు వెల్లకిలా పడుకున్న శశిప్రియను.. నేను..అనుభవించలేదు! నన్ను నమ్మండి!"

"ఐ బిలీవ్ యూ, శేఖర్!" టెంపో క్లుప్తంగా అన్నాడు.

"పొద్దుటే తను గుడ్డలేకుండా పడుకున్న విషయం ఆమె గమనించి వుంటుంది. నేనే ఆమె గుడ్డల్ని తీసేశానని ఊహించి వుంటుంది. కానీ, శశిప్రియ నన్ను

అడగలేదు; నేను చెప్పలేదు. తనని నేను ఒకరాత్రంతా నగ్నంగా చూశానని తెలుసుకున్న ఆమె నన్ను ఫిల్మ్ సెటకి పంపివుండొచ్చు, మిస్టర్ టెంపో!" శేఖర్ సంజాయిషీ ఇస్తున్నట్టుగా అన్నాడు.

టెంపో నవ్వుతూ లేచాడు. "ఓకే. శేఖర్. వెళ్ళిరా. అవసరం అయితే ఫోన్ చేస్తాను. శశిప్రియ యేదో షూటింగ్‌లో వుండనుకుంటా. ఆమెకి ఫోన్ చేయి. గిరీశ్ ఆర్య రాత్రికి ఇక్కడ వుండేలా చూడమను. ఆమె ఏం చేస్తుందో నాకు అనవసరం!"

తలాడిస్తూ శేఖర్ వెళ్ళిపోయాడు.

టెంపో కుర్చీలో కూచుని టెలిఫోన్ రిసీవర్ అందుకున్నాడు. ఆలోచిస్తూ సిగరెట్ వెలిగించాడు. తనలో యెన్నో సందేహాలున్నాయి. తన సందేహానికి సమాధానాలు—తడుముకోకుండా—ఇచ్చే వ్యక్తి 'గాసిప్ కాలమ్' ఎక్స్‌పర్టు చిన్నారావు ఒక్కడే. వెండితెర వెనక భాగోతాల్ని పాఠకులకి అమ్ముతూ, మేడలూ మిద్దెలూ కొంటూ సెట్టుకొస్తున్నాడు! టెంపో నవ్వుకుంటూ చిన్నారావు నంబరు డయల్ చేశాడు.

## 5

డిటెక్టివ్ టెంపో అతన్ని నవ్వుతూ చూశాడు. అతను నవ్వలేదు.

"మిస్టర్ టెంపో, అయామే బిజీమాన్. పదిహేను నిముషాలు మాత్రం మీకు స్పేర్ చేయగలను. విధిలేక శశిప్రియ మాటని కాదనలేక ముఖ్యమైన పనిని అసిస్టెంటుకి అప్పజెప్పి, పరుగెట్టుకొచ్చాను. వాట్ డూయూ వాంట్?" గిరీశ్ ఆర్య గబగబా అన్నాడు. అతని వాలకం అయిష్టతని స్పష్టంగా వ్యక్తంచేస్తోంది. రిమ్

లెన్ కళ్ళద్దాలు పెరిసిన గిరిజాల జుట్టు. కెమెరా లెన్స్ లాంటి కళ్ళు. టెంపో అతన్ని ఒకసారి ఎగాదిగా చూశాడు.

"నాకేం కావాలో శశిప్రియ...."

"చెప్పలేదు. అఘ మేఘాలమీద వెళ్ళి మిమ్మల్ని కల్సుకోమ్మంది. ఏం కావాలో త్వరగా...."

"మిస్టర్ ఆర్యా, మీరు నాతో కనీసం గంటసేపు వుండాలి. వీల్లేదంటే ఇప్పుడే అఘ మేఘాలమీదే వెళ్ళిపోడం మంచిది!" టెంపో నవ్వుతూ అన్నాడు. సోఫాలో కూచుని, తీరుబడిగా సిగరెట్ వెలిగించాడు.

గిరీశ్ ఆర్య ఆశ్చర్యంగా చూశాడు. భరతనాట్యం ప్రాక్టీస్ చేస్తున్నట్టు పాదాల్ని కదిలించాడు. "చాలా ముఖ్యమైన, తొందరపని అనీ, తన పనే అనుకోవాలనీ శశిప్రియ ప్రత్యేకంగా చెప్పింది" ఎటూ తేల్చుకో లేకుండా నసిగాడతను.

"శశిప్రియ ప్రత్యేకంగా చెప్పివుంటే తన పనే అని చెప్పివుంటే అది ఆమె తలనొప్పి. గిరీశ్ ఆర్య టైం స్పేర్ చేయలేనప్పుడు మరో నరేశ్ ఆర్యను ఆమె పంపాలి" టెంపో నిర్లక్ష్యంగా నవ్వాడు.

గిరీశ్ ఆర్య మొహంమీద ఏదో మాస్కుని ఎవరో పీకిపారేసినట్టయ్యింది. అప్రయత్నంగా అతను సోఫాలో కూలబడ్డాడు. కళ్ళద్దాల్ని తీసి టెంపోవైపు నవ్వుతూ తిరిగాడు. గుర్రం దిగేసిన గిరీశ్ ఆర్యని టెంపో చిరునవ్వుతో చూశాడు.

"మిస్టర్ టెంపో, ఆల్ రైట్ గంట! చెప్పండి!" అన్నాడు గిరీశ్ ఆర్య.

"మిస్టర్ ఆర్యా, అద్దాలు పాలిష్ చేసి, తగిలించండి.

ఒక వీడియో కాసెట్ ప్లే చేసి చూపిస్తాను. అందులోని శశిప్రియ శశిప్రియ అవునో కాదో మీరు చెప్పాలి!" అంటూ టెంపో లేచి, టీవీ వైపు కదిలాడు. ఏదో అడగబోయిన గిరీశ్ ఆర్య, మనసు మార్చుకొని సిగార్ వెలిగించాడు.

"గుడ్ హెవెన్స్!" స్క్రీన్ మీద ప్రత్యక్షమైన శశిప్రియని చూసి ఆర్య ఆశ్చర్యంతో అరిచాడు.

"పూర్తిగా చూడండి. పూర్తిగా మీ కళ్ళని ఉపయోగించండి! పూర్తిగా అయ్యేదాకా నోరు ఉపయోగించకండి." అతని పక్కనే కూచుంటూ టెంపో అన్నాడు. ఆర్య అప్రయత్నంగా తలపంకిస్తూ చూపుల్ని స్క్రీన్ మీద నాటేశాడు.

* * *

గిరీశ్ ఆర్య ఆశ్చర్యం నిండిన కళ్ళతో డిటెక్టివ్ టెంపోని చూశాడు. మొహానికి పట్టిన చెమటని అరచేతో తుడుచుకున్నాడు.

"మై గాడ్ మిస్టర్ టెంపో, నా కళ్ళని నమ్మలేకుండా వున్నాను! ఈ డర్టీ థింగ్ ఎక్కడిది?"

టెంపో చిన్నగా నవ్వాడు. "అదంతా శశిప్రియ మీకు వివరిస్తుంది. ఫిల్మ్‌లోని ఆడది ఆమేనా?"

"అందుకు సందేహంలేదు! కాలిగోటినుంచీ తల వెంట్రుకలదాకా ఆమే!" ఆర్య ఉద్రేకంతో అన్నాడు.

"మిస్టర్ ఆర్యా, అది మీకెలా తెలుసు?" టెంపో నవ్వుతూ అడిగాడు.

గిరీశ్ ఆర్య అర్థంకానట్టు కళ్ళు చిట్లించాడు. మెల్లిగా అతని మొహంమీద చిరునవ్వు ప్రత్యక్షమైంది. "మీ సందేహం నాకు అర్థమైంది. ఆమెని ప్రత్యక్షంగా

నగ్నంగా చూసివుంటేగానీ, ఆ బొమ్మలో బొమ్మ ఆమె అవునో కాదో ఖచ్చితంగా చెప్పడానికి వీల్లేదు. పూర్తి నగ్నంగా కాకపోయినా, దాదాపు నగ్నంగా శశిని చాలాసార్లు చూశాను, కెమెరామన్‌గా. క్రేప్ పేపర్లాంటి చీర తగిలించి, అరగంట పాటు నీళ్ళల్లో యాక్ట్రెస్‌ని నానబెట్టి, ఏదో పాట సిచ్యుయేషన్‌లోనో స్నానఘట్టంలోనో చూపిస్తేగానీ సినిమా హిట్ కాదని నిర్మాతలూ, దర్శకులూ అనుకుంటారు. హీరోయిన్ నీళ్ళలో తడిసి ముద్దయిపోయి అవుపిస్తేగానీ సన్నివేశంలో 'ప్రేమ' లేదని ప్రేక్షకులు అనుకుంటారు!"

టెంపో నవ్వాడు. గిరీశ్ అర్ధ సిగార్ వెలిగించాడు.

"శశి నటించిన పదిహేను చిత్రాలకి పైగా నేనే వర్క్ చేశాను. దాదాపు ప్రతిచిత్రంలోనూ ఆమెని నీళ్ళల్లో ముంచి, ఇవతలికితీసి షూట్ చేశాం. 'సెన్సార్ కన్ను' పడకుండా వుంటే, తడిపిన ఉలిపిరికాయితంలో అడదాన్ని నగ్నంగా ఎలా చూపించవచ్చో మీకు — అంటే ప్రేక్షకులకి అర్థమయ్యేది! చెప్పొచ్చేదేమిటంటే, ఆ విధంగా శశిప్రియను దాదాపు నగ్నంగా చాలా చాలా సార్లు నేను చూశాను. ఆమె శరీరంలోని ఒక్కో భాగాన్నీ క్లోసప్ షాట్స్‌లో, లెన్సుగుండా చూశాను. చాలామంది తారల వివిధ అంగాలు విడివిడిగా నా కెమెరా కళ్ళకి బాగా పరిచయం వున్నాయి; ఒక్క జననాంగాలు తప్పించి!" గిరీశ్ నవ్వుతూ అన్నాడు.

"అయితే...." టెంపో యేదో అడగబోయాడు.

"ఇంకో 'సాక్ష్యం' కూడా మీకు చూపిస్తాను. శశిప్రియ మోకాలి మడతకింద అర్థరూపాయి సైజులో గోధుమరంగు మచ్చవుంది. దాన్ని చాలాసార్లు నేను

చూశాను. ఫిల్మ్‌లో ఆమె కాలు పైకెత్తినప్పుడు ఆ మచ్చ నాకు బాగా కనిపించింది! అంటే తల శశిదీ, క్రింద మరో పనిదీ అయ్యుండొచ్చన్న మీ ఆలోచనని మరిచిపోండి. ఫిల్మ్‌లో ఇంత సేపూ కసరత్తు చేసింది శశిప్రియే!" గిరీశ్ ఆర్య నిర్ధారణగా అన్నాడు.

టెంపో అతన్ని నవ్వుతూ చూశాడు. "ఆమె శశి ప్రియ కాదేమో అన్న ఆశతో ప్రయత్నించాం. ఆల్ రైట్....ఆ మచ్చని సృష్టించి...."

"మిస్టర్ టెంపో. ప్రామినెంట్‌గా, ఆకర్షణీయంగా అవుపించే శరీర భాగాల్లో ఏవేనా పుట్టుమచ్చలూ, గాయాల మచ్చలూ అవసరమైతే సృష్టించి డూప్‌ని పెట్టి ఇలాంటి ఫిల్మ్స్ తీస్తారు. మోకాలికింద వున్న పుట్టుమచ్చని డూప్‌కి సృష్టించేంత జాగ్రత్త ఎవ్వరూ తీసుకోరు. ఎందుకంటే చూసేవాళ్ళ దృష్టిని మోకాలి వెనక భాగం అంతగా ఆకర్షించదు. మోకాలి వెనకభాగం కనిపించేలా కాలు కదిలినపుడు ప్రేక్షకుల కళ్ళని లాగిపట్టే భాగాలు వేరే వుంటాయి!"

"మాటవరసకి అనుకుందాం: మీరు చూసిందాన్ని బట్టి బ్లూ ఫిల్మ్‌లో తల ఒకరిదీ. బాడీ ఒకరిదీ అయ్యే అవకాశం వుందా?" టెంపో ప్రశ్నించాడు.

"ఖచ్చితంగా లేదు!"

"టెక్నికల్‌గా చెప్పండి!"

గిరీశ్ ఆర్య తలాడించాడు. "మీరు అంటున్న విధంగా ట్రిక్ ఫొటోగ్రఫీతో శశిప్రియ తలకి మరో ఆడశరీరాన్ని తగిలిస్తే, దాన్ని కనిపెట్టడానికి రెండు అవసరం. ఒకటి: శశిప్రియ అసలు శరీరంలో ప్రతి అంగుళం కూడా 'చూసే వ్యక్తి' ప్రత్యక్షంగా చూసి వుండాలి. అదికూడా ఒక

సారి చూస్తే చాలదు. ఆమె నగ్న శరీరంతో చాలా దగ్గరైన, చాలా కాలంగా వున్న ఇంటిమేట్ పరిచయం వుండాలి. మీ శరీరంతో మీకున్న పరిచయం కంటే ఎక్కువ పరిచయం అవసరం. ఎందుకంటే మీ శరీరంలో కొంత భాగంతో మీకు ప్రత్యక్ష పరిచయం వుండదు!

"రెండు: ఒకే శరీరంగా చూపించబడుతున్న బొమ్మలో రెండు శరీరాలు—ఒక తలా, ఒక మొలా—వున్నాయని కనిపెట్టడానికి, కెమెరా ట్రిక్‌ని కనిపెట్టడానికి టెక్నికల్ ఐ, సాంకేతిక నేత్రం వుండాలి! నేను ఆ సాంకేతిక నేత్రాన్ని ఉపయోగించాను. నాలాంటి అనుభవజ్ఞుడైన వ్యక్తి కంటికి ఆ 'ట్రిక్ రోంగ్' సులభంగా దొరికిపోతాడు! మనం చూసిన బొమ్మలో కెమెరా ట్రిక్ లేదని ఖచ్చితంగా, సగర్వంగా చెప్పగలను! అది ముమ్మూర్తులా శశిప్రియే! అయామ్ సారీ ఫర్ దట్ కిడ్!"

టెంపో సిగరెట్ వెలిగించి, నవ్వుతూ, "మిష్టర్ ఆర్యా, యూ ఆర్ రియల్లీ యాన్ ఎక్స్‌పర్ట్! మీరు వివరించిన అణువు అణువుతోటీ అతిదగ్గర పరిచయం, టెక్నికల్ దృష్టి రెండూ కాకుండా, అతి సాధారణమైన మరో 'ఆధారం'తో కూడా ఆ బొమ్మ శశిప్రియదో కాదో చెప్పొచ్చు! చెప్పమంటారా?"

గిరీశ్ ఆర్యా గుబురు కనుబొమలు అతని నుదుర్ని ఎన్నో ముడతలుగా పైకి తోశాయి. "చెప్పండి.!"

డిటెక్టివ్ టెంపో అతన్ని తదేకంగా చూశాడు. "మీరు మీ మనవడిని ఎత్తుకుని లాలించి ముద్దెట్టుకోబోతారు. మీ వాత్సల్యం మొందట మీ హృదయం

లోంచీ కళ్ళల్లోకి చూసుకో స్తుంది. అంటే మీ కళ్ళు రియాక్ట్ అవుతాయి. మనవడి పాలబుగ్గని ముద్దెట్టుకోడానికి మీ పెదవులు సున్నితంగా కదుల్తూ రియాక్ట్ అవుతాయి. మనవడిని పట్టుకున్న మీ చేతులు వాత్సల్య భారంతో రియాక్ట్ అవుతాయి. పాపడిని మీ దగ్గరగా ప్రేమగా లాగుతాయి. మీ హృదయంలోని వాత్సల్యం కళ్ళల్లోకీ, పెదవుల్లోకీ, చేతుల్లోకీ ప్రవహిస్తుంది. మీరు మనవడిని ముద్దెట్టుకుంటారు. అంటే మీ హృదయంలోని కోరికకి అనుగుణంగా కళ్లూ, పెదవులూ, చేతులూ ప్రవర్తించాయన్నమాట. మీ కళ్ళల్లో, మొహంలో ప్రత్యక్షమైన మీ వాత్సల్యం మీ చేతుల్లో పెదవుల్లో వ్యక్తమైనాక స్పష్టంగా కనిపించిందన్నమాట!"

"చెప్పండి!" గిరీశ్ ఆర్యా మెరిసే కళ్ళతో అన్నాడు.

"శశిప్రియ బ్లూ ఫిల్మ్‌ని తీసుకుందాం. ఆ వ్యక్తి ఆమెని అనుభవిస్తున్న సమయంలో చాలాసార్లు ఆమె మొహంలోని భావాలకి అనుగుణంగా ఆమె శరీరావయవాలు స్పందించాయి; కదిలాయి. ఉదాహరణకి ఒక షాట్‌లో ఆమె 'అతని' కళ్ళల్లోకి చిలిపిగా చూసింది. ఆ క్షణంలో ఆమె కుడిచేతి వేళ్ళు అతని వీపుమీద గిల్లాయి. మరోసారి వాళ్ళ పెదవులు అతుక్కుపోయాయి. ఆమె చేతులు అతని మెడచుట్టూ బిగుసుకుపోయాయి. క్లైమాక్స్ ముందు ఆమె తల ఆవేశంతో అటూ ఇటూ కదిలింది. అదే భావాన్ని ఆమె కాళ్లూ, చేతులూ స్పష్టంగా, నాచురల్‌గా ప్రకటించాయి...."

"యూ ఆర్ రైట్! కానీ...."

"మిస్టర్ ఆర్యా, మీరు కళ్లతో నవ్వుతున్నప్పుడు, మీ కళ్ళలోని భావాన్ని నా చేతుల్తో నేను ప్రకటించ

లేను. మీరు కోపంతో పళ్ళు కొరుక్కుంటూ రౌద్రంగా చూస్తే నా చేతులు ఖచ్చితంగా రియాక్ట్ అయి, పిడికిళ్ళుగా బిగుసుకోడం అంత సులభంకాదు! నటనవేరు. ఫర్ఫెక్షన్ వేరు! ఒక్క ముక్కలో చెప్పాలంటే మనస్సూ శరీరం—ఈ రెండింటి సమన్వయం. కోఆర్డినేషన్ ఆఫ్ మైండ్ అండ్ బాడీ!"

గిరీశ్ ఆర్య తల ఆవేశంతో ముందుకీ వెనక్కీ ఊగింది.

"ఈ లక్షణం, 'కోఆర్డినేషన్ ఆఫ్ మైండ్ అండ్ బాడీ' శశిప్రియలో చాలా నాచురల్ గా, పర్ఫెక్ట్ గా వుంది! అంటే, ఈ బ్లూ ఫిల్మ్ లోని స్త్రీ ఆమే!"

"మిస్టర్ టెంపో, మీ రీజనింగ్ అద్భుతం! మతిపోగొట్టేశారు! నన్ను యెంతో ఎడ్యుకేట్ చేశారు! యూ ఆర్ జీనియస్!" గిరీశ్ ఆర్య ఉద్రేకంతో అరిచాడు.

"ఈ రీజనింగ్, శశిప్రియ బ్లూ ఫిల్మ్ లో సాక్షాత్తుగా వుందని నిరూపిస్తోంది. అదే అసలు దురదృష్టం!" టెంపో నవ్వుతూ అన్నాడు.

"మిస్టర్ టెంపో...."

"అది శశిప్రియ ఫిలింకాదని నిరూపించాలి!" టెంపో నవ్వుతూ అన్నాడు.

గిరీశ్ ఆర్య అర్థమైనట్టు తలాడించాడు. ఏదో అలోచన తట్టి టెంపోవైపు సూటిగా చూశాడు. "మీరు వివరించాక నాకు అంతా అర్థమైంది. మొహంలోని భావాలకి అనుగుణంగా, దూర్ గా వాడబడిన ఆడదాని శరీరం రియాక్షన్ వుండాలని బ్లూ ఫిలిమ్స్ తీసేవాడు అనుకోడు. వాళ్ళకి కావాల్సింది రియాక్షన్ కాదు! యాక్షన్! ఒక ఆడదాని శరీరాన్ని వీలైనంత దారుణంగా

చూపాలి. ఒక మగాడి శరీరాన్ని అలాగే చూపాలి. ఒక ఆడదాని శరీరం, ఒక మగాడి శరీరం రెండూ ఒకటయ్యే నాటకాన్ని మొరటుగా చూపాలి! అంతే! 'కోఆర్డినేషన్ ఆఫ్ మైండ్ బాడీ' బూతు ఫిల్మ్‌లకి అవసరంలేదు అంత శ్రమ తీసుకోరు?"

"యూ ఆర్ రైట్!" టెంపో నవ్వుతూ అన్నాడు.

"మిస్టర్ టెంపో, ఆ బూతులోని 'ఆబోతు' ఎవడు?" గిరీశ్ ఆర్య తకీముని ప్రశ్నించాడు.

"అతనెవరో తెలిస్తే అంతా అయిపోయినట్టే! ప్రొఫెషనల్ బ్లూ ఫిల్మ్ ఆర్టిస్టేమో అని ప్రయత్నించాను. ఇంతవరకూ అతన్ని యెవరూ యే ఫిల్మ్‌లోనూ చూడలేదు....మిస్టర్ ఆర్యా, ఈ ఫిల్మ్‌లో బ్యాక్ గ్రౌండ్ ఏమీలేదు. మంచం, రెండు శరీరాలూ తప్ప మరేం లేదు. యే గోడో, కిటికీయో యేదో వొకటి వుండాలి! యేమీలేకుండా తీసివుండొచ్చా, చేసి వుండొచ్చా?" టెంపో సాలోచనగా అడిగాడు.

"యస్. అది నేనూ గమనించాను. బ్యాక్‌గ్రౌండ్ యేదివున్నా అది చాకచక్యంగా ఎరేస్ చేయబడింది!" గిరీశ్ ఆర్య జవాబిచ్చాడు. "ఎరేస్ చేసి, రీ షూట్ చేయొచ్చు!"

తలపంకిస్తూ టెంపో లేచి నిలుచున్నాడు. అతన్ని చిరునవ్వుతో చూశాడు.

"మిస్టర్ ఆర్యా. థాంక్యూ వెరీమచ్! నా పరిశోధనకి యెంతో సహకరించారు...."

గిరీశ్ ఆర్య నిలబడి, ఆదోలా చూశాడు. "మిస్టర్ టెంపో, నా సహాయం అనుకున్న విధంగా శశికి ఉపయోగించలేదు. బొమ్మలోని శశి శశికాదు అని తేల్చే అవ

కాశం లేకపోయింది. నిజాన్ని అంగీకరించక తప్పదు.... అయాం.... సారీ...."

"అది నిజమైతే నిజంకాని 'అది' యేదో వుండి తీరాలి!" టెంపో గంభీరంగా అన్నాడు.

"అరంకాలేదు...."

"మిష్టర్ ఆర్యా, శశిప్రియా, శేఖర్ — ఇద్దరూ నాతో మాట్లాడారు. ఇద్దర్లో ఎవరో అబద్ధమాడుతున్నారు! ఎవరో, ఏమిటో, ఎందుకో తెలిస్తేగాని ఈ మిస్టరీ విడిపోదు!"

గిరీశ్ ఆర్య తలపంకించాడు. "మిష్టర్ టెంపో దీని మూలంగా శశి వివాహం బెడిసికొట్టేస్తుందనుకుంటాను.... గంగాధర్ మునుపట్లా అక్కడా, ఇక్కడా అవుపించడంలేదు.... షీ ఈజ్ గుడ్ కిడ్.... అయితే.... ఎవరికెరుక లెండి! ఆల్ రైట్.... వస్తాను. అవసరమైతే కబురు చేస్తే, మళ్ళీ వస్తాను...."

టెంపో నవ్వుతూ అతనితో కరచాలనం చేశాడు....

## 6

వరండామీద నిలబడి, డిటెక్టివ్ టెంపో కాలింగ్ బెల్ బటన్ కోసం చూశాడు. సిగరెట్ని పెదాలమధ్య ఇరికించి తలుపుమీద వేళ్ళతో చప్పుడు చేశాడు. లోపల్నుంచి లీలగా వినిపిస్తున్న మాటల్ని నిశ్శబ్దం మింగేసింది. కొంచెం ఆలస్యంగా తలుపు తెరుచుకుంది.

తలుపు తెరిచిన శేఖర్ ఆశ్చర్యంతో కళ్ళు పెద్దవి చేశాడు. "టెంపోగారా, మీరా! రండి రండి...." అంటూ అతను తలుపుల్ని బార్లా తెరిచాడు. అతని కంఠధ్వనితో అతని కళ్ళూ, ముఖం ఏకీభవించడంలేదని టెంపో గుర్తించాడు. కోఆర్డినేషన్ ఆఫ్ మైండ్ అండ్

బాడీ! టెంపో నవ్వుకుంటూ లోపలికి అడుగువేశాడు.

సోఫాలోంచీ చివాల్న లేచిన యువతి టెంపో దృష్టిని ఆకర్షించింది. పల్చటి తెల్లచీర. ముదురు నీలం రంగు స్లీవ్ లెస్ జాకెట్. చెవులకి వైరాగులు వేసుకునే పైజు రింగులు. నాలుగైదు కోటింగ్స్‌తో కోల ముఖానికి అతుక్కున్న మేకప్. సన్నటి పొడుగాటి ఆకారం. పచ్చటి మేఘాల్ని పైకి తోసేస్తున్న జంట పర్వత శిఖరాల్లా అవుపిస్తూ పైటనిలోస్తున్న నీలంరంగు జాకెట్. అందాన్ని దాచుకోడంకన్నా, ప్రదర్శించడమే ఆమె వస్త్రధారణలోని ఉద్దేశంగా వుంది.

టెంపో తన చూపుల్ని ఆమెమీంచీ శేఖర్ మీదికి తిప్పాడు. శేఖర్ ఇబ్బందిగా ఆమెని చూశాడు.

"కోలా, రేపొద్దుట కల్సుకుందాం...." అన్నాడతను మెల్లిగా.

నిరుత్సాహంగా చూస్తూ ఏదో చెప్పబోయిన కోలా మనసు మార్చుకుని సోఫామీద పడున్న పర్సుని అందుకుని, అయిష్టంగా గుమ్మంవేపు కదిలింది. ఆలల్లా కదులుతున్న ఆమె వెనక భాగం కాసేపట్లో గుమ్మంలోంచీ అదృశ్యమైంది.

"టెంపోగారూ, ప్లీస్ సిడౌన్...." శేఖర్ సోఫా చూపిస్తూ అన్నాడు.

టెంపో కూచున్నాడు. నవ్వుతూ అతన్ని చూశాడు. "కోలా! గమ్మత్తైన పేరు...."

శేఖర్ నవ్వాడు. "సినిమా ప్రపంచంలోకి అడుగెట్టగానే మనుషులు మారిపోయినట్టు పేర్లూ మారిపోతాయి! ఆమె పేరు కోలాటం లావణ్య. మావాళ్ళు ఎడిట్ చేసి 'కోలా' అన్నారు. గమ్మత్తేమిటంటే ఇలాంటి పేర్ల

త్వరగా క్లిక్ అవుతాయి...."
"క్లాత టాలెంటా?" టెంపో అడ్డు తగిలాడు.
"దాదాపుగా.... టెంపోగారూ. మీరొచ్చి చాలా సేపైందా?" శేఖర్ సందేహిస్తూ అడిగాడు.
టెంపో వెంటనే సమాధానం చెప్పలేదు. యాష్ట్రే కోసం చూసి, పెల్లిగా పైకి లేచాడు. ఇంకా సగం కూడా కాలని సిగరెట్ని వేళ్ళతో పట్టుకుని, కిటికీవైపు కదిలాడు. శేఖర్ ప్రశ్న అతనిలో ఆలోచనల్ని రేపు తోంది. తలుపు తట్టిన వ్యక్తిని 'వచ్చి చాలా సేపైందా?' అని తలుపు తెరిచిన వాళ్ళు సాధారణంగా ప్రశ్నించరు. సిగరెట్ని కిటికీలోంచీ గువ్వి మరో సిగరెట్ వెలిగించి, టెంపో సోఫావైపు కదిలాడు.
"వరండాలో నిలబడి పదినిమిషాలు తోటలోని మొక్కల్ని చూస్తూ వుండిపోయాను...." ఆలోచిస్తూ అబద్ధం ఆడాడు టెంపో. ఒకోసారి అబద్ధం నిజాన్ని ఇవతలికి లాగుతుంది.
శేఖర్ బరువుగా నిట్టూర్చి, సర్దుకున్నాడు. "టెంపో గారూ....శ్రమ తీసుకుని వచ్చారు...." అంటూ ఆగాడు.
"శేఖర్, కొన్ని విషయాలు అడగడం మరిచి పోయాను. పారిస్లో ఓడియన్ థియేటర్కి ఆ క్యాసెట్ని ఎవరు సప్లై చేశారు?"
"అడిగాను. బ్లూ ఫిల్మ్ సోర్స్ని ఎవ్వరూ ఎవ్వరికీ చెప్పరు!" శేఖర్ నవ్వాడు.
"అఫ్కోర్స్.... శశిప్రియ ఫిల్మ్లోని ఆ వ్యక్తి మరేదేనా ఫిల్మ్లో సీన కనిపించాడా? నువ్వు అసం ఖ్యాకంగా అన్నిచోట్లా బ్లూ ఫిల్మ్స్ చూసినట్టు శశి ప్రియ చెప్పింది...."

"అసలు ఫిల్మ్ దొరికాక, అంత ఆత్రుత లేకపోయినా పారిస్‌లో ఆయిదురోజులుండి జోల్లన్నీ బ్లూలు చూశాను. కాపీలకోసమే అయినా, ఆ వ్యక్తి వున్న ఇతర చిత్రాల కోసం నాచురల్‌గా చూశాను. శశిప్రియ ఫిల్మ్ దొరక్క-ముందు చూసిన వాటిలోకూడా ఆ మొహం నాకు అవుపించలేదు. అతను కనిపించిన ఒకే ఒక చిత్రం ఇదే!" శేఖర్ జవాబిచ్చాడు.

టెంపో తలాడించాడు. "రాత్రి గిరీశ్ ఆర్య ఫిల్మ్‌ని చూశారు. ఆమె పూర్తిగా శశిప్రియే అంటూ కండ బద్దలుకొట్టి చెప్పాడు...."

"గిరీశ్ ఆర్య రాత్రి నాకు ఫోన్ చేసి ఆ సంగతి చెప్పాడు...." అంటూ శేఖర్ కాసేపు తటపటాయిస్తూ చూశాడు. "మిస్టర్ టెంపో నేను నిజం చెప్ప లేదని మీరనుకున్నారట....అయామ్ సారీ....అబద్ధాలాడా ల్సిన అవసరం నాకు లేదు!"

"అబద్ధాలాడకపోవడం వేరు, నిజం చెప్పకపోవడం వేరు శేఖర్!" టెంపో నవ్వుతూ అన్నాడు.

"నాకు తెలిసిన నిజాలన్నీ మీకు చెప్పాను?" శేఖర్ ఉద్రేకంతో అన్నాడు.

టెంపో చిరునవ్వు నవ్వాడు. "అది త్వరలో తేలుతుంది. ఇట్సాల్‌రైట్.... శేఖర్, మిస్ కోలా డెరీని చూడబోతున్నావా?" టెంపో అతని కళ్లల్లోకి సూటిగా చూస్తూ ప్రశ్నించాడు.

అసలు విషయంతో సంబంధంలేని టెంపో ప్రశ్న శేఖర్‌ని ఆశ్చర్యంతో నింపిందని అతని కళ్ళు చెప్తున్నాయి. క్షణకాలం తటపటాయించి అతను గొంతు సవరించుకున్నాడు.

"టెంపోగారూ....గుమ్మంముందు నించున్న మీరు ఎంతో కొంత వినేవుంటారు! నేను అబద్ధాలాడతానేమో అన్న అనుమానంతో, నన్ను పరీక్షించడానికి మీరీ ప్రశ్న అడుగుతున్నారని నాకు తెలుసు! శోలా నా సిఫార్సు కోసం వచ్చింది...." అంటూ ఆగాడు శేఖర్.

లోపల్లోపలే నవ్వుకుంటూ టెంపో మౌనంగా చూశాడు.

"గంగాధర్ త్వరలో ఒక కమర్షియల్ చిత్రం డైరెక్టు చేయబోతున్నారు. ఆ పిక్చర్లో తనకి హీరోయిన్ ఛాన్సు ఇప్పించమని శోలా నా ప్రాణాలు తీస్తోంది. అంతే!"

"నిర్మాత ఎవరు?" డిటెక్టివ్ టెంపో ప్రశ్నించాడు. గంగాధర్‌కి మళ్ళీ డైరెక్షన్ ఛాన్సొచ్చిందని శశిప్రియ చెప్పలేదు.

"నిర్మాత గంగాధరే."

టెంపో ఆశ్చర్యంగా చూశాడు. "అంటే శశిప్రియ సొంత చిత్రం అన్నమాట."

"గంగాధర్ చిత్రమే అనుకుంటా. ఎందుకంటే, ఆ పిక్చర్లో శశిప్రియ నటించదనుకుంటాను. 'రామ్ తేరీ గంగా మైలీ'లో రాజ్‌కపూర్ మందాకినిని టాప్‌లెస్‌గా చూపించినట్టు మరో తారని ప్రెజెంట్ చేయాలని గంగాధర్ అనుకుంటున్నారు. నిజం చెప్పాలంటే రాజ్‌కపూర్ కన్నా ధైర్యంగా, చొరవగా వ్యవహరించాలని ఆయన అనుకుంటున్నట్టు తెలిసింది."

"శేఖర్, గంగాధర్ ఆర్టుఫిల్ముతో దాదాపు తెర వెనక్కి వెళ్ళిపోయినట్టే అని విన్నాను. అతనికి డబ్బె

క్కడిది?" డిటెక్టివ్ టోంపో అడ్డొస్తూ ప్రశ్నించాడు.

శేఖర్ చిరునవ్వు నవ్వాడు. "మీకు తెలీదా? శశిప్రియ డైరీని చూస్తున్నట్టే ఆయన ఆమె బాంక్ అకౌంట్స్‌నీ, కలెక్షన్స్‌నీ చూస్తున్నారు. కలెక్షన్స్ అంటే అకౌంట్స్‌లోకి ఎక్కని మొత్తాలు!"

టోంపో కళ్ళు చిట్లిస్తూ చూశాడు. "ఇప్పుడు కూడా ఫైనాన్స్‌ని అతనే కంట్రోల్ చేస్తున్నాడా?"

"ఆ. ఆ విషయంలో శశిప్రియకి ఏమీ అభ్యంతరం లేదు. శశి ఆయన్ని హృదయంతో ప్రేమిస్తోంది" శేఖర్ జవాబిచ్చాడు.

"శేఖర్, గంగాధర్‌తో నీకు మంచి స్నేహం వుందా?" టోంపో అడిగాడు.

"పరిచయం వుంది. అది స్నేహంగా మారేలోగా ఆయన శశిప్రియ భర్త అయిపోయారు!"

"అయితే అతను ఇంకా అనౌన్స్ చేయని చిత్రం గురించి నీకెలా తెలుసు?"

శేఖర్ అదోలా నవ్వాడు. "గుమ్మంముందు నిలబడి మీరు దాదాపుగా వినేవుండాలి! శీలా చెప్పింది."

"ఆమె కెలా తెలుసు?"

"గంగాధర్ గారు ... చెప్పివుండాలి...." శేఖర్ అనుమానిస్తూ అన్నాడు.

"శీలా గంగాధర్ ఫ్రెండా?"

శేఖర్ వెంటనే మాట్లాడలేదు. అరచేతితో నుదుర్ని తుడుచుకున్నాడు. "మిష్టర్ టోంపో, శశిప్రియ మీకు చెప్పివుండాలి.... గంగాధర్ గార్ని .... ఆ బ్లూఫిల్మ్ ఆమెకి శారీరకంగా దూరంచేసింది. మానసికంగా కూడా దూరం కాలేక ఇద్దరూ నరకయాతన పడుతున్నారు. బ్లూ

ఫిల్మ్ గంగాధర్‌లోని బలహీన మానవుడిని నిద్రలేపి నట్టుంది. ఆయన తాగుతున్నారు. ఇంట్లోనే ఎవరెవరో అమ్మాయిల్ని ....కలుసుకుంటున్నారు...."

టెంపో అతిప్రయత్నంమీద తన ఆశ్చర్యాన్ని దాచి పెట్టుకున్నాడు. తల పంకించి, సిగరెట్ వెలిగించాడు.

"అఫ్‌కోర్స్, ఇదంతా శశిప్రియకు తెలుసు. తను ప్రేమించిన భర్త తన దగ్గరే వున్నంతకాలం అతను తాగినా, అమ్మాయిలతో తన ఇంట్లోనే తైతక్కలాడినా ఆమెకి అభ్యంతరంలేదు. ఆమెలో ఒకరంగా గిల్టీ కాన్షస్ ప్రవేశించింది. తన అమాయకత్వాన్ని—బ్లూ ఫిల్మ్ విషయంలో—నిరూపించుకునేదాకా భర్త తనని గౌరవించలేడని ఆమె నిశ్చయించుకుంది! నిజం నిరూపించబడ్డాక తన భర్త తప్పకుండా తనవాడవుతాడు! గంగాధర్ గారు తనని వదిలివెళ్ళిపోయి తద్వారా చిత్ర రంగంలో, అభిమానుల్లో తనకి అపకీర్తి రావడంకూడా ఆమెకి ఇష్టంలేదు. భర్త ఆ బ్లూ ఫిల్మ్‌ని మరిచిపోయి, యథాప్రకారం తనని చూసుకోడానికి, అవసరమైతే చిత్రపరిశ్రమకి గుడ్‌బై చెప్పడానిక్కూడా ఆమె తయారుగా వుంది!"

"ఇదంతా నీకెలా తెలుసు?" టెంపో ప్రశ్నించాడు.

"శశిప్రియ చెప్పింది."

"ఆల్‌రైట్..అయితే, గంగాధర్ని కోలా తరచుగా కలుసుకుంటూ వుంటుందా?"

"వారంలో కనీసం అయిదు రాత్రులు కోలా ఆయనతో గడుపుతోంది!" శేఖర్ నవ్వుతూ అన్నాడు.

డిటెక్టివ్ టెంపో లేచాడు. "శేఖర్, శశిప్రియను కలుసుకోవాలి. ఆమె ఎక్కడుంది?"

“‘అరణ్యపర్వం’ షూటింగ్ లో, తిరుపతి సమీపం లోని తలకోనలో వుంది. రేపో, ఎల్లుండో రావొచ్చు” అంటూ శేఖర్ లేచాడు. “కూచోండి. టీ తయారు చేస్తాను.”

“నో థాంక్స్. మరోసారి. ఇంత సేపూ మాట్లాడి నందుకు థాంక్స్!” అంటూ టెంపో కదిలాడు.

శేఖర్ అతన్ని గుమ్మందాకా సాగనంపాడు. తలుపు మూసుకుంది. చిన్న తోట దాటి టెంపో రోడ్డుమీదికి ఎక్కాడు. అతనిలో యెన్నో తలాతోకాలేని ఆలోచనలు సాగుతున్నాయి. ఏదో కొత్త ఆలోచన అతని పాదాల్ని రోడ్డుకి తాపడం చేసింది. సిగరెట్ పొగ ఊదుతూ వెనక్కి తిరిగాడు. అతని కళ్ళు ఆశ్చర్యంతో విచ్చుకున్నాయి.

శేఖర్ ఇంటి ఎడంవైపునుంచీ, వరండామీదికి ఎక్కుతోంది కోలా....

## 7

“నువ్వేనా?” డిటెక్టివ్ టెంపో నవ్వుతూ అన్నాడు.

“సాక్షాత్తుగా!” క్రైమ్ బ్రాంచ్ ఇన్ స్పెక్టర్ నవ్వుతూ అన్నాడు.

“ఇప్పుడు ‘మనిషి’గా అవుపిస్తున్నావ్!”

ఇన్ స్పెక్టర్. పృధ్వీరావ్ ఆశ్చర్యంతో నోరు తెరిచాడు. “వాడ్డూయూ మీన్?”

టెంపో చిన్నగా నవ్వాడు. “బ్రౌన్ కలర్ సూటూ వైట్ షర్టు, చక్కగా మ్యాచ్ అవుతున్న నెక్ టై. వంకీలు తిరిగిన క్రాపూ. మామూలు మనిషి నవ్వే చిరునవ్వూ. కమిన్, అద్దంలో చూసుకో. ఒక ‘హ్యూమన్ బీయింగ్’ నీకు కనిపిస్తాడు!”

పృథ్వీరావ్ పెదవులు చిరునవ్వుతో విచ్చుకున్నాయి. "అంటే, యూనిఫామ్‌లో వుంటే మనిషిలా అవుపించ నట్లేగా నీ అర్థం?"

"పృథ్వీ, బ్రహ్మాండంగా కనిపెట్టావ్! అది నా అర్థమే కాదు; ప్రజలందరిదీ అదే అర్థం!" టెంపో నవ్వుతూ తలుపుమూసి, కదిలాడు. పృథ్వీరావ్ నిట్టూర్చాడు.

"పోలీసుల్ని మనుషులుగా చూసినప్పుడే లోకం బాగుపడుతుంది!" అన్నాడు నవ్వుతూ.

ఫ్లాస్కులోని టీని కప్పుల్లో పోసి టెంపో సోఫాలో కూచున్నాడు. "మనుషుల్లా కనిపించాలిగా?"

"టెంపో, ఇంకాస్సేపు ఇలాగే మాట్లాడితే, అలిగి వెళ్ళిపోతాను. అరగంటలో యూనిఫామ్‌తో వచ్చేస్తాను!"

టెంపో పకపకా నవ్వాడు. "ఆల్ రైట్! ఏమిటి కథ, పెళ్ళికొడుకులా తయారయ్యావ్?"

"అలా అడిగావ్, బావుంది. మా.... యానివర్సరీ."

టెంపో కళ్ళు చిట్లించాడు. "రెండువారాల కిందటేగా వెడ్డింగ్ యానివర్సరీ విందిచ్చారు శిరీషా, నువ్వూ?"

"అది వెడ్డింగ్ డే. ఇది 'లవ్ అట్ ఫస్టు సైట్ డే!'" పృథ్వీరావ్ నవ్వుతూ అన్నాడు.

"ఫస్టు కిస్ డే అన్నమాట!" టెంపో నవ్వాడు.

"నో.... అది వేరేవుంది. ప్రతీ నెలలో ఏదో ఒక డే పేరుపెట్టి నీ సిస్టర్ నన్ను నంజుకు తినేస్తోంది! ఆల్ రైట్.... ఏమిటి కథ?"

టెంపో సిగరెట్ వెలిగించి, పాకెట్‌ని పృథ్వీరావ్ వొడిలో పడేలా విసిరాడు.

"పృథ్వీరావ్, నీకో నీలివార్త చెప్తాను?"

“సీరివార్తా?” పృథ్వీరావ్, సిగరెట్ చుట్టూ పిడికిలి బిగిస్తూ అన్నాడు.

“యస్ ‘బ్లూ’ న్యూస్. అనగనగా ఒక తార. ఆరుకోట్ల ఆంధ్రులకీ ప్రియమైన ఆ తార పేరు శశిప్రియ” టెంపో ప్రారంభించాడు. కథ పెరిగేకొద్దీ పృథ్వీరావ్ సోఫా అంచుకి జరగసాగేడు.

“ఇంటరెస్టింగ్!” అంతా విన్న పృథ్వీరావ్ క్లుప్తంగా అన్నాడు.

“తను ఎప్పుడూ, ఎవరితోనూ అలా ప్రవర్తించలేదంటుంది శశిప్రియ. ఈ బ్లూ ఫిలింమీద ఆమె జీవితం ఆధారపడుంది. అందరూ నిజమే చెప్తున్నారు. అబద్ధమేదో, అసలు నిజమేదో తేలడంలేదు!”

“గురూ, టేక్ మై అడ్వైజ్. ఈసారి నీకు దొరికిన వాళ్ళంతా సినిమాతారలు. నటించకుండా మాట్లాడం, నటించకుండా వుండడం వాళ్ళకి చేతకాదు! ఈ మిస్టరీని నువ్వు ఛేదించలేవు. ఎందుకంటే ఇందులో మిస్టరీ లేదు!” పృథ్వీరావ్ నవ్వుతూ అన్నాడు.

“పృథ్వీరావ్!”

“నీ హీరోయిన్ పప్పులో కాలేసింది. ఎక్కడో, ఎప్పుడో, ఎందుకో బురద తొక్కింది. ఇప్పుడు కంపు కొడ్తున్న ఆ బురదని కడుక్కోలేక బెంబేలెత్తిపోయి, యేదో ఒక మేకు సంపాదించి, ఆ బ్లూ ఫిల్మ్ని తగిలిస్తానన్న నమ్మకంతో నీ దగ్గరకొచ్చింది. నిజాన్ని నిజంగా నిరూపించే శక్తి వున్న డిటెక్టివ్ టెంపో, నిజాన్ని అబద్ధంగా, అవసరమైతే అబద్ధాన్ని నిజంగా నిరూపించగలడని ఊహించి నిన్ను పట్టింది!”

ఆలోచనల్ని పుట్టిస్తున్న పృథ్వీరావ్ మాటలు

టెంపోని సోఫాలోంచీ పైకి లేపాయి. అప్రయత్నంగా పచార్లు ప్రారంభించాడతను. అతన్ని చిరునవ్వుతో చూస్తూ ఇన్‌స్పెక్టర్ పృథ్వీరావ్ మరో సిగరెట్ వెలిగించి, పిడికిలి బిగించి పొయ్యి ఊదే గొట్టంలా చప్పుడు చేస్తూ దమ్ములాగాడు.

ఉన్నట్టుండి కాలింగ్ బెల్ మోగింది. టెంపో ఆగి పృథ్వీరావ్‌ని ఆదోలా చూశాడు. చెమట కమ్మిన నుదుర్ని అరచేతితో అలసటగా అద్దుకున్నాడు.

“పృథ్వీరావ్, ఎక్స్‌పర్ట్ కెమెరామన్ గిరీశ్ ఆర్య వచ్చినట్టున్నాడు. అతనితోబాటు నువ్వు వీడియో చూడు. తరవాత బుర్రలు బద్దలు కొట్టుకుందాం!”

“తప్పకుండా. ఇవాళ ఎలాగా పండగ. ఐవిల్ సెలిబ్రేట్ విత్ ఏ బ్లూ ఫిల్మ్!” పృథ్వీరావ్ నవ్వుతూ అన్నాడు. టెంపో గుమ్మంవైపు కదిలాడు.

* * *

గిరీశ్ ఆర్య డిటెక్టివ్ టెంపోని ప్రశ్నార్థకంగా చూశాడు. అతని నుదురు గీతలుగా మారింది. కళ్లల్లో, మొహంలో విసుగు స్పష్టంగా గోచరిస్తోంది.

“మిస్టర్ టెంపో, ఎన్నిసార్లు చూసినా, రంభ ఊర్వశి కాదు. రంభ రంభే! మళ్ళా ఈ చెత్తని ఎందుకు చూశాం?”

పృథ్వీరావ్ పకపక నవ్వాడు. గిరీశ్ ఆర్య అతనివైపు ఉషారుగా చూస్తూ తన విసుగుని మరిచిపోయి నవ్వడం ప్రారంభించాడు. డిటెక్టివ్ టెంపో లేచి, వాళ్ళ ఎదురుగా నించున్నాడు. సిగరెట్ ముట్టించి, ఇద్దర్నీ తదేకంగా చూశాడు.

“పెళ్ళయ్యాక శశిప్రియ దంపతులు ఎక్కడెక్కడ

ఏకాంతం అనుభవించాలో, ఏ మేర ఏకాంతంలో అనుభవించాలో శశిప్రియకు అడిగి కనుక్కున్నాను. హనీమూన్ కి ఫారిన్ వెళ్ళేదాకా వాళ్ళు ఇంట్లోని పడగ్గదిలోనే కలుసుకున్నారు. ఆమె షూటింగ్ సందర్భంలో రెండుసార్లు ఆమె హైదరాబాద్ వెళ్ళింది. రెండుసార్లు గంగాధర్ ఆమెతో హైదరాబాద్ వెళ్ళాడు. హోటల్ గోల్కొండలో బసచేసారు...."

"టెంపో....ఇదంతా ఎందుకు చెప్తున్నావో అర్థం కావడంలేదు!" ఇన్ స్పెక్టర్ పృథ్వీరావ్ అడ్డుతగిలాడు. ఔనన్నట్లు చూస్తూ ఆర్య సిగార్ వెలిగించాడు.

డిటెక్టివ్ టెంపో రెప్పవేయకుండా పృథ్వీరావ్ ని చూస్తూ వుండిపోయాడు. ఔను....తనేమిటి మాట్లాడుతున్నాడు? ఎందుకు? ఎందుకు? అతని మెదడుని కంపటి మీద కేపుతూ, కాలుతూన్న ఆలోచనల ఆవిరి చెమట బిందువుల రూపంలో నుదురుమీద ప్రత్యక్షమవుతోంది.. కటాలున అతని కళ్ళు మెరిశాయి.

"మూతకింద వున్న గిన్నె మారిందేమో అని మనం బుర్రలు బద్దలుకొట్టుకుంటున్నాం. గిన్నెమీద పెట్టిన మూత మారిందేమో అని ఒక్కసారికూడా ఆలోచించలేదు!" అన్నాడు టెంపో గంభీరంగా.

గిరిశ్ ఆర్య అమరం వింటున్న సంస్కృతంరాని వ్యక్తిలా చూస్తూ వెనక్కివాలి ఆరిపోయిన చుట్ట ముట్టించడంలో మునిగిపోయాడు. ఇన్ స్పెక్టర్ పృథ్వీరావ్ అర్థంకానట్టు చూశాడు.

"టెంపో, ఇక్కడికి వచ్చినప్పట్నుంచీ ఆడియో పద్ధతిలో నన్ను ఎడ్యుకేట్ చేశావు ఇప్పుడే వీడియో ద్వారా విజువల్ ఎడ్యుకేషన్ అందించావు. విషయం

వాలిచేసిన అరటిపండులా అరమొంది అయితే, నీ మాటలు బొత్తిగా అర్థంకావడం లేదు! అదేదో గిన్నె, మూత థియరీ అ—ఆ లలో చెప్పు!"

టొంపో చిన్నగా నవ్వాడు. "పృథ్వీరావ్, ఫిల్మ్‌లో శశిప్రియ కాకుండా డూప్ ఉందేమో అన్న కోణం లోంచీ చూస్తూ వుండిపోయాం. టెక్నికల్‌గా, లాజికల్‌గా ఆమె ఆమే అయ్యుండొచ్చని నిర్ధారించుకున్నాక కూడా ఆ అనుమానం దుప్పటిలా నా మెదడుని కప్పేసింది. శశిప్రియ శశిప్రియే! ఆమెతో బాటు ఫిల్మ్‌లో కనిపిస్తున్న వ్యక్తి ఆ వ్యక్తి కాదు!"

పృథ్వీరావ్ నెత్తి బరుక్కున్నాడు. "ఇంకా చెప్పు...."

"శశిప్రియతో బాటు బొమ్మలో ఆడుతున్న ఆ ఆబోతు వెనక, అసలు వ్యక్తి ఉన్నాడు!"

"వాట్?" పృథ్వీరావ్ ఆశ్చర్యంతో అరిచాడు.

"యస్! ఈసారి చెప్పండి!" గిరీశ్ ఆర్య దరువేశాడు.

"ఫిల్మ్‌లో ఒరిజినల్‌గా శశిప్రియా ఆమె భర్త గంగాధర్ ఉన్నారు. ఇప్పుడు శశిప్రియ శశిప్రియగానే వుంది. గంగాధర్ స్థానంలో ఆబోతుగాడున్నాడు గిన్నె గిన్నెగానే వుంది. మూత మాత్రం మారింది!" టొంపో నవ్వుతూ అన్నాడు.

"యూ మే బీ రైట్. బట్...." ఏదో చెప్పపోతున్న పృథ్వీరావ్‌కి గిరీశ్ ఆర్య అడ్డుతగిలాడు.

"నో ఇన్‌స్పెక్టర్. మిస్టర్ టొంపో ఈజ్ సెంట్ పర్సెంట్ రైట్! ఎందుకంటే, ఫిల్మ్‌లోని మగాణ్ణి డూప్‌గా అనుకోడానికి ఆస్కారం వుంది!" అన్నాడు ఆర్య ఉత్సాహంగా.

"ఓహో....ఇందాకా అర్థంలేకుండా వినిపించిన నా వాగుడుకి ఇప్పుడు అర్థం ఏర్పడింది. హైదరాబాద్ హోటల్ గోల్కొండలో ఏకాంతంలో వున్న శశిప్రియా గంగాధర్ల ప్రణయ సన్నివేశాల్ని యెవరో పథకం ప్రకారం కెమెరాలోకి ఎక్కించుకున్నాడు. గంగాధర్ని డూప్ వ్యక్తి శరీరంతో దాచిపెట్టేశారు!" టెంపో ఇంకొంచెం విడమరిచాడు.

"ఎవరు?" పృథ్వీరావ్‌లోని ఇన్‌స్పెక్టర్ ఠకీమని ప్రశ్నను పేల్చాడు.

"ఎవరైనా కావొచ్చు! అయితే ఒకేఒక కాపీగా దొరికిన ఈ బ్లూ ఫిల్మ్, ఆ వ్యక్తుల్ని, లేక వ్యక్తిని పట్టుకోడంలో మన అన్వేషణని చాలామట్టుకు తగ్గించేస్తోంది...."

"ఇంకేం? ఎవరెవర్ని అనుమానించవచ్చో చెప్పేయ్?" పృథ్వీరావ్ ఉషారుగా అన్నాడు.

టెంపో సాలోచనగా తలపంకించాడు. చూపుల్ని గిరీశ్ ఆర్యవైపు తిప్పాడు.

"గిరీశ్ ఆర్య ఈసారి మళ్ళీ, 'సాంకేతిక నేత్రంతో' ఫిల్మ్‌ని చూస్తారు. ఆ తరవాత...."

"మిస్టర్ టెంపో, పదేళ్ళక్రితం భార్య పోయినప్పట్నుంచీ, సినీ ఫీల్డులో వున్నా కూడా, నా బ్రహ్మచర్యాన్ని కాపాడుకుంటూ వస్తున్నాను. శశిప్రియ బ్లూ ఫిల్మ్ చూపించీ, చూపించీ, మూసేలా చేసి నా పదేళ్ళ బ్రహ్మచర్యాన్ని పటాపంచలు చేసేలా వున్నారు!" గిరీశ్ ఆర్య అడ్డొస్తూ అన్నాడు.

టెంపో పకపకనవ్వాడు. పృథ్వీరావ్ శృతికలిపాడు.

* * *

రెండోసారి బ్లూ ఫిల్మ్ చూసి అలిసిపోయిన పృథ్వీరావ్ కి, గిరీశ్ ఆర్యకీ టెంపో టీ అందించాడు. టీ తాగేసి గిరీశ్ ఆర్య నిట్టూర్చాడు.

"మిస్టర్ ఆర్యా, ఇప్పుడేమంటారు?" టెంపో ప్రశ్నించాడు.

"ఇదివరకూ, చూస్తున్నంతసేపూ శశిప్రియ మీదే నా దృష్టిని కేంద్రీకరించాను. దానికి కారణం తల మాత్రమే శశిప్రియది అయివుండొచ్చన్న అనుమానం. ఈసారి నా 'టెక్నికల్ ఐ'ని అతుకుకి రివిట్ చేశాను. వాడు నిస్సందేహంగా డూపే!" గిరీశ్ ఆర్య ఉద్రేకంతో అన్నాడు.

"ఖచ్చితంగా చెప్పగలరా? ఎందుకంటే మనకున్న ఆధారమల్లా ఆ ఫిల్మ్ ఒక్కటే! వేడెక్కిన బుర్రని చల్లబరుచుకోడానికి మనం తొందరపడకూడదు!" టెంపో నవ్వుతూ అన్నాడు.

"గవర్నమెంట్ స్టాంప్ పేపర్ మీద చెయ్యికోసి రాసిస్తాను! సందేహం లేదు మీ భాషలో చెప్పాలంటే మాతి ఒరిజినల్ కాదు. డూప్లికేట్! డూప్ లో 'కో ఆర్డినేషన్ ఆఫ్ మైండ్ అండ్ బాడీ' ఉండాల్సినంత పర్ఫెక్ట్ గా లేదని మీరూ గమనించే వుంటారు!" గిరీశ్ ఆర్య నవ్వుతూ అన్నాడు.

"థాంక్యూ వెరీమచ్. కనీసం శశిప్రియ నిజాయితీని మనం నిరూపించుకున్నాం" అన్నాడు టెంపో.

"యస్. ఐ లైక్ దట్ కిడ్. మంచిపిల్ల. ఈ ఫిల్మ్ చూశాక శశిని ఇంకా ఎక్కువగా లైక్ చేస్తున్నాను!" గిరీశ్ ఆర్య నవ్వుతూ అన్నాడు.

పృథ్వీరావ్ బిగ్గరగా నవ్వాడు.

"ఆర్యులు ఆ లైకింగ్ ని లిమిట్ చేసుకోడం మంచిది. లేకపోతే పకేళ్ళ బ్రహ్మచర్యం బ్రహ్మపుత్రలో కలిసి పోతుంది!" టెంపో నవ్వుతూ అన్నాడు.

గిరీశ్ ఆర్య ఖలాసాగా నవ్వుతూ వుండిపోయాడు. దగ్గుగా మారిపోతున్న నవ్వుని ఆపుకుని కళ్ళు చిట్లిస్తూ టెంపోని చూశాడు.

"మిష్టర్ టెంపో, ఇంతకీ ఈ ఫేక్ బ్లూని ఎవరు తయారుచేసి వుంటారు?

"మనం ఇప్పటిదాకా సగమే తవ్వాం. ఇంకా సగం తవ్వితేగానీ నీటిచుక్క అవుపించదు!" టెంపో నవ్వుతూ అన్నాడు.

గిరీశ్ ఆర్య తలపంకిస్తూ రిస్టువాచీ చూసుకున్నాడు. "నేను వెళ్ళొచ్చా? అవతల స్టుడియోలు అంటుకుంటాయి!"

"పిలవగానే వచ్చారు. పావుగంటే అనుకుండా కూచున్నారు. థాంక్స్ ఎలాట్! వెళ్ళిరండి" టెంపో చెయ్యి ముందుకి చాచాడు.

కరచాలనం చేసి గిరీశ్ ఆర్య పృథ్వీరావ్ వైపు చూశాడు. పృథ్వీరావ్ లేచి కరచాలనం చేశాడు.

• • •

సోఫాలో కూచుని డిటెక్టివ్ టెంపో సిగరెట్ వెలిగించాడు. ఇన్స్పెక్టర్ పృథ్వీరావ్ అతన్ని ప్రశ్నార్థకంగా చూశాడు.

"టెంపో, ఇప్పుడు చెప్పు; ఎవరు?"

"చెప్తాను."

"ఎందుకు?"

"చెప్తాను"

"ఎప్పుడు?"

"పృథ్వీరావ్, ఇంటికెళ్ళు. 'లవ్ ఎట్ ఫస్టు సైట్ రే' సెలబ్రేట్ చేసుకుంటూ రాత్రి తొమ్మిదిన్నరదాకా నీ శ్రీమతితో వుండిపో. తరవాత ఈ డ్రెస్సు తీసిపారేసి, యూనిఫామ్ తగిలించుకో. సరిగ్గా పదింటికి నేను చెప్పే అడ్రసుకి రా!" టెంపో నవ్వుతూ అన్నాడు.

పృథ్వీరావ్ నిస్సహాయంగా చూశాడు. "ఇది అన్యాయం! మా ప్రేమకూ, పెళ్ళికీ సంబంధించిన డజను రోజుల్లో భూకంపాలు వచ్చినా యూనిఫాం వేసుకోకూడదని శిరీష ఆంక్ష పెట్టి, బాస తీసుకుంది! పైగా పదిగంటలకి ఇంట్లో లేకపోతే ..."

టెంపో పకపక నవ్వాడు, "పృథ్వీ, ఐ పిటీ యూ! శిరీషకి నేను చెప్పాననని చెప్పు."

"చెప్తే, వెళ్ళి నీ గదిలోనే బజ్జోమంటుంది! ఆల్ రైట్....తప్పదుగా!" అంటూ పృథ్వీరావ్ లేచాడు.

"తప్పించుకోలేవు! బెదిరి బెదురుతో చేతుల్తో రావొద్దు. బేడీలతో రా!" టెంపో నవ్వుతూ అన్నాడు. అతని మాటల్లోని రెండో అర్థం పృథ్వీరావ్‌కి నవ్వు తెప్పించింది.

"ఎక్కడికి?"

"తెలీదు!" టెంపో నవ్వుతూ అన్నాడు. "తెలుసుకుని, తొమ్మిదిలోగా ఫోన్ చేస్తాను...."

పృథ్వీరావ్ మళ్ళీ కూచున్నాడు. అదోలా టెంపోని చూశాడు. "గురూ....ఈ కేసులో ఇంక మునిగిపోయేం దేంలేదు! తొందరపడొద్దు. తీరిగ్గా ఆలోచించు తీరిగ్గా రేపో ఎల్లుండో నిన్ను కల్సుకుంటాను. అప్పటికి దారా అన్నింటినీ కలిపి తాడుగా పేనేయ్. కనిపించీ కనిపించ నట్టున్న ఆధారాల్తో, అనుమానాన్ని రీయిన్‌ఫోర్స్ చేసి

పప్పులో కాలేసే...."

"పృథ్వీరావ్, అరగంటనుంచీ దారాలన్నీ నా బుర్రలో తాడుగా అల్లుకుపోతున్నాయ్! అయిదుగురు నలచక్రవర్తుల్ని ఒకేక్షణంలో చూస్తూ దండని ఎవరి మెడలో వేయడమా అని సందేహిస్తున్న దమయంతిలా వున్నానిప్పుడు! శశిప్రియ తనకి ఎవ్వరూ శత్రువులు లేరంటూ చెప్పింది. గాసిప్ వీరుడు చిన్నారావు కథనం ప్రకారం ఆమెకి ముగ్గురు శత్రువులున్నారు...."

"చెప్పవేం?" పృథ్వీరావ్ ఉషారుగా అన్నాడు.

"ఆమెకి భర్తగా రూపొందకముందు గంగాధర్ డైరెక్టు చేసిన 'చీకట్లో నీడలు' నిర్మాత సప్తగిరిమూర్తి శశిప్రియను ద్వేషిస్తున్నాడు. చీకట్లో నీడల్లో నేల కరుచుకున్న అతను నామినల్ రేటుమీద తన రెండో పిక్చర్లో నటించమని ఆమెని అడిగాడు. ఆమె నిరాకరించింది. కాల్ షీట్స్ లేవంది. చీకట్లో నీడలు డైరెక్టు చేసిన గంగాధర్ తన భర్త కాడంది. తన భర్త అయ్యాక డైరెక్టు చేసివుంటే ఫ్రీగా యాక్టు చేసి పెట్టేదాన్నంది. సప్తగిరిమూర్తికి ఆమెమీద ఏడుకొండలంత కసివుంది!"

"తరవాత?" పృథ్వీరావ్ అడిగాడు.

"రెండో వ్యక్తి: ప్రొడ్యూసర్ వీరాస్వామినాయుడు. శశిప్రియకి ఫస్ట్ ఛాన్స్ ఇచ్చిన వ్యక్తి. పరిశ్రమలో అతని ప్రత్యర్థి వీరారెడ్డి చిత్రంలో నటించవద్దని అతను శశిప్రియకి సలహా ఇచ్చాడు. ఆమె అతనిమీద తిరగబడింది. ఇతర నిర్మాతల్ని ఇన్ ఫ్లుయెన్స్ చేసి ఆమెకి భవిష్యత్తు లేకుండా చేయడానికి వీరాస్వామినాయుడు యెంతో ప్రయత్నించాడు. అతనిది పాము పగ అని ఇండస్ట్రీలో అందరికీ తెలుసు...."

"సెట్స్?"

"హీరో ఇంద్రమోహన్; నటి భామిని" టెంపో జవాబిచ్చాడు.

"కారణం?"

"ఇంద్రమోహన్ శశిప్రియను దారుణంగా ప్రేమించాడు. ఆమె తన భార్య అయితే, ఆమె చిత్రాల్లో తనకి మంచి ఛాన్సులుంటాయని అతను ఆశించాడు. హీరో హీరోయిన్ లయిన తామిద్దరూ మొగుడూ పెళ్ళాలయితే మంచి మంచి చిత్రసంతానాన్ని కనొచ్చని ఆశించాడు. శశి అతన్ని మోకాలితో తోసేసి, గంగాధర్ ని కట్టుకుంది. అలాగే భామిని గంగాధర్ మీద కన్నేసింది. ఆమెని నిర్లక్ష్యం చేసి అతను శశిప్రియను నెత్తిన కూచో బెట్టుకున్నాడు. సో, శత్రువుల శత్రువులిద్దరూ మిత్రులై భార్యాభర్తలైపోయారు. కానీ, ఇద్దరూ ఇద్దర్నీ మరిచిపోలేదు!"

"చాలు, తల తిరిగిపోతోంది!" పృథ్వీరావ్ నీరసంగా అన్నాడు.

"ఇంకా వుంది: ఇంకా ఒక వ్యక్తి వున్నాడు: శేఖర్!"

"ఒప్పుకుంటాను. నువ్వు చెప్పిందాన్నిబట్టి శేఖర్ కి రీజనబుల్ మోటివ్ వుంది. అట్లాగే ఇందాకా చెప్పిన వాళ్ళందరికీ వుంది. ఇంతమందిలో దొంగ ఎవరిలో దాక్కున్నాడో కనిపెట్టడం అంత సులభంకాదు! ఈ రోజుల్లో జరిగేది అసలేకాదు!" పృథ్వీరావ్ కంఠంలో నిరాశ ధ్వనించింది.

"వీళ్ళందరికీ గురువు, చిత్రపరిశ్రమకి కురువృద్ధుడు, దర్శక నిర్మాత, ప్రస్తుతం చాలామంది నిర్మాతలకి

ఫైనాన్షియర్ ప్రత్యగాత్మారామ్ ఉన్నాడు. నాలుగింటికి వాళ్ళలో కొందర్ని ఆయన ఇంట్లో నేను కల్సుకుంటున్నా. ప్రత్యగాత్మారామ్ నాకు మిత్రుడని నీకు తెలుసు!" టెంపో ముగించాడు.

పృథ్వీరావ్ నిట్టూర్చాడు. "ఓకే.. నువ్వు పొమ్మంటే పోతాను; రమ్మన్నప్పుడు వస్తాను...."

"తొమ్మిదింటికి ఫోన్ దగ్గరగా, శరీరం దగ్గరగా కూచో!" టెంపో నవ్వుతూ అన్నాడు.

# 8

మూసిన గది తలుపుల్ని చూస్తూ డిటెక్టివ్ టెంపో హాలుమధ్య స్తంభంలా కాసేపు నిలబడ్డాడు. లోపల్నుంచీ పొంగుకొస్తున్న ఉద్రేకాన్ని ఏదో అనుమానం బలహీనంగా అణగదొక్కుతోంది. గోడగడియారం రాగయుక్తంగా శబ్దం చేయసాగింది. ఆలోచనల్లోంచి తెప్పరిల్లి అతను గడియారంకేసి చూశాడు. పది ...

క్షణంలో ఒక నిర్ణయానికి వచ్చి టెంపో మేడ మెట్లవేపు కదిలాడు. మెట్లని కప్పిన రెడ్ కార్పెట్ అతని బూట్లు చేయబోతున్న శబ్దాన్ని మింగేస్తోంది. కాసేపట్లో పైకి చేరుకుని, మూసిన తలుపుల ముందు నించున్నాడతను. లోపల్నుంచీ ఏ శబ్దమూ వినిపించడం లేదు. టెంపో వేళ్ళ కణుపుల్తో తలుపుమీద చప్పుడు చేశాడు.

నిశ్శబ్దం. అతని వేళ్ళు రెండోసారి తలుపుని తట్టాయి.

"ఎవరు?" బొంగురు కంఠం కసిరింది.

"తలుపు తెరవండి!" టెంపో బిగ్గరగా అరిచాడు.

"డోంట్ డిస్టర్బ్! గెటౌట్!" బొంగురు కంఠం కోపంగా గర్జించింది.

"తలుపు తెరిచేదాకా తట్టుతూనే వుంటాను; తెల్లారిపోయినాసరే!" టెంపో కంఠం ప్రతిధ్వనించింది. తలుపు మీద అరచేతిని ఆన్చి, టెంపో సిద్ధంగా నిలబడ్డాడు.

తటాలున గొళ్లెం లాగబడింది. తలుపు విసురుగా లోపలికి కదిలింది. టెంపో తన శక్తిని అరచేతిమీదికి కేంద్రీకరించాడు. తలుపు బలంగా తోయబడింది.

గుమ్మంలో నిలబడ్డ వ్యక్తి రౌద్రంగా చూస్తున్నాడు. పొడుగ్గా, బలిష్టంగా వున్న ఆకారం. పక్కపాపిడి క్రాపు, సన్నటి మీసాలు. అతని కళ్ళు ఎర్రగా వున్నాయి. గళ్ళలుంగీ ఒకే గుండీ పెట్టుకున్న పొడుగు చేతుల చొక్కా. అతను ఆదరాబాదరా డ్రెస్ చేసుకు వచ్చినట్టు చెప్తోంది.

"వాటీస్ దిస్? ఎవర్నువ్వు?" కోపంతో అతని పెదవులు వణికాయి.

"డిటెక్టివ్ టెంపో పేరు వినేవుంటారు..." టెంపో మర్యాద ఉట్టిపడేలా అన్నాడు. అతని చెయ్యి బలంగా తోసుకునే వుంది.

"టెంపో పేరూ వినలేదు, టాక్సీ పేరూ వినలేదు. గెటౌట్!" హుంకరించాడతను.

"ఐ వాంటు టూ గెట్ ఇన్. అయామ్ గోయింగ్ టూ గెట్ ఇన్! అండ్ అయామ్ గెటింగ్ ఇన్!" అంటూ టెంపో తలుపునీ, అతన్నీ తోసుకుంటూ లోపలికి జొరబడ్డాడు. తలుపు కొద్దిగా ముందుకు కదిలింది.

"ఏమిటీ దౌర్జన్యం? ఐ విల్ సీ దట్..." టెంపో చేతుల్లోని బలాన్ని కొద్దిగా రుచిచూసిన అతను రొప్పుతూ

అరిచాడు.

"బాజా భజం తీలతో లాకప్‌లోకి ఊరేగుతూ వెళ్ళకూడదనుకుంటే కిక్కురుమనకుండా పడుండు!" టెంపో నిర్లక్ష్యంగా అన్నాడు.

అతని చెయ్యి బలంగా టెంపో భుజమ్మీద పడింది. టెంపో ఎడమచెయ్యి అతని మణికట్టుని పట్టకారులా పట్టుకుంది. టెంపో అతనివైపు చూడ్డంలేదు. సలుపు అతని భుజంలోకి మెరుపువేగంతో ఎగబాకివుంటుందని టెంపోకి తెలుసు.

మంచం దగ్గరగా గోడకి ఆనుకుని నించుని, కంగారుగా చూస్తున్న యువతిని చూస్తూ టెంపో సన్నగా ఈలవేశాడు. ఆమె కళ్ళల్లో సిగ్గూ, భయం ప్రత్యక్షమవుతున్నాయి. పల్చటి చీరని రెండు చేతుల్తో గడ్డం కింద పట్టుకుందామె. చీర అస్తవ్యస్తంగా కిందికి వేళ్ళాడుతోంది. చీర వెనక ఆమె ఒంటిపై గుడ్డ ఏదీ లేదని టెంపోకి తెలుసు.

టెంపో, తన భుజంమీద అతని వేళ్ళు వొణుకుతున్నట్టు గ్రహించాడు. మెల్లిగా తలతిప్పి అతన్ని నవ్వుతూ చూశాడు. అతని చేతిని భుజమ్మీంచీ విసురుగా, దూరంగా లాగాడు. నొప్పిని దిగమింగే ప్రయత్నం చేస్తున్న అతని నోరు వంకర్లు తిరిగింది. కళ్ళల్లో ఆగ్రహానికి బాధ చేరింది.

"బుద్ధిగా, తోక ముడుచుకుని వెళ్ళి మంచంమీద కూచో!" టెంపో బెదిరిస్తున్నట్టు అన్నాడు. టెంపో చేతిపట్టునుండీ విముక్తిపొందిన తోలుబొమ్మలా కిందికి వేళ్ళాడుతున్న తిమ్మిరెక్కిన చేతిని ఎడంచేత్తో ఆప్యాయంగా పట్టుకున్నాడతను.

"వచ్చిన పనేమిటో చెప్పేసి, వెళ్ళిపొండి. అయామ్ బిజీ...." అన్నాడతను బహువచనం ఉపయోగిస్తూ.

టెంపో చిన్నగా నవ్వాడు. "నువ్వు బిజీగా వున్నావని వొంటికి అడ్డం పట్టుకున్న కోలా చెప్తోంది! నేను వచ్చిన పని ఇరవై నాలుగు రీళ్ళ సినిమా అంత పెద్దది. శశిప్రియ బ్లూ ఫిల్మ్‌లా అంత త్వరగా అయిపోదు, గంగాధర్!" టెంపో వెటకారంగా అన్నాడు. గంగాధర్ అప్రయత్నంగా ఒకడుగు వెనక్కి వేశాడు.

"వాట్ డూ యూ మీన్?" అతని బొంగురు కంఠం పలికింది.

టెంపో వినపడనట్టు కోలా వైపు చూశాడు. "కోలా, గోడకి కరుచుకోడం మానేసి బాత్‌రూమ్‌లోకి పరుగెత్తు. స్నానం చేయడానికి కాదు, చీర కట్టుకోడానికి!"

క్షణకాలం తటపటాయించి, కోలా గోడని అనుకుని అలాగే పక్కవాటంగా ఎడంవేపుకి జరగడం ప్రారంభించింది. కాస్సేపట్లో ఆమె వీపు బాత్‌రూమ్ డోర్ని తాకింది. చీరని ఒక చేత్తో జాగ్రత్తగా పట్టుకుని మరో చేతిని మెలితిప్పి, వెనక్కి పోనిచ్చి, హాండిల్ తిప్పుతూ డోర్ని తోసింది. వెనక్కి కదుల్తూ బాత్‌రూమ్‌లోకి దూరింది. తలుపు మెల్లిగా మూసుకుంది.

"మిస్టర్... నువ్వు... మీరు.....చాలా అసభ్యంగా ప్రవర్తిస్తున్నారు. యేడుస్తూ పశ్చాత్తాపపడతారు!" గంగాధర్ మాటలు అతని అట్టడుగులో వున్న కోపాన్ని తాడులా పైకిలాగే ప్రయత్నం చేశాయి.

టెంపో అతన్ని హీనంగా చూశాడు. "కట్టుకున్న పెళ్ళాంతో బ్లూ ఫిలిమ్ తయారుచేయడంకన్నా, కట్టుకున్న పెళ్ళాం ఇంట్లో వుండగానే ఆమె బెడ్

రూమ్‌లో, ఆమె బెడ్ మీదే కోలాలాంటి వాళ్ళున్ముడనే ఆడాళ్ళతో పలకడం కన్నా, నా ప్రవర్తన అసభ్యం కాదు గంగాధర్!"

"ఏమిటీ వెర్రివాగుడ్?" గంగాధర్ గర్జించాడు.

"భార్య ప్రణయాన్ని బ్లూఫిల్మ్ తీయకుండా, ఏదో తెలుగు సినిమాని నువ్వు డైరెక్ట్ చేయాల్సింది!"

"వాట్ నాన్సెన్స్..."

"నీ బ్లూ ఆటా, నీ ఆటా కట్టయింది గంగాధర్. బుకాయించే అవకాశం నీకు లేదు!" టెంపో సగర్వంగా అన్నాడు.

గంగాధర్ మింగేసేలా చూశాడు. "నీకు నిజంగా పిచ్చిపట్టింది. భార్యతో బ్లూ ఫిలింతీసి ఏ భర్తా లోకానికి చూపించడు! ఇంక కోలా సంగతి. ఇది నా ఇల్లు. కోలా నా మనిషి. నా ఇంట్లో, నా మనుషుల్తో నా ఇష్టమొచ్చినట్టు ఎగురుతాను. అడ్డు చెప్పడానికి నువ్వెవరు?"

"ఎగిరావు, చాలా ప్రమాదకరమైన ఎత్తుకి. అంత ఎత్తునుంచీ కుప్పకూలిపోతావ్! శశిప్రియతో నువ్వు సాగించిన ప్రణయాన్ని ఫిలిమ్ మీదకి ఎక్కించావు. ఇక్కడ చూపించకుండా, చాలా నాచురల్‌గా, అమాయకత్వం నటిస్తూ పారిస్‌లో ఆమె ఆ చిత్రం చూసేలా ప్లాన్ చేశావు..."

గంగాధర్ నవ్వు టెంపో మాటలకి అనకట్ట కట్టింది. "నా భార్యతో నేను సాగించిన ప్రణయం! ఇంకా సేపట్లో ఆ ఫిల్మ్‌లోని మగాణ్ణి నేనే అనేలా వున్నావు!"

"ఇంకాసేపట్లో కాదు, ఇప్పుడే అంటాను! ఫిలిమ్

లోని ఆ ఆబోతు తోలుకింద దాక్కున్న కోడెదూడ నువ్వే! చాలా చాకచక్యంగా, నీ తల తీసి మరో తల తగిలించావు! నీ శరీరం...."

"ఎందుకో! శశిని నేను ప్రేమించి పెళ్ళాడాను. ఆమెకి అందం. టాలెంట్, డబ్బూ అన్నీ వున్నాయి. ఆమెకి ఉన్నవన్నీ నావే! ఏమిటి సాధించాలని నా భార్యని బ్లూ ఫిలింలోకి దించాను? భార్యని బ్లూ బొమ్మగా దించి, ఏ భర్తా లోకానికి చూపించడని ఇందాకే చెప్పావు!" గంగాధర్ వెటకారంగా అన్నాడు.

టెంపో చిన్నగా నవ్వాడు. "డబ్బుకోసం కట్టుకున్నదాన్ని పరాయి మగాళ్ళకి అమ్మే లుచ్ఛాలున్న ఈ లోకంలో, పెళ్ళాంతో బ్లూ ఫిలింతీసి చూసే, చూపించే నీలాంటి పెద్దమనుషులూ వుంటారు, గంగాధర్!"

గంగాధర్ కళ్ళు గాలివూదబడిన నిప్పుకణాలయ్యాయి. పిడికిళ్ళు బిగుసుకున్నాయి. "నీతో వాదిస్తూ కబడీ ఆడాల్సిన అవసరంలేదు. అయినా, నా హోదాని దృష్టిలో వుంచుకుని, ఒకమాట చెప్తాను. ఆ ఫిల్మ్ శశికి పెళ్ళవకముందే తీయబడింది. కళ్ళు తెరిచిచూస్తే నీకు తెలుస్తుంది!"

"టెంపోగారూ...."

టెంపో చటాలున తలతిప్పి చూశాడు. గుమ్మంలో నిలబడి శశిప్రియ ఆందోళనతో చూస్తోంది. "టెంపో గారూ....మీరు పొరబడ్డారు. నందిని ఆబోతనుకుంటున్నారు! అయినా....అలాంటి పని చేయకు! అందులో— ఆ ఫిల్మ్‌లో—ఏదో మిస్టరీ వుంది. వెళ్ళాల్సిన చోటికి

వెళ్ళండి! ప్లీజ్...."

టెంపో చిన్నగా నవ్వాడు. "రావాల్సిన చోటికే వచ్చాను. మిస్టరీని బట్టబయలు చేస్తాను!" అన్నాడు గంభీరంగా.

"టెంపోగారూ...."

"శశీ....నిన్ను నేను సాధించలేదు; బాధించలేదు. నీ మానాన నిన్ను వదిలేశాను. జరిగిందాన్ని నెమ్మదిగా జీర్ణం చేసుకోడానికి ప్రయత్నిస్తున్నాను. తొందర పడ్డావు. ఈ అనుమానం మనిషిని, అనవసరంగా నా మీదికి ఉసిగొలిపావు!" గంగాధర్ సాధింపుగా అన్నాడు.

"శశిని నువ్వు బాధ పెడుతున్నావో లేదో నాకు తెలీదు. ఆమెని అతి తెలివిగా బ్లాక్ మెయిల్ చేస్తున్నావు! బ్లాక్ మెయిల్ చేయడం బాధించడమనే నా నమ్మకం!"

"శశీ, నీ డిటెక్టివ్ కి మతిభ్రమణ ఉన్నట్టుంది! నిన్ను నేను బ్లాక్ మెయిల్ చేస్తున్నానట! విన్నావా?" గంగాధర్ ఎగతాళిగా అన్నాడు.

"ప్లీజ్.... టెంపోగారూ...."

"గంగాధర్, ఆమెని అసహాయ స్థితిలో, నోరెత్తడానికి వీల్లేని చిత్రమైన స్థితిలో పడేశావు. బ్లూఫిలిం ద్వారా ఆమెని డిఫెన్సివ్ గా నడుచుకునేలా చేశావు. ఇందుకోసం నీ నైపుణ్యమంతా వినియోగించావు. నీ బ్లూ ఫిలిం ఉద్దేశం అదే. ఆమె చూస్తే చాలు! లోకం చూడక్కర్లేదు. అందుకే ఆ ఫిలిం కాపీలు ఎక్కడా లేవు! సరిగ్గా నువ్వు హనీమూన్ వెళ్ళే సమయానికి కంఫర్టబుల్ గా పారస్ చేరింది...."

"మొదట శశిని ఎలా ఎందుకు బ్లాక్ మెయిల్ చేస్తు

జ్ఞానో ఊహించి కథ చెప్పు. నీకిచ్చిన ఫీజుకి ఆమె కనీసం కట్టు కథేనా వింటుంది!" గంగాధర్ అడ్డు తగిలాడు.

"చెప్తాను; కట్టు కథ కాదు. గట్టి నిజం! పెళ్ళయ్యాక ఆమె లావాదేవీలు నీ చేతుల్లోకి తీసుకున్నావు. శక్తికి మించి ఆమె సినిమాల్లో నటించేలా బుక్ చేశావు. ఆమె రేటు పెంచి రెండు చేతులా గుంజుకుంటున్నావు. బ్లూ ఫిలిం ఆమె నోరు నొక్కేసింది. నువ్వు విచార సముద్రంలో పూర్తిగా మునిగిపోయి, తనకి దూరంకాకుండా వుంటానికి శశి ప్రయత్నిస్తోంది. ఎందుకని ఆమె నిన్ను అడగదు. డబ్బుని మెల్లిగా మింగేసుకుంటున్నావు. ఆమెని నిర్మాతలకి బానిసలుగా అమ్మేసి, నోరునొక్కేసి బ్లాక్ మెయిల్ చేస్తున్నావు...."

"ఎందుకో?"

"సినిమాలు తీసిపారేసి. దెబ్బతిన్న నీ రెప్యుటేషన్ని పైకెత్తుకోడానికి. చిత్రలోకంలో టాప్ రాంక్‌లో టాప్‌లో చేరిపోడానికి!" టెంపో నవ్వుతూ అన్నాడు.

గంగాధర్ పగలబడి నవ్వాడు, "నేను నోరు తెరిచి అడిగితే శశిని బుక్ చేసుకున్న నిర్మాతలందరూ కిక్కురుమనకుండా డైరెక్షన్ ఛాన్స్ ఇస్తారు! తరవాత, నాకు సొంతంగా సినిమా తీయాలన్న ప్లాన్ వున్నట్టు అద్భుతంగా ఊహించి, నాకు చక్కటి ఐడియా ఇచ్చావు! థాంక్స్!"

"నిర్మాతలు నీకు డైరెక్షన్ ఛాన్స్ ఇవ్వరు. అది నీకు తెలుసు, నాకూ తెలుసు! శశిని నీ ద్వారా బుక్ చేసుకున్న నిర్మాతలు ఛాన్స్‌కు బదులుగా రెండేసి లక్షలు ఎక్కువగా పారేశారు! వాళ్ళ పేర్లూ, డబ్బిచ్చిన

తేదీలా చెప్పమంటావా? తరవాత....సొంతంగా సినిమా తీసే ఐడియా నాలాంటి వ్యక్తికి ఇవ్వఖర్లేదు. నీకే పుట్టుంది; పుట్టింది. త్వరలో నువ్వు ఒక కమర్షియల్ సూపర్ హిట్ తీయబోతున్నావు. టాప్ లెస్ హీరోయిన్ని తెలుగు ప్రేక్షకులకి బహూకరించబోతున్నావు. ఇది నిజమో కాదో బాత్ రూమ్‌లో ఇంకా చీర కట్టుకుంటూనే వున్న కోలాని అడిగితే చెప్తుంది!"

"టెంపో గారూ!" శశిప్రియ ఆశ్చర్యంగా అరిచింది. టెంపో దగ్గరగా వచ్చిన ఆమెని నవ్వుతూ చూశాడు.

"శశీ, నీలో ఎన్నో సందేహాలున్నాయి; తీరుస్తాను. నీ భర్తకి నడుం పైభాగంలో అరచెయ్యి వెడల్పులో పుట్టుమచ్చ వుంది. ఇవాళే ఆ సంగతి కనుక్కున్నాను. ఫిలింలో వ్యక్తికి ఆ మచ్చ లేదు. మచ్చల్ని సృష్టించినట్టే, మచ్చల్ని తాత్కాలికంగా మేకప్‌తో మాయం చేయొచ్చు! గంగాధర్ హోటల్ గోల్కొండలో నీతో ప్రణయం సాగించినప్పుడు ఆ మేకప్ చేసుకున్నాడు!

"తరవాత....పెళ్ళికిముందే నీ బ్లూ బొమ్మ తయారైందని ఇందాక అతను బుకాయించాడు. జాగ్రత్తగా చూస్తే ఆ ఫిలింతీసేనాటికి నీకు పెళ్ళయిందని అర్థమవుతుంది. తలగడకింద జాగ్రత్తగా పెట్టిన నీ మంగళసూత్రం కొద్దిగా ఇవతలికి కనిపిస్తోంది! మూడింతలు నీ భర్తే ఆ సమయంలో మంగళసూత్రం తీయించి వుండాలి...."

"మిస్టర్ టెంపో....ఒకసారే కాదు, చాలాసార్లు... ప్రతిసారి నేను మంగళసూత్రం తీసి తలగడకింద పెట్టేదాన్ని....ఆఫ్ కోర్స్ ఇద్దరిమధ్యా అదెందుకని ఆయన అనేవారు...." శశిప్రియ కంఠం వణుకుతూ ఆగింది.

మరో సంగతి: గంగాధర్ ఛాతీ నిండుగా ఎలుగొడ్డుకి వున్నట్టు వెంట్రుకలున్నాయి. ఫిల్ములో 'హ్యారీ' ఛాతీమీద వెంట్రుకలు అసలు లేవు. ఫిల్ము షెడ్యూల్ ఫిక్సవ్ చేసుకున్నాక, అతను శరీరంమీద వెంట్రుకలు లేకుండా చేసుకున్నాడు. కత్తిలాంటి గంగాధర్‌కి అదేమంత కష్టమయిన పని కాదు!" టెంపో నవ్వుతూ ఆగాడు.

శశిప్రియ కళ్ళల్లో ఆశ్చర్యం ఆమె కళ్ళకన్నా పెద్దగా అవుపిస్తోంది. అప్రయత్నంగా ఆమె దృష్టి గంగాధర్ వేపు తిరిగింది. గుండీలన్నీ పెట్టుకోని అతని చొక్కాలోంచీ ఛాతీ గొంగళిలా అవుపిస్తోంది. అతని కళ్ళు అదోలా శశిప్రియవైపు చూశాయి.

"శశీ....డోంట్ బిలీవ్ హిమ్. హి ఈజ్ క్రూకెడ్! ఇతడు చెప్పిందంతా కట్టుకథ. నన్ను మాత్రమే కాదు, ప్రతి భర్తనూ అవమానించే చెత్తకథ అది! నా సంగతి నీకు తెలుసు!" గంగాధర్ ఉద్రేకంతో అన్నాడు.

శశిప్రియ సందిగ్ధంగా అతన్నీ టెంపోనీ చూస్తోంది. ఇద్దర్నీ నమ్మాలనిపిస్తోన్న భావం, ఇద్దర్నీ నమ్మకూడదన్న అనుమానం ఆమెని ముందుకీ వెనక్కీ లాగుతున్నాయి. డిటెక్టివ్ టెంపో ఆమెని జాలిగా చూస్తూ, గంగాధర్ వైపు తిరగాడు.

"మిస్టర్, నా గెటౌట్! శశిదగ్గర ఫీజు గుంజాకని, యేమీ చేయలేక, ఫీజు వాపసు చేసే యిష్టంలేక నా మీద బురదకొట్టి, ఆమె మనసుని పాడుచేయాలనుకున్నావ్! ఇందుకు మరో కారణం కూడా వుంది. నన్ను చండాలుడిగా నీ తర్కంతో చిత్రించి శశిని నాకు దూరం చేయడానికి మరో చోటినుంచీ నీకు చేతుల్నిండా

ఫీజా దొరికింది!"

శశిప్రియ తనవేపు కటూలున తల తిప్పినట్లు టెంపో గుర్తించాడు. ఎగతాళిగా నవ్వుతూ గంగాధర్ని చూశాడు. "ముత్తంమీద సినిమా డైరెక్టరనిపించుకున్నావ్, సినేరియోని అప్పటికప్పుడే అల్లేస్తున్నావ్! కానీ .."

"అల్లడం కాదు; అసలు సంగతి శేఖర్ని నిలదీస్తే బయటపడుతుంది! శశిని సొంతం చేసుకోలేని ఆ చవటాయ యిప్పుడు ఈ ప్లాన్ వేశాడు! నీ నాటకంతో శశి నాకు దూరమవుతుంది. శేఖర్ గాడు మెల్లిగా ఆమెకి దగ్గరవుతాడు!" గంగాధర్ ఆవేశంతో అన్నాడు.

"శేఖర్ దాకా యెందుకు? నిన్ను నిలేసి నీ చేత నిజం కక్కిస్తాను. ఎవరు, యెందుకు ప్లాన్ చేశారో నాకు బాగా తెలుసు నీ ప్లాన్లో భాగంగా పారిస్ ఓడియన్ థియేటరు ఓనరుకి నువ్వు స్వయంగా క్యాసెట్ అందించిన విషయం క్రైమ్ ఇన్స్పెక్టర్ పృథ్వీరావ్ ద్వారా కనుక్కున్నాం. ఫ్రాన్స్ పోలీస్ ఉన్నతాధికారి అక్కడ నిజాన్ని కక్కించాడు!" టెంపో ఆగి, సిగరెట్ వెలిగించాడు. గంగాధర్ కళ్ళలో కదిలి మాయమయిన యేదో మార్పు అతని చూపుల్నుంచీ తప్పించుకోలేక పోయింది.

"సాధారణంగా బ్లూఫిలిం క్యాసెట్ని కొంటూ యెవరైనా దొరికిపోతారు. ఓడియన్ వోనరు నీ ఇంటరెస్టు చూసి, నీ అర్థం గమనించి ఆ రోజు దాన్ని ప్రదర్శించడానికి నీ దగ్గరే డబ్బు గుంజుకున్నాడు!" టెంపో నవ్వుతూ అన్నాడు.

గంగాధర్ మంచం దగ్గరగా కదిలాడు. తలగడ

పక్కనే పడున్న సిగరెట్ పాకెట్ని అందుకున్నాడు. సిగరెట్ని వెలిగించి, శశిప్రియని తదేకంగా చూశాడు.

"శశీ, ఈ గదిలో నేనో, అతనో వుండాలి. ఫుట్ పాత్ మీద నోటికి వచ్చిందల్లా కూసే కొత్తపిచ్చివాడిలా యేమిటేమిటో వాగుతున్నాడు! ఆ ప్రలాపాల్ని వోపిగ్గా వింటున్నావు నువ్వు. ఈ నాటకంలో శేఖరుతో బాటు నువ్వు కూడా పాత్రధారణ చేస్తున్నావని యింత సేపటికీ అర్థం చేసుకోగలిగాను! నీతో పారస్ వెళ్ళినందుకు యిప్పుడు సంతోషిస్తున్నాను. నీ నిజస్వరూపం అక్కడ నాకు కనిపించింది! నిన్ను ప్రేమించాను; గుడ్ బై శశీ.... బీ హాపీ విత్ యువర్ శేఖర్!"

"గంగాధర్...." శశిప్రియ కంగారుగా అంది.

"అంత తొందరేం లేదు గంగాధర్! కొంచం వోపిక పట్టు!" డిటెక్టివ్ టెంపో ఎగతాళిగా అన్నాడు.

గంగాధర్ ఠీటాలున అతనివైపు తలతిప్పి నిప్పులు కక్కుతూ చూశాడు. "గెటౌట్ యూ...."

బాత్ రూమ్ డోరు చప్పుడు గంగాధర్ని ఆటకా యించింది.

చీర కట్టుకున్న మిస్ కోలా గదిలోకి నూసుకొచ్చింది. ఆవేశంతో ఆమె ఛాతీ ఎగిరెగిరి పడుతోంది. ఎర్రటి కళ్ళతో ఒకసారి గంగాధర్ని చూసి శశిప్రియ వేపు తిరి గింది,

"శశిప్రియగారూ మీరు నన్ను క్షమించాలి. మీ గూటిని కొల్లగొట్టే ఉద్దేశంతో నేను ఇక్కడికి రావడం లేదు. అతనికి ఆడది కావాలి, నాకు డబ్బు కావాలి. అంతే. అయితే. ఈ మధ్య నామీద మోజు యెక్కువైంది. త్వరలో తీయబోయే అచ్చ తెలుగు సినిమా గురించి

వాడు చెప్పాడు గంగాధర్. అందులో మెయిన్ రోల్ నాకు యిమ్మన్నాను. నిజం చెప్పాలంటే ఇచ్చితీరాలని ఒకసారి బెదిరించాను. గంగాధర్ అలా బెదిరే వ్యక్తి కాదు. నా బెదిరింపుకి సమాధానంగా గుడ్డలేని స్థితిలో రహస్యంగా తీసి నా ఫోటోని నాకు ప్రెజెంటు చేశాడు! ఆ ఫోటోతో నా నోరు నొక్కేశాడు...."

"యూ బిచ్...." గంగాధర్ అరిచాడు.

"గంగాధర్ లుచ్చా. నా నేకెడ్ ఫోటో తీసినట్టే మీ బ్లూఫిలిం కూడా తీసివుంటాడు!" శోలా అతన్ని పట్టించుకోకుండా హుంకరించింది.

గంగాధర్ మెరుపులా కదిలాడు. అతని చెయ్యి మెరుపులా కదిలింది శోలా చెంప చెళ్ళుమంది. కెవ్వున అరుస్తూ శోలా గోడకి విసురుగా పడింది. గంగాధర్ రౌద్రంగా టెంపో వైపు తిరిగాడు.

"నువ్వు కడుతున్న అబద్ధాల గోడకి అబద్ధాల ఇటుకలు పేర్చే చేయడానికి శోలా ముందనీ ముందు జాగ్రత్తతో నియమించావన్న మాట! ఆల్ రైట్!.... శశి...."

"గంగాధర్, సినీఫీల్డులో ఆకాశాని కెక్కడం కోసం శశిని బలిచేసి, ఆమె డబ్బుతో నిచ్చెన తయారు చేసుకోవాలనుకున్నావ్. ఆమెని బ్రెయిన్ వాష్ చేసి పెళ్ళాడంలో నీ ఉద్దేశం అదే అని నా పరిశోధన వల్ల వెల్లడైంది. నేను చెప్పేదంతా నిజమనీ, నువ్వాడేవన్నీ, ఆడినవన్నీ అబద్ధాలే అనీ నిరూపించే సాక్ష్యం, డూప్లని ఉపయోగించక ముందు తీసిన బ్లూఫిల్మ్ కాపీ నీ గదిలో నే దాచుకుంది!" టెంపో గబగబా అన్నాడు; వోరగా శశిని చూస్తూ.

శశిప్రియ వాలుగా గంగాధర్ని చూస్తోంది. ఆమె చూపులు మంచం వెనక గోడలోకి వున్న అలమారమీద క్షణకాలం నిలిచాయి. టెంపో గొంచెం ముందుకి కదిలాడు.

"శశీ, నీలో యింకా మిగిలివున్న అనుమానాన్ని పటాపంచలు చేసే ఆ అసలు క్యాసెట్ని ఇప్పుడే నీకు చూపిస్తాను!" అంటూ టెంపో అలమారవైపు నడిచాడు. జేబులోంచీ స్కెలిటన్ కీని ఇవతలికి తీశాడు.

గంగాధర్ మంచంమీద కూచున్నాడు. శశిప్రియా, యిప్పుడు లేచి విగ్రహంలా నించున్న కోలా కళ్ళు పెద్దగా చేసుకుని టెంపోవైపే చూస్తూన్నారు. గంగాధర్ నిర్భయంగా సిగరెట్ వెలిగించాడు. కాసేపట్లో అలమార తాళంచెవి క్లిక్మంది. శశిప్రియ అసంకల్పితంగా అలమారవైపు కదిలింది.

అలమార పై అరలో, బ్రౌన్ కవర్లో భద్రం చేయబడిన క్యాసెట్ని టెంపో ఇవతలికి తీశాడు. నవ్వుతూ, తన సమీపంలో నిలబడ్డ శశిప్రియను చూశాడు.

"నిన్నూ అతన్నీ చూపించే అసలు క్యాసెట్ ఇదే అని నా నమ్మకం!" అన్నాడు చిరునవ్వుతో.

"నీ నమ్మకాన్ని జేబులో దాచుకుని, ఆ క్యాసెట్ని ఇలా విసురు!" గంగాధర్ కంఠం వినిపించి టెంపో వెనక్కి తిరిగిచూశాడు.

మంచం ముందు నిటారుగా నించున్నాడు గంగాధర్. అతని చేతిలో రివాల్వరు మెరుస్తోంది. అతని పెదవుల చివర్లలో చిరునవ్వు గర్వంగా తొంగిచూస్తోంది. అతని కనుగుడ్లు కదలడం మానేసిన గోలీకాయలా వున్నాయి. రెప్పలు కదల్చకుండా టెంపోనే చూస్తు

న్నాడతను.

భయం తో, ఆశ్చర్యంతో శశిప్రియ ఊపిరి పీల్చు కోడం టెంపోకి స్పష్టంగా వినిపించింది.

డిటెక్టివ్ టెంపో కనుబొమలు పైకి లేచాయి. చిరు నవ్వు అతని పళ్ళమీద తెల్లగా మెరిసింది. క్యాసెట్ పట్టుకున్న అతని చెయ్యి కొద్దిగా కదిలింది. గంగాధర్ చేతిలో రివాల్వరు కొద్దిగా, పైకి టెంపో ఛాతీ ఎడం వైపుకి చూసింది.

"ఆగు!" గంగాధర్ గర్జించాడు.

"క్యాసెట్‌ని విసరొద్దు మెల్లిగా మంచం నీ కాళ్ళకి తగిలేదాకా ముందుకి కదులు. క్యాసెట్‌ని మంచంమీదకి వదులు. రెండు చేతుల్నీ పైకెత్తు!" గంగాధర్ హెచ్చ రించాడు.

కదలబోయిన టెంపోని శశిప్రియ కంఠం ఆపింది.

"గంగాధర్!" ఆమె కంఠంలో ఆశ్చర్యం, ఆవే దనా కలిసి ధ్వనించాయి. "అయితే....అయితే.... టెంపోగారు చెప్పిందంతా నిజమే అన్నమాట!నిన్ను.... నిన్ను....ఎంత ప్రేమించాను....గంగాధర్! నిజాన్ని నమ్మడంలో....నా ప్రేమ....ఇంతసేపూ నాకు అడ్డు తగులుతూనే వుంది...ఇదంతా అబద్ధమనీ.... ....నువ్వీ దారుణం చేయలేదనీ చెప్పు గంగాధర్!" శశిప్రియ ఆవే శంతో, ఆవేదనతో అరిచింది. టెంపో ఆమెని వాలుగా చూశాడు. కన్నీళ్ళు ఆమె మొహంమీద కాలువలు కట్టు న్నాయి. రెండు చేతుల్తో కణతల్ని నొక్కుకుంటూ గంగాధర్నే చూస్తోందామె. సన్నగా ధ్వనిస్తూన్న ఆమె ఏడుపుని గంగాధర్ నవ్వు మింగేసింది.

"గంట నుంచీ చెపుతూనే వున్నాను! కానీనీ శ్రేయోభి

లాపి టెంపో నమ్మలేదు. నువ్వు కూడా! శ్యాపెట్ కోసం దేశదేశాలూ వెతికించీ, ఈ డిటెక్టివ్‌ని నియమించీ అనవసరంగా డబ్బు తగలేశావ్! ఆల్ రైట్. జరిగిందేదో జరిగింది. ఇంతా జరిగాక, నన్ను నువ్వు అనుమానించాక, మనిద్దరం ఒకే కప్పుకింద వుండటం జరగదనుకుంటున్నా. ఇప్పుడే వెళ్ళిపోతున్నా. నీ కెరీర్‌కి దెబ్బ తగులుతుందనుకుంటే అవసరమైనంత కాలం నిన్ను నా భార్యగా చెప్పుకోడానికి అనుమతి యిస్తున్నా! గుడ్ బై!” గంగాధర్ చూపుల్ని టెంపో వైపు తిప్పాడు.

గంగాధర్ మాటలు టెంపోకి నవ్వు తెప్పించాయి. శశిప్రియకు ఆగ్రహం తెప్పించాయని ఆగిపోయిన ఆమె ఏడుపు చెప్తోంది.

“కమాన్! కదులు!” గంగాధర్ రివాల్వరు ఊగిస్తూ ఆర్డరిచ్చాడు.

టెంపో కొద్దిగా కదిలాడు. అతని కళ్ళు మెరిశాయి. ఆ మెరుపు గంగాధర్ చూశాడా? టెంపో చిరునవ్వుని పెదవులకి పూసుకున్నాడు.

“గంగాధర్, ఒక అపరాధం చేశావు. రెండో అపరాధం చేయొద్దు. రివాల్వరు దాచేయి. బ్లూ ఫిలిం కేసుతో కన్ను లొట్టపోయినా నీకు చావు తప్పుతుంది....”

“షటప్! కదులు. శ్యాపెట్‌ని మంచమ్మీదికి కదులు!” గంగాధర్ హుంకరించాడు. అతని చూపులు తన కదలికలమీదే వున్నాయని టెంపో సంతృప్తితో గమనించాడు. శశిప్రియ చూపులతో అతని దృష్టిని మళ్ళిస్తుందా?

విగ్రహంలా నుంచున్న గంగాధర్‌కి, తన వెనుక గాలి కదులుతున్నట్టు అనిపించింది. మెల్లిగా తల తిప్ప బోయాడతను.

రివాల్వరు బారెల్ గడ్డపారలా గంగాధర్ కుడిచేతి మీద వాలింది. అతని చేతిలోని రివాల్వరు కిందపడి చప్పుడు చేసింది. అప్రయత్నంగా అతను పెట్టిన చిన్న కేక ఆ చప్పుడులో కలిసిపోయింది. మెరుపులా అతను పక్కకి తిరిగాడు.

రివాల్వర్ గొట్టాని అతని పొట్టలోకి గూటంలా గుచ్చిన ఇన్‌స్పెక్టర్ పృథ్వీరావ్, గంగాధర్ ముఖంలోకి తీక్షణంగా చూశాడు.

"గంగాధర్, గప్‌చిప్‌గా నించో!"

ఆశ్చర్యంతో గంగాధర్ కళ్ళు యింకా ఎర్రగా అయ్యాయి.

పకపకా నవ్వుతూ డిటెక్టివ్ టెంపో ఇన్‌స్పెక్టర్ దగ్గరగా నడిచాడు. "థాంక్స్ పృథ్వీ! ఆలస్యంగా వచ్చినా, క్లైమాక్స్ సీన్‌కి అందుకున్నావ్!"

"మెట్లన్నీ ఎక్కేటక బూట్లు తీసేశాను: ఎందుకేనా మంచిదని! అందుకే కాస్త ఆలస్యం అయింది...." పృథ్వీరావ్ నవ్వుతూ వివరించాడు.

"ఉత్తి చేతుల్తో వచ్చావా?" టెంపో నవ్వుతూ అడిగాడు.

పృథ్వీరావ్ నవ్వుతూ ఎడంవైపు బెల్టుకి వేళ్ళాడుతున్న బేడీల్ని తీశాడు. రివాల్వరు దెబ్బతో వాచిపోతున్న గంగాధర్ చేతికి తగిలించాడు. వెర్రివాడిలా ఒకసారి బేడీల్ని చూసుకుని గంగాధర్ తల పైకెత్తాడు. నిప్పును కక్కుతూ టెంపోని చూశాడు. పళ్ళు కొరుక్కు

టెంపో నవ్వుతూ గంగాధర్ మొహంలోకి చూశాడు. అతని ఎడమ చెంప బూరెలా పొంగింది. ఆ పొంగులోంచి రక్తం కాలువలా కారుతోంది. ఉంగరం ధరించిన శశిప్రియ చెయ్యి గంగాధర్ చెంపని వజ్రంలా కోసినట్టుంది ...శశిప్రియ భర్త రక్తం కళ్ళ జూసింది....

"లెట్స్ గో!" పృథ్వీరావ్ హెచ్చరించాడు.

## 9

"టెంపో, అన్నవిధంగా రాత్రిలోగా అసలు వ్యక్తిని పట్టగలుగుతావని నేను అనుకోలేదు! పైగా నువ్వు అనుమానం వ్యక్తంచేసిన వ్యక్తుల్లో కాకుండా మరో వ్యక్తిని, ఎవ్వరూ అనుమానించలేని గంగాధర్‌ని ఎలా సందేహించావో, ఎందుకు సందేహించావో అర్థం కావడంలేదు!" ఇన్‌స్పెక్టర్ పృథ్వీరావ్ అన్నాడు.

"నేను కూడా గంగాధర్ని అనుమానించలేకపోయాను...." టెంపోకీ, పృథ్వీరావ్‌కీ యెదురుగా సోఫాలో కూచున్న శశిప్రియ మెల్లిగా అంది.

టెంపో సిగరెట్ ముట్టించి ఆమెని నవ్వుతూ చూశాడు. "గంగాధర్ ప్రేమ గురించనీ చిత్రీకరణ చివరిదాకా నన్ను తప్పుదారిలోనే నడిపించింది. నువ్వతన్ని అనుమానించలేకపోవడానికి కారణం నీ ప్రేమ. నేను వెంటనే అనుమానించలేకపోవడానికీ కారణం నీ ప్రేమే! ప్రేమ గుడ్డిది!"

"నిజమే గాడిదను గుర్రమనుకుని గుడ్డిగా ప్రేమించాను...." శశిప్రియ కంఠంలో పశ్చాత్తాపం పలికింది.

"ఎవరైనా, ఎవరి బ్లూఫిలిమైనా తయారుచేస్తే దానికి కారణం ఒక్కటే: స్వలాభం. నీ క్యాసెట్లు ఒకటికన్నా యెక్కువ లేవు కాబట్టి అమ్మి డబ్బు

సంపాయించే ఉద్దేశం 'అసలువ్యక్తి'కి లేదని తేలి పోయింది. అమ్మి డబ్బు చేసుకోనప్పుడు ఇక మిగిలింది ఒక్కటే. బ్లాక్ మెయిల్. బ్లాక్ మెయిలర్ కూడా లేడు! అయితే యే ఉద్దేశాన్ని ఆశించి, బ్లూ ఫిలిం తయారు చేయబడింది? మరో ఉద్దేశం లేకుండా యెవరేనా తమ ప్రణయాన్ని ఒక క్యాసెట్‌గా తీసుకుంటే దానికి కారణం ఒక్కటే. ఏకాంతంలో తమ శృంగార లీలల్ని చూసి ఆనందించే చిత్రమైన కోరిక! ఇక్కడ అదీలేదు. పార్టీస్‌లో ఒక్కచోటే అది ప్రదర్శించబడింది!" టెంపో ఆగి పృథ్వీరావ్ వైపు నవ్వుతూ చూశాడు.

"చక్కటి విశ్లేషణ! సాగించు!" ఇన్‌స్పెక్టర్ పృథ్వీరావ్ అన్నాడు శశిప్రియా ఆమె దగ్గరగా, సోఫా వెనక నిలబడ్డ శేఖర్ ఏకాగ్రతతో వింటున్నారు.

"రెండోసారి శేఖర్ని కల్సుకున్నప్పుడు నాకు తెలిసిన కొన్ని విషయాలు నా ఆలోచనల్ని మరో దారికి మళ్ళించాయి. భార్య బూతు చిత్రం చూసి షాక్ తిన్న గంగాధర్ విచారంలో మునిగిపోకుండా ఆమె ఇంట్లోనే ఇతర స్త్రీలతో తన కామాగ్నిని నిర్భయంగా, నిస్సంకోచంగా చల్లార్చుకుంటున్నాడు. కోలాలాంటి వాళ్ళు మ్మకుని జీవించే ఆడాళ్ళతో శారీరక సంబంధం వుంచుకున్న గంగాధర్ బ్లూ ఫిలింలో కనిపించిన భార్యతో శారీరక సంబంధాన్ని యెందుకు తెంచేసుకున్నాడు? బ్లూ ఫిలిం భార్య, ఆ ఆడవాళ్ళకంటే అధికంగా చెడి పోయిందేమిటి?"

"తరవాత, ఆర్ట్‌ఫిల్మ్‌తో మూతికాలి అజ్ఞాతవాసం లోకి వెళ్ళిపోయి భార్య డైరీ చూసే గంగాధర్ సొంతంగా సినిమాతీయాలని సంకల్పించడం నాకు అస

హాయంగా అనిపించింది. శశిప్రియ ఉక్కిరిబిక్కిరయ్యేలా కాల్ షీట్స్ అరేంజ్ చేయడంలో వీలయినంత త్వరలో, వీలయినంత అత్యధికధనం పోగేసుకోడం తప్ప మరో ఉద్దేశం నాకు కనబడలేదు! తనని దర్శకుడిగా నియమించని నిర్మాతలందరిమీదా, ముఖ్యంగా తను నటిస్తున్న చిత్రాల్లో డైరెక్షన్ ఇప్పించని శశిప్రియమీదా అతనిలో కసి పెరిగిందని నా అనుమానం...." టెంపో ఆగి శశిప్రియవైపు నవ్వుతూ చూశాడు.

"నిజమే కావచ్చు! నా చిత్రాల్లో డైరెక్షన్ ఛాన్స్ ఇప్పించమని నన్ను చాలాసార్లు అడిగాడు. చివరికి నేను యాక్టు చేయడానికి దాన్నొక కండిషన్‌గా వుంచమన్నాడు కూడా! నేను అంగీకరించలేదు. భర్త వేరు. డైరెక్టర్ వేరు అనుకున్నాను. అతను పగబట్టాడని పసిగట్టలేకపోయాను!" శశిప్రియ అంది.

"ఆ కసిని సొంత చిత్రంతీసి, తీర్చుకోవాలన్న కోరికా, శశిప్రియను గిల్టీ కాన్షస్‌లో, డిఫెన్సివ్‌లో పడేసి ఆమె సంపాదనని సొంతం చేసుకుని పైకి చేరుకోవాలన్న ఆశా అతన్ని తెలివైన బ్లాక్ మెయిలర్‌గా చేశాయి! ఇన్ని దురాలోచనలున్న వ్యక్తి శశిప్రియాని అంతగా ఎలా ప్రేమించాడన్న సందేహం నన్ను పీడించింది. ప్రత్యగాత్మారామ్ ఇంట్లో నేను కలుసుకున్న ప్రొడ్యూసర్లూ, హీరో ఇంద్రమోహన్ నాకు గంగాధర్ నిజస్వరూపాన్ని వివరించారు. 'అయ్యోపాపం' అన్న వాళ్ళచేత అందలం మోయించి, గమ్యం చేరుకునే అలవాటు గంగాధర్‌కి పుట్టుకతో వచ్చింది. పైగా ముఖ్యంగా పూర్వాశ్రమంలో అతనికి పెళ్ళయింది!" టెంపో ఆగి శశిప్రియవైపు చూశాడు.

శశిప్రియ తటాలున తల పైకెత్తి అతని మొహంలోకి చూసింది. ఆమె కళ్ళ చివర్లలోంచి జారుతున్న ఆనంద బాష్పాల్ని డిటెక్టివ్ టెంపో, ఇన్‌స్పెక్టర్ పృథ్వీరావ్ చిరునవ్వుతో చూశారు.

"వెరీగుడ్, శేఖర్! అలా అయితే వెనకనుంచోడం దేనికి? సోఫాలో శశిపక్కనే కూచో. పృథ్వీరావూ, నేనూ ఆశీర్వదిస్తాం!" డిటెక్టివ్ టెంపో నవ్వుతూ అన్నాడు.

అప్రయత్నంగా శేఖర్ కదిలాడు. శశిప్రియ తల వాల్చి కదిలిపోతూ టెంపోని చూసింది. మరుక్షణం ఆపుకోలేక హాయిగా నవ్వేసింది. ఆమె మొహం మేఘాల నీలనీడలు తొలగిన చందమామలా వుంది.

"చూశావా, నాలా హాయిగా నవ్వుతున్నావ్!" టెంపో నవ్వుతూ అన్నాడు.

—: అయిపోయింది :—

# స్నేహం

వసుంధర

అందమైన పార్కు.

అందమైన పూల మొక్కలు.

అందమైన జంటలు.

ఆ జంటల్లో ఒక జంటగా వున్నారు శారద, మధు.

అయితే ఆ జంట మాటల్లో అందమైన ప్రేమ కబుర్లు లేవు.

"నీకుద్యోగ మెప్పుడొస్తుంది మధూ!" అంది శారద.

"ఇన్సాట్ వన్ బీ ఆకాశంలో తిరగడం మొదలెట్టేక వానెప్పుడొచ్చేదీ కచ్చితంగా తెలిసిపోతోంది. కానీ ఉద్యోగం గురించి చెప్పే ఉపగ్రహాలింకా మన దేశంలో లేవు—" అన్నాడు మధు.

"ఉద్యోగం గురించి ఉపగ్రహాలమీద ఆధారపడితే ఎలా? మనమే ఏ గ్రహాన్నో చూసుకుని ఉపగ్రహాలం కావాలి—" అంది శారద.

"అది నాకు చేతకాదు శారదా!" అన్నాడు మధు,

"చేతకాదంటే ఎలా?" అంది శారద.

"నా ఉద్యోగం గురించి నాకు లేని తొందర నీకెందుకు?"

"అది చెబుతాను. ముందు నీకెందుకు తొందరలేదో చెప్పు...."

"మా నాన్న బాగా సంపాదించాడు. సంపాదిస్తున్నాడు. ఆయన నీడలో నా బ్రతుకు హాయిగా వెళ్ళిపోతుంది—...."

"అంతేనా—మరి నీకంటూ ఓ వ్యక్తిత్వం లేదా?"

"నాకు వ్యక్తిత్వమిచ్చింది నాన్న ఆయనమీద ఆధారపడ్డంలో నా వ్యక్తిత్వం చిన్నబోదు—"

"అయితే ఎల్లకాలమూ నువ్వు మీ నాన్నమీదనే ఆధారపడి బ్రతుకుతావా?"

"అలాగని నేననలేదే! వ్యాపారం నా మనస్తత్వానికి సరిపడదు. న్యాయమైన మార్గంలో ఉద్యోగం వెతుక్కుంటున్నాను. ఏదో ఒకరోజున నాకుద్యోగం దొరుకుతుంది—"

"దొరక్కపోతే?"

"దొరక్కపోతే డబ్బిచ్చే నాన్నున్నాడు. కాలక్షేపానికి నువ్వూ నీలాంటి స్నేహితులూ చాలామందున్నారు నాకు—" అన్నాడు మధు.

శారద నవ్వి—"ఎల్లకాలం నీతో స్నేహం కొనసాగించడం నాకెలా సాధ్యపడుతుంది? నేనాడపిల్లను-" అంది.

"ఏం—ఆడపిల్లవైతే మాత్రం—మనిషివి కావా?"

శారద నిట్టూర్చి—"నీ ప్రశ్నలోనే సమాధానముంది" అంది.

కింకేమైనా పేరుందా?"

"ఏమిటి నువ్వనేది?"

"మధూ! నీకర్థమయ్యేలా సూటిగా అడుగుతున్నాను. నువ్వు నన్ను పెళ్ళిచేసుకుంటావా?"

మధు తెల్లబోయి ఆమెకేసి చూశాడు.

"ఇదే నేను నీకు చెప్పాలనుకున్న ఉపాయం. నువ్వు నన్ను పెళ్ళి చేసుకుంటే ఎల్లకాలం మన స్నేహం కొనసాగుతుంది—" అంది శారద.

మధు మాట్లాడకుండా ఆమె వంకే చూస్తూన్నాడు.

"మధూ! మాట్లాడవేం? ఈ పెళ్ళి నీ కిష్టంలేదా?" అంది శారద.

మధు మాట్లాడలేదు.

"నేనంటే నీకు ప్రేమలేదా?" అంది శారద మళ్ళీ.

"శారదా! నువ్వంటే నా కిష్టం. నువ్వంటే నాకు ప్రేమ. కానీ...." అని మధ్యలో ఆగాడు మధు.

"ఇన్ని చెప్పి కానీ ఏమిటి?" అంది శారద నిరుత్సాహంగా.

"ఏ ఆడపిల్లా నన్ను పెళ్ళి చేసుకుంటాననదని నాన్న అన్నాడు. నువ్వు నన్ను పెళ్ళి చేసుకుంటానంటే నా కాశ్చర్యంగా ఉంది—" అన్నాడు మధు.

"మీ నాన్నకు నువ్వంటే ఎంతో యిష్టం కదా— ఎందుకలా గన్నాడు?"

"మా నాన్న కిద్దరు ఆడపిల్లలు, ముగ్గురు మగపిల్లలు. అందరిలోకీ నేనే ఆఖరివాణ్ని. నాన్న చిన్న గుమాస్తాగా తన జీవితం ప్రారంభించి ఈ నాడీ దశకు చేరుకున్నాడు. అన్నయ్య లిద్దరూ మంచి ఉద్యోగాల్లో వున్నారు. అక్కయ్య లిద్దరూ సుఖంగా కాపురం చేస్తు

మధు కళ్ళు మెరిశాయి—"నువ్వు నన్ను ప్రేమిస్తోంటే—అది నా అదృష్టమనుకుంటాను—"

"కానీ మధూ! ప్రేమించిన మనిషి తండ్రిచాటు బిడ్డగా మిగిలిపోకూడదు. అందువల్ల ఎన్నో యిబ్బందులుంటాయి, భర్త స్వతంత్రుడిగా ఉండాలని ఏ భార్య అయినా అనుకుంటుంది. అందుకే నువ్వు నీ కాళ్ళమీద నిలబడగలగాలి—" అంది శారద.

"ఇప్పుడు మాత్రం నాకేం లోటు? నేను స్వతంత్రుడినే—" అన్నాడు మధు.

"నీ యింట్లో నీకు స్వతంత్ర ముంటుంది నాకుండదు. నాకేం కావాల్సినా నేను నీమీద ఆధారపడతాను. నువ్వు నీ తలిదండ్రులమీద ఆధారపడతావు. నీ కోసం వాళ్ళమీద ఆధారపడితే వాళ్ళ కిష్టమే! కానీ నా కోసం వాళ్ళమీద ఆధారపడితే—వాళ్ళు నిన్నూ, నన్నూ చిన్న చూపు చూస్తారు. నీ దగ్గరేమీ అనకపోయినా నా దగ్గర నీ గురించి అవమానించే మాట అంటారు. నీ కవమానం జరిగితే నేను భరించలేను. ఎదిరిస్తాను. గొడవవుతుంది. కలతలు రేగుతాయి. అదే నీవు స్వతంత్రుడవయితే నీకూ నాకూ గౌరవం..."

"అందుకు నేనేం చేయాలి?"

"అర్జంటుగా వుద్యోగం సంపాదించు—"

"నాకేదైనా చిన్న వుద్యోగం దొరికితే—అది నిన్ను సుఖపెట్టగలదా?"

"నీవు గనుక స్వతంత్రంగా బ్రతికితే....నీ దగ్గర గంజి తిన్నా నాకు పరమాన్నమవుతుంది. పూరిగుడిసె రాజభవన మవుతుంది—"

మధు సాలోచనగా—"ఇలా గంటున్నానని

జరిగిందేమిటో పట్టించుకోకుండా అంతా ముందుకు పోతున్నారు.

కాసేపటికి శారద ఒంటరిగా రోడ్డెక్కింది. ఆమె కప్పుడు వెనుకనించి—"మేడమ్—" అన్న పలుపు విన పడింది.

వెనక్కి తిరిగితే—మధు!

ఆమె అతడివంక కోపంగా చూసింది.

"అలా చూడకండి—" అన్నాడు మధు.

శారద చిరాగ్గా—"మళ్ళీ నా వెంటపడ్డావేం?" అంది.

"మీరు నన్ను రాస్కెల్ అని తిట్టారు. నా వంక కోపంగా చూశారు. అందుక్కారణం చెప్పండి—" అన్నాడు మధు.

"నువ్వేం చేశావో నీకు తెలియదూ? మళ్ళీ నేను చెప్పాలా?" అంది శారద.

"నేనేం చేశానో నాకు తెలియదు—" అన్నాడు మధు.

"ఏయ్ మిస్టర్—వెంటనే వెళ్ళు. లేకుంటే కాలి చెప్పు తీయాలి—" అంది శారద కోపంగా.

"కాలి చెప్పు తీయండి. రాస్కెల్ అనండి. నాకు బాధ లేదు. అందుక్కారణం చెప్పండి. లేక పోతే—...."

అతడి కళ్ళలో మళ్ళీ నీళ్ళు తిరిగాయి. మాట ఆగి పోయింది.

శారద తెల్లబోయి—"ఏడుస్తున్నావా?" అంది.

"స్త్రీ నెవరి జోలికీ వెళ్ళను. ముఖ్యంగా ఆడపిల్లల్ని నేనెంతో గౌరవిస్తాను. నా కిద్దరు అక్కలున్నాను.

ఆడపిల్లల్ని గౌరవపరిస్తే — నాకు అక్కలు లేనట్లే లెక్క!" అన్నాడు మధు బాధగా.

"అగౌరవపర్చకపోతే మళ్ళీ నా వెంట పడడ మెందుకు? యేమీ చేయలేదనుకొని వెళ్ళిపో" అంది శారద.

"నేను తప్పు చేశానని మీ రనుకుంటున్నారు. అదే నా కెంతో బాధ కలిగిస్తుంది. ఎవరో చేసిన తప్పుకి నా చేయి పట్టుకుని రాస్కెల్ అన్నారు. అందుకు మీరు క్షమార్పణ చెప్పుకోనక్కర్లేదు. నా విషయంలో మీ రనుకున్నది తప్పని గ్రహించానంటే చాలు. నేనలాంటి వాణ్ని కాదు —"

శారద చిరాగ్గా—"సరే—ఎవరో యేదో చేస్తే నువ్వనుకొని పొరబడ్డాను. ఒంటరిగా సినిమా కొచ్చినందుకు తగిన శాస్తి అయింది. నువ్వింక వెళ్ళు—" అంది.

"పొరపాటని ఒప్పుకున్నారుగా — అయితే మీకు చాలా చాలా థాంక్స్...."

"థాంక్సెందుకు?" అంది శారద.

"మీ రక్కడ రష్‌లో వెంటనే చేయి వదిలిపెట్టకపోతే—నలుగురూ నన్ను చావదన్నేవారు. నన్ను ఆపద నుంచి కాపాడారు. కాబట్టి థాంక్స్...." అని— "రాస్కెల్ అని తిట్టినవారు—వెంటనే నన్నెందుకు వదిలేశారు?" అన్నాడు మధు.

శారద అప్పుడతడికేమీ చెప్పలేదు. కానీ వారొకరి గురించొకరు తెలుసుకుని స్నేహితులయ్యారు.

ఆ స్నేహం రెండు సంవత్సరాలుగా నడుస్తోంది.

"నేను రాస్కెల్ అన్నప్పుడు నీ కళ్ళలో నీళ్ళు....

నీ అమాయకమైన ముఖభావాలు— ....చూస్తూంటే నిన్నెందుకు తిట్టానా అనిపించింది. చెప్పాలంటే నువ్వు తప్పు చేసినా నిన్నప్పుడు ప్రేమించేదాన్ని. ఇంకా చెప్పాలంటే ఆ క్షణం నుంచే నేను నిన్ను ప్రేమించడం మొదలెట్టాను. ఎందుకూ అనడక్కు— ...." అంది శారద.

"కానీ—నువ్వింకా నా ప్రశ్నకు సమాధాన మివ్వలేదు—" అన్నాడు మధు.

"నీ ప్రశ్నకు సమాధాన మివ్వగలను. కానీ నువ్వు చిన్నబుచ్చుకుంటావేమోనని నా భయం— ...." అంది శారద.

"నీ ఉద్దేశ్యం నన్ను చిన్నబుచ్చడం కాక—సమాధానమివ్వడమే అయితే— నేను చిన్నబుచ్చుకోను—" అన్నాడు మధు.

"అతడి పేరు ప్రదీప్. కాలేజీ కెమిస్ట్రీ లెక్చరర్. అయిదడుగుల ఎనిమిదంగుళాలు ఎత్తు. పచ్చని తబ్బపండు లాంటి చాయ. సంప్రదాయమైన కుటుంబం. తలిదండ్రుల కొక్కడే కొడుకు. తలిదండ్రు లిద్దరూ పోయారు. ఈ వయసులోనే అతడు విద్యార్థులకు ప్రాక్టికల్ గైడ్సు రాస్తున్నాడు. వాటిమీద అదనపు టాదాయం బాగా వస్తోంది—"

"ఇవన్నీ యెందుకు చెబుతున్నావ్?" అన్నాడు మధు ఆమెను మాధ్యలో ఆపి.

"అతడు నన్ను ప్రేమిస్తున్నాడు. కట్నం లేకుండా నన్ను పెళ్ళి చేసుకుంటానంటున్నాడు. నా తలిదండ్రుల కతడు నచ్చాడు."

"అయితే?"

"మధూ! నేను నిన్ను ప్రేమిస్తున్నాను. అందుకే

షంగా వుంది. మనిద్దరివీ ఒకే రకం అభిరుచులు—"
అన్నాడు మధు

"ఎలా తెలుసు మీకు?" అన్నాడు ప్రదీప్.

"మనిద్దరం ఒకే అమ్మాయిని ప్రేమించాం కాబట్టి!"

"ఎవరా అమ్మాయి?" అన్నాడు ప్రదీప్.

"శారద!"

ప్రదీప్ ఉలిక్కిపడి—"మీరు శారదను ప్రేమిస్తున్నారా?" అన్నాడు.

"ఊఁ!"

"నేను శారదను ప్రేమిస్తున్నానని మీ కెవరు చెప్పారు?"

"శారద!"

ప్రదీప్ మరింత ఉలిక్కిపడి—"శారద, మీరు కలుసుకని మాట్లాడుకుంటూంటారా?" అన్నాడు.

"ఊఁ!"

"అంటే శారద మిమ్మల్ని ప్రేమిస్తోందన్న మాట—...." అన్నాడు ప్రదీప్ నిట్టూర్చి. అతడి ముఖం అదోలాగైపోయింది.

"అవును—...."

"అయితే మీ రదృష్టవంతులు శారద నన్ను ప్రేమించడం లేదు—...."

"ఎలా తెలుసు మీకు?"

"ఆమె నన్ను చూసి నవ్వదు. నాతో ముభావంగా వుంటుంది. నేను పది మాట్లాడితే తనొకటి బదులిస్తుంది" అన్నాడు ప్రదీప్.

"మీ రబద్ధం చెబుతున్నారు—" అన్నాడు మధు.

"ఎందుకని?"

"ఆమె ముభావంగా వుంటే మీ యిద్దరికీ పరిచయ మెలాగయింది?" అన్నాడు మధు.

"పరిచయం మా యిద్దరిదీ కాదు. బజార్లో అరటి పండు తొక్కమీద కాలేసి జారిపడ్డాడు శారద తండ్రి. ఆయనను చేయూతనిచ్చి యింటిదాకా తీసుకెళ్ళాను. వాళ్ళు నా వివరా లడిగారు. వాళ్ళకూ మాకూ యేదో దూరపు బంధుత్వముంది. వాళ్ళే నాకు శారద గురించి చెప్పి అభిప్రాయ మడిగారు. శారద నాకు నచ్చింది. నేను పెళ్ళికి సిద్ధంగా వున్నాను. కానీ ఎందుకో శారదే వాయిదా వేస్తోంది. తల్లిదండ్రు లామెనొప్పించడానికి ప్రయత్నిస్తున్నారు. శారదకు నేనంటే యిష్టంలేదని నా అనుమానం—...."

"మీ అనుమానం తప్పు—శారదకు మీరంటే యిష్టమే!"

"ఎలా తెలుసు మీకు?..." ప్రదీప్ కళ్ళు మెరిశాయి.

"ఆమె నాకు మీ గురించి చెప్పింది—"

"మీతో యిన్ని చెప్పి—నాతో ఒక్క మాట కూడా మాట్లాడదేం? ఆమెకు నేనంటే యిష్టం లేదు—"

మధు నవ్వి—"మీరు సావధానంగా వినాలి. శారద నన్ను ప్రేమిస్తున్నా ననుకుంటోంది. అందుకే మీకు దూరంగా వుంటోంది. కానీ నిజానికామె నన్ను ప్రేమించడంలేదని నాకు తెలుసు—" అన్నాడు.

"ఎలా?"

"ఆమెకు భర్త స్వతంత్రుడిగా ఉండాలి. మంచి సంపాదనాపరుడు కావాలి. తనకోసమే జీవించాలి. ఆమె

మనసులోని కోరికలన్నీ నాకు తెలుసు. ఒక్కటీ నా మనస్తత్వానికి సరిపడదు. నిజం చెప్పాలంటే నాకు పెళ్ళి చేసుకోవాలని లేదు. నా మనస్తత్వంలో ఈ సమాజంలో జీవించడ మెలాగా అని ఆలోచిస్తున్నాను—....”

“మీ మనస్తత్వానికేమొచ్చింది?”

మధుమూర్తి అతడికి తన గురించి చెప్పాడు.

“చిత్రంగా వుంది—” అన్నాడు ప్రదీప్.

“నిజం చెబుతున్నాను. నాకసలు పెళ్ళి చేసుకోవాలని లేదు. నేను పెళ్ళంటూ చేసుకుంటే—అందుకు శారద మాటను కాదనలేక పోవడమే కారణమవుతుంది. కానీ వివాహంవల్ల ఆమె సుఖపడదు. నేనూ సుఖపడను—....”

“అయితే యేమంటారు?”

“మీరు వీలైనంత తొందరగా శారదను వివాహం చేసుకోండి. ఆమె గురించి నాకు తెలిసినవన్నీ మీకు చెబుతాను. నేను కూడా ఆమెకు మీ గురించి మంచిగా చెబుతాను—” అన్నాడు మధు.

ప్రదీప్ ముఖంలో ఆశ్చర్యం కనబడింది. అంతలోనే అహం అతడి నావహించగా—“ఆమె నన్ను నన్నుగా ప్రేమించాలి. ఒకరి సిఫారసుతో నన్ను ప్రేమించే వ్యక్తి నాకవసరంలేదు—” అన్నాడు.

“శారదను మీరు నిజంగా ప్రేమిస్తూంటే యీ మాటనరు....” అన్నాడు మధు.

“అసలీ విషయంలో మీ కెందు కాసక్తి?” అన్నాడు ప్రదీప్.

“నేను శారదను ప్రేమిస్తున్నాను కాబట్టి—”

"మీరు ప్రేమిస్తున్న వ్యక్తిని, మిమ్మల్ని ప్రేమిస్తున్న వ్యక్తిని నేనెలా పెళ్ళి చేసుకుంటాననుకున్నారు?" అన్నాడు ప్రదీప్.

"నా గురించి మీకు సరిగ్గా తెలియదు. శారద నన్ను ప్రేమిస్తున్నందుకు నేనామెపై జాలిపడుతున్నాను తప్ప నాకామెపై వాంఛ లేదు. ఆమె జీవితంలో సుఖపడాలన్నదే నా కోరిక. మీరే ఆమెకు తగిన వరుడు—...." అన్నాడు మధు.

"మీరు చాలా మంచివారేనా అయుండాలి. లేదా మహా మోసగాడైనా అయుండాలి—" అన్నాడు ప్రదీప్.

"నేనెవరో తొందరలోనే మీరు తెలుసుకుంటారు. నేను కోరేది మీ స్నేహం. అందుకు మీ అంగీకారమయితే—మరోసారి కలుసుకున్నప్పుడు మనమొకరినొకరు నువ్వని పిల్చుకుందాం—" అన్నాడు మధు

## 3

"మధూ! నువ్వే నన్ను రక్షించాలి....—" అంది శారద.

"ఏమయింది?"

"ప్రదీప్ నాకు చాలా బోర్ కొడుతున్నాడు...."

"అతడు నిన్ను ప్రేమిస్తున్నాడు...."

"అయితే—...."

"అతణ్ని పెళ్ళి చేసుకో—"

"ఏమంటున్నావో తెలుసా నీకు?" అంది శారద.

"ప్రదీప్ స్వతంత్రుడు. సంపాదనాపరుడు—...."

శారద చటుక్కున—"మధూ! నీ మనసుకు కష్టం కలిగించానా?" అంది.

"ఏం?" అన్నాడు మధు ఆశ్చర్యంగా.

"ప్రదీప్‌లో ఉన్న లక్షణాలను నేను నీలో కోరాను. అది భవిష్యత్తులో నా సుఖాన్నాశించి. నా మాటలు నీకు కష్టాన్ని కలిగించి ఉండొచ్చు. ఇప్పుడు నిజం చెబుతున్నాను. నేను నిన్ను నిన్నుగా ప్రేమిస్తున్నాను. నీవు తల్లిదండ్రుల చాటు బిడ్డగానే ఉన్నా నాకభ్యంతరం లేదు. నాకు నువ్వే కావాలి. నా సుఖసంతోషాలు నీతోనే ఉన్నాయి—..." అంది శారద.

మధు తెల్లబోయి—"నువ్వు బాగా ఆలోచించుకో శారదా! ప్రదీప్ నాకు మంచి స్నేహితుడు. మేమిద్దరం ఒకరినొకరు బాగా అర్థం చేసుకున్నాం. నువ్వంటే నువ్వనుకుంటున్నాం. నా అభిప్రాయంలో అతడే నీకు తగిన వరుడు—" అన్నాడు.

"నువ్వు చాలా మంచివాడివి మధూ! అందుకే ప్రదీప్‌లో మంచితనాన్ని చూస్తున్నావు. ప్రదీప్‌కు నీవంటే అసూయ. అస్తమానూ నీ గురించి చెడ్డగా చెబుతాడు...."

"ప్రదీప్‌కు నేనేం చేశాను? అతడికి నేనంటే ఎందుకసూయ? అసూయతో అతడు నష్టం చేయగలడు?" అని నవ్వాడు మధు—"శారదా! అతడి అసూయ—నీపై ప్రేమకు కొలబద్ద. అతడు నాపై యెంతగా అసూయపడితే అంతగా నిన్ను ప్రేమిస్తున్నట్లు. నేనతడిపై అసూయ పడ్డంలేదంటే నాకు నీమీద ప్రేమలేదన్న మాట!"

శారద నవ్వింది—"మధూ! ఏడాది పసిబిడ్డను తల్లి యెందుకు ప్రేమిస్తుంది! ఆమెకందులో ఆనందముంటుంది! బిడ్డ తను తిరిగి ప్రేమిస్తాడనీ—తనకేదో యిస్తాడనీ

ఆమె ఆశించదు. ఆమె బిడ్డను ముద్దులాడి ఆనందిస్తుంది. వాడి సంతోషంలో తన సంతోషముందనుకుంటుంది—"

"అయితే?"

"నా ప్రేమ అలాంటిది మధూ! నాకు నా ప్రేమను పంచిపెట్టడంలో ఆనందముంది. నేను నీనుంచి ప్రేమను కోరడంలేదు. ఒక తల్లి పసిబిడ్డను ప్రేమించినట్లుగా నేను నిన్ను ప్రేమిస్తున్నాను—" అంది శారద.

మధుమూర్తి ఆమె వంక తెల్లబోయి చూశాడు.

"నిజం మధూ! నాకు నువ్వు కావాలి. ఇక ఉద్యోగం గురించి కూడా నిన్ను వేధించను. నా యింట్లో నా మాటకు విలువుంది. నువ్వు ఊఁ అంటే మా యింట్లో చెబుతాను—" అంది శారద.

మధుకు నోటమాట రాలేదు.

"చెప్పు మధూ! నామాట కాదనవు కదూ!" అంది శారద.

"సారీ శారదా! నేనాలోచించుకోవాలి........" అన్నాడు మధు.

"ఆలోచించుకో—కానీ యెంతో వ్యవధి అడక్కు-" అంది శారద.

"అడగను..." అన్నాడు మధు.

## 4

మధుకు శారదంటే యిష్టమే! ఆ యిష్టమే అతడినామెను పెళ్ళిచేసుకోకుండా ఆపుతోంది.

ప్రదీప్ శారదను ప్రేమిస్తున్నాడు. ఆమెను తన దాన్ని చేసుకునేందుకు చేయగలిగిన ప్రయత్నాలన్నీ చేస్తున్నాడు.

శారద తల్లిదండ్రులకు మధు నచ్చలేదు. కానీ వారు

కూతురి అభీష్టాన్ని కాదనలేరు.

"కొంతకాలంపాటు ఊరొదిలిపెట్టి యెక్కడికైనా వెళ్ళిపో. నేను నిన్ను పెళ్ళిచేసుకోనని శారదకు ఉత్తరం రాసివ్వు—" అన్నాడు ప్రదీప్.

"బ్రతికుండగా నాకు నేనై ఆమెకు దూరంకాలేను" అన్నాడు మధుమూర్తి.

"పోనీ—మరో పని చేయి. శారద నన్ను వివాహం చేసుకోనంటే ఆత్మహత్య చేసుకుంటానని బెదిరిస్తూ ఉత్తరం రాయి—" అన్నాడు ప్రదీప్.

ఈ సూచన మధుమూర్తికి నచ్చింది. వెంటనే అతడిది పాటించాడు. కానీ ఆ ఉపాయం ఫలించలేదు.

శారద అతణ్ని కలుసుకుని—"నువ్వాత్మహత్య చేసుకుంటే నాకేం?" అనడిగింది.

"నువ్వు నన్ను ప్రేమిస్తున్నావు కాబట్టి బాధ పడతావు—...."

"బాధపడను. నిన్న సహ్యించుకుంటాను. నీ ఆత్మకు శాంతిలేకుండా చేస్తాను—" అంది శారద.

"నేనేం తప్పుచేశాను?"

"ఎవరైనాసరే—బ్రతికి సాధించాలి తప్ప చచ్చి సాధించేదేమీ ఉండదు. నువ్వు చావడంవల్ల నీ జీవితమంతమవుతుంది తప్ప నా జీవితం శాసించబడదు...."

"నీ జీవితాన్ని శాసించడానికి నేనేం. చేయాలి?"

"బ్రతుకుమీద ఆశ పెంచుకో — నన్ను పెళ్ళి చేసుకో—" అంది శారద.

మధుమూర్తి మాట్లాడలేదు.

"నీ మంచితనానికి ప్రభావితురాలినై నిన్ను ప్రేమించాను. నా ప్రేమ నిన్ను గొప్పవాణ్ని చేస్తుంది. మన

జీవితం స్వర్గతుల్యమవుతుంది—" అంది శారద.

ఏమనుకున్నాడో మధుమూర్తి వెంటనే—"శారదా! నువ్వింకేమీ మాట్లాడొద్దు. నేను నిన్ను పెళ్ళి చేసుకుంటాను. నీకోసం నన్నే మార్చుకుంటాను. నీ కనుగుణంగా నా మనసును తీర్చిదిద్దుకుంటాను—" అన్నాడు.

"థాంక్స్ మధూ! నీనుంచీ మాట వినాలనే ఎన్నాళ్ళనించీ యెదురుచూస్తున్నాను. రేపే మా నాన్నగారు మీ యింటికి వస్తారు—" అంది శారద.

"రేపుకాదు. వాళ్ళిద్దరూ ఊళ్ళోలేరు. నాలుగు రోజుల తర్వాత వస్తారు—" అన్నాడు మధుమూర్తి.

ఆ తర్వాత ఆ జంట విడిపోయింది. మధుమూర్తి ప్రదీప్‌ను కలుసుకుని తన నిర్ణయం చెప్పాడు.

"నీ నిర్ణయం నన్ను బాధపెడుతోంది-" అన్నాడు ప్రదీప్.

"ప్రదీప్—బాగా ఆలోచించి చూడు. నా నిర్ణయమెంత సబబైనదో నీకే అర్థమవుతుంది—" అన్నాడు మధు.

"నాకేం అర్థంకావడంలేదు—"

"శారద నన్నే ప్రేమిస్తోంది. నిన్ను ప్రేమించడంలేదు. అందువల్ల పెళ్ళయినా నీకు సుఖం, మనశ్శాంతి వుండవు. మనమిద్దరమూ మంచి స్నేహితులమయ్యాం. ఆ స్నేహం కలకాలం నిలబడాలన్నా శారదను నేను పెళ్ళిచేసుకోవడమే మంచిది—"

ప్రదీప్ నవ్వి—"హిందూ స్త్రీ పెళ్ళయ్యాక పాతప్రేమలు మరిచిపోతుంది. భర్తే దైవమనుకుంటుంది. శారద సంప్రదాయాన్ని మన్నించే యువతి. ప్రస్తుతానికి కామె నిన్నే ప్రేమిస్తున్నా అదంతా ఆమె

భ్రమ. ఒకసారి పెళ్ళయ్యాక—ఆమె తన అదృష్టాన్ని నిందిస్తుంది. పొరపాటు చేయలేదని గ్రహిస్తుంది. నన్ను బాధిస్తుంది—" అన్నాడు.

"నువ్వు చెప్పేది నిజమే కావచ్చు. కానీ ఆమె నిన్ను పెళ్ళాడేందుకొప్పుకునే మార్గాలు కనబడ్డంలేదు. అదీకాక అన్నివిధాల నువ్వు నాకంటే ఉన్నతుడివి. నీలో ప్రేమించబడే లక్షణాలెక్కువున్నాయి. శారద నిన్ను కాదని నన్ను ప్రేమించడం నా అదృష్టం. ఇలాంటదృష్టం అరుదుగా వస్తుంది నాకు. అందుకే కాదనాలనిపించడంలేదు. నువ్వు నాకు మంచి స్నేహితుడివి. నా పరిష్కారమే ఈ సమస్యకు మంచిది. కాదనకు—" అన్నాడు మధుమూర్తి.

ప్రదీప్ కాదనాలనుకున్నాడు. తన వాదనలో తర్కం లోపించిందని గ్రహించడానికెంతో సేపు పట్టలేదు.

ప్రదీప్ మధుమూర్తితో కలహించాలనుకున్నాడు. చూపుల్లో, మాటల్లో నిజమైన స్నేహం ధ్వనించే మధుమూర్తి నతరేమీ అనలేకపోయాడు.

"నేను శారదను పెళ్ళిచేసుకోవాలనుకోలేదు. ఆమె స్నేహాన్ని వదులుకోలేక—ఆమెకో మంచి వరుణ్ని నిర్ణయించాలనుకున్నాను. అందుకే నీ దగ్గరకు వచ్చాను. నిజానికి నువ్వన్నివిధాలా నన్ను మించినవాడివి. అయితే శారదకు నేను రాసిపెట్టి ఉన్నాను. నీ యోగ్యతలకు నీకెలాగూ మంచి వధువు దొరుకుతుంది. నువ్వీ విషయంలో నాకెంతో సహకరించావు చాలా థాంక్స్. మన స్నేహమెప్పటికీ ఇలాగే కొనసాగాలి...." అన్నాడు మధుమూర్తి.

ప్రదీప్ మాట్లాడలేదు.

స్నేహితులిద్దరూ విడిపోయారు.

# 5

మర్నాడు ప్రదీప్ కాలేజీకి సెలవు పెట్టాడు.

అతడి మనసేపనిమీదా లగ్నం కావడంలేదు.

శారద రూపం అతడిసెంతగానో ఆకర్షించింది. ఆమెను వివాహం చేసుకోనడం తనకెంతో సుంభమనే అతడనుకున్నాడు.

ఇప్పుడు శారద అతడికందని పండయింది.

అందుకు కూడా ప్రదీప్ ఎక్కువగా బాధపడడంలేదు.

తనతో పోటీపడ్డవాడు మధు.

ఏ విషయంలోనూ మధుమూర్తి తనతో సరిపోలడు. ఆ విషయం మొదటి రోజునే అతడు తనముందంగీకరించాడు.

కానీ శారద తన్నుకాదని మధుమూర్తినే ఎన్నుకుంది!

ఇలా ఎందుకు జరిగింది?

ఆలోచించినకొద్దీ మధుమూర్తి తన్ను వంచించాడని ప్రదీప్‌కు తోచసాగింది.

ప్రేమ గుడ్డిది. శారద గుడ్డిదై మధుమూర్తిని ప్రేమించింది.

శారద తన్ను తప్ప ఇంకెవ్వరినీ ప్రేమించదని అతడికి తెలుసు. ఆ సమయంలో అతడికి ప్రదీప్ గురించి తెలిసింది.

శారద ప్రేమను పరీక్షించాలనుకున్నాడతడు. పరీక్షించాడు. ఈ పరీక్షలో ప్రదీప్ అనవసరంగా శారదపై ఆశలు పెంచుకున్నాడు.

పరీక్షా ఫలితం మధుకు విజయాన్నిచ్చింది. ప్రదీప్

కంటే అధికపడినన్న అహాన్నతడికిచ్చింది.

"స్వార్థంతో మధుమూర్తి నా అహాన్ని దెబ్బతీశాడు!" అనుకున్నాడు ప్రదీప్.

తల్చుకున్నకొద్దీ అతడి గుండె మండుతోంది.

"మధుమూర్తిని చంపేయాలి—" అన్న కోర్కె అతడిలో తాత్కాలికంగా రేగింది. ఆ కోరికనణచు కుందుకు విశ్వప్రయత్నం చేస్తున్నాడతడు.

కానీ—

మధుమూర్తిని చంపేస్తే తను తప్పక శారదను పెళ్ళి చేసుకోగలుగుతాడు. శారదతో తన వివాహానికతడు మాత్రమే అడ్డు!

మధుమూర్తి తనతో ఆడుకున్నాడు. అందుకు ప్రతీ కారంగా అతణ్ని చంపినా తప్పులేదు.

ప్రదీప్ నేరస్థుడు కాడు. హంతకుడు కాడు.

అందుకే హత్య గురించి తల్చుకోగానే అతడి శరీరం వణుకుతోంది.

"నేను మంచివాణ్ని. మధుమూర్తి తప్పును క్షమి స్తాను—" అనుకుంటున్నా డతడు.

కానీ—

తప్పుచేసిన మధుమూర్తిని తను క్షమించాలన్న భావం అతడిలో మధుమూర్తిపట్ల వ్యతిరేక భావాన్ని ప్రవేశ పెడుతోంది.

ఆలోచనల దారి మళ్ళించడంకోసం అతడు ఇంగ్లీషు నవల్లు చదివాడు. ఒక్కటీ బుర్రలోకెక్కలేదు.

సాయంత్రం ఇంట్లోంచి బైటపడ్డాడు. ఎక్క డెక్కడో తిరిగాడు. హోటల్లో భోంచేశాడు.

చివరకు రెండో ఆట సినిమాకు వెళ్ళాడు.

సినిమాలో ఓ హీరోయిన్ — ఇద్దరు హీరోలు.

కథ తన అనుభవంలోంచే వచ్చినట్టుంది ప్రదీప్ కు.

కథలో హీరోయిన్ ఓ హీరోతో కలిసి రెండో హీరోతో ఆడుకుంటుంది. ప్రేమ నాటకం నడుపుతుంది.

ప్రదీప్ సినిమా చూడలేకపోయాడు.

మధుమూర్తి శారదతో కలిసి — తన్నేడిపించినట్లతడికి తోచింది.

శారదకూడా తనతో ఆడుకుందనీ — అందుకు మధుమూర్తే కారణమని తెలియగానే అతడిలో కసి రేగింది.

థియేటర్లోంచి లేచాడు.

మధుమూర్తి తలిదండ్రులూళ్లో లేరనీ — అతడింట్లో ఒంటరిగా వుంటున్నాడనీ — ప్రదీప్ కు తెలుసు.

వెళ్ళి మధుమూర్తిని నిలదీసి — "నీ మోసం నాకు తెలిసింది. నీ పథకం నాకర్థమయింది. నువ్వు స్నేహితుడివి కాదు. వంచకుడివి. అయినా నేను నిన్ను నా మంచితనంతో క్షమించగలను. కానీ దేవుడు నిన్ను క్షమిస్తాడనుకోను. అందుకే ప్రాయశ్చిత్తం చేసుకుంటావో చేసుకో —" అని చెప్పాలి.

అప్పుడు మధు ముఖంలో భావాలు చూడాలి.

ప్రదీప్ తలనిండా సినిమా డైలాగ్సు....

అతడు థియేటర్నుంచి కాలి నడకనే మధుమూర్తి వుండే వీధిలోకి వచ్చాడు.

అంతా నిర్మానుష్యంగా వుంది.

అతను చుట్టుపక్కల గమనించలేదు.

తిన్నగా మధుమూర్తింటికి వెళ్ళాడు.

ఇంటికటూ ఇటూ అరుగులు. మధ్యన మెట్లు.

ప్రదీప్ మెట్లెక్కుతున్నాడు.

ఉన్నట్లుండి వీధి తలుపులు తెరుచుకున్నాయి. లోప ల్నుంచీ ఓ వ్యక్తి హడావుడిగా బైటకొచ్చి అతణ్ని డీకొన్నాడు.

"ఎవరూ?" అన్నాడు ప్రదీప్.

ఆ వ్యక్తి చేతిలో ఓ సంచీ వుంది. రెండో చేతిలో కత్తి వుంది.

అతడి చేతిలోని కత్తి జారి పడింది.

"ఎవరూ?" అన్నాడు ప్రదీప్ మళ్ళీ.

అతడు ప్రదీప్‌ను తోక్క తోపు తోసి పారి పోయాడు.

ప్రదీప్పుడిపోవలసిన వాడే ఆరుగువానుకని నిల బడ్డాడు.

నెమ్మదిగా లోపలకు వెళ్ళాడతడు.

లోపల చీకటిగా వుంది. కానీ సన్నగా మూలుగు వినబడుతోంది.

"నన్ను చంపకు...." అంటున్నదో గొంతు.

ప్రదీప్ గొంతును గుర్తు పట్టాడు. అది మధు మూర్తిది!

జరిగిందేమిటో క్షణాలమీద అతడికర్థమైపోయింది.

ఇంట్లో దొంగ ప్రవేశించాడు. మధు నేదో చేయ బోయాడు.

మధు ముందతడి నెదుర్కొని వుంటాడు. తర్వాత భయపడి వుంటాడు. అతడు కత్తితో పొడిచి వుంటాడు.

జారిపడిన కత్తి చటుక్కున గుర్తుకొచ్చింది అతడికి.

అతడు గుమ్మంలోకి వెళ్ళాడు. జేబులోంచి పెన్ టార్చి తీసి ఫోన్ చేశాడు.

అక్కడ....

పని చేయించిందో తెలియదు కానీ అతడు హత్యచేశాడు.

అక్కణ్నించి పారిపోవాలంటే అతడి కాళ్ళూ చేతులూ సహకరించడంలేదు. శరీరమంతా అహోరకం వణుకు.

"నేను పాపిని నన్ను క్షమించు—" అందామనుకుంటే అతడి గొంతు పెగలలేదు.

"ప్రదీప్—సమయానికి దేవుడిలా వచ్చావు. నేనిక ఎలాగూ బ్రతకను. నా చివరి కోరికలు తీర్చు-" అన్నాడు మధుమూర్తి.

ప్రదీప్ మాట్లాడలేదు.

"శారదను నువ్వే పెళ్ళిచేసుకో—ఇది నా మొదటి కోరిక.

ప్రదీప్ అతికష్టంమీద తలాడించాడు.

"మావాళ్ళు లేని సమయం చూసి మా యింట్లో ప్రవేశించి యింట్లోని నగలు, డబ్బు దోచుకుని — తన్ను గుర్తించావని కత్తిపోటు పొడిచి పారిపోయిన ఆ దుర్మార్గుడు భానుప్రకాష్‌మీద నువ్వు నా తరఫున పగ తీర్చుకోవాలి, ఇది నా రెండవ కోరిక—...."

ప్రదీప్ తెల్లబోయాడు. అంటే భానుప్రకాష్ అనే వ్యక్తి తన్ను హత్య చేసినట్లు మధుమూర్తి భావిస్తున్నాడు. తనే చంపినట్లతడికి తెలియలేదన్న మాట!

"ప్రదీప్! శారదతో భావిజీవితం గురించి నే నెన్నో కలలు కన్నాను. అవన్నీ వృథా అయిపోయాయి. నా ప్రాణం పోతోందని నాకు తెలిసిపోతోంది. జీవితంలో యెలాంటి తప్పునైనా క్షమించగలననుకున్నాను. భానుప్రకాష్ మంచి స్నేహితుడని నమ్మాను. కానీ ఇలా మోసం చేస్తాడనుకోలేదు. స్నేహం పేరుతో నన్ను

వంచించిన ఆ దుర్మార్గుణ్ని వదలిపెట్టను. నా తరఫున వాడిమీద ప్రతీకారం తీర్చుకో—" అన్నాడు మధుమూర్తి.

ప్రదీప్ కి భానుప్రకాష్ ఎవరో తెలియదు. కాని యెవరని అతడడుగలేదు.

"ప్రదీప్—న్యాయం గుడ్డిది., చట్టానికి కళ్ళు లేవు. ఇంకా యిక్కడే వుంటే నా హత్యానేరం నీమీద పడుతుంది. నా తరఫున ప్రతీకారం తీర్చుకుందుకూ, నా శారద భావిజీవితానికి న్యాయం జరగడానికీ నువ్వు జీవించి వుండాలి. కాబట్టి వెంటనే పారిపో—ఇక నే నెంతోసేపు బ్రతకను. వెంటనే వెళ్ళిపో—" అన్నాడు మధుమూర్తి.

ప్రదీప్ వెంటనే బయటకు నడిచాడు. వెడుతూ వెడుతూ గుమ్మం దగ్గర ఆగాడు.

ఇందాకా కత్తితీసిన చోట నేలమీద ఒకటి రెండు రక్తపు మరకలుంటాయి. తన జేబురుమాలుతో అతడు వాటిని గుర్తు తెలియకుండా తుడిచివేశాడు.

తర్వాత అతడక్కడ ఒక్క క్షణం కూడా నిలబడలేదు.

# 6

మర్నాడు పేపర్లో సాయంత్రానికల్లా వచ్చేసింది మధుమూర్తి హత్యావార్త!

ప్రదీప్ ఆ వివరాలన్నీ చదివాడు.

హత్యకు కారణం దొంగతనం. హంతకుడొకసారి హతుణ్ని గాయపరచాడు. రెండోసారి పొడిచాడు. ఆ పోటే హతుడి ప్రాణం తీసింది. ప్రస్తుతానికింకా ఎవరి

ననుమానించాలో తెలియడంలేదు. పోలీసులు పరిశోధిస్తున్నారు.

వెంటనే ప్రదీప్ శారదింటికి వెళ్ళాడు.

శారద ఏడుస్తోంది. అతణ్ని చూస్తూనే ఆమె బావురుమంది.

ఆమె కాస్త ఉపశమించాక — "నీకు భానుప్రకాష్ తెలుసా?" అన్నాడతడు.

"భానుప్రకాషెవరు?" అందామె.

"భానుప్రకాష్ గురించి నాకు మధు చాలాసార్లు చెప్పాడు. అతడు తనకు బాగా దగ్గరి స్నేహితుడన్నాడు. కానీ యెందుకల్లో భానుప్రకాష్ మధుని చంపడానికి ప్రయత్నిస్తున్నాడు. మధు నాకు కారణం చెప్పలేదు. కానీ తన కేదయినా అయితే నాకు రెండు కోరికలు చెప్పాడు. అందులో ఒకటి భానుప్రకాష్‌మీద ప్రతీకారం తీర్చుకోవడం— ...."

"రెండోదేమిటి?" అంది శారద.

"ఈ పరిస్థితుల్లో నేనది చెప్పను. నువ్వు నన్ను బలవంత పెట్టకు...."

శారద ఆ విషయం మాట్లాడకుండా — "భానుప్రకాష్ గురించి నాకూ తెలియదు. కానీ వాకబు చేస్తాను—" అంది.

ప్రదీప్ ఆమె దగ్గర సెలవు తీసుకొని వెళ్ళిపోయాడు.

కానీ భానుప్రకాష్ ఆలోచనలతణ్ని వదలిపెట్టడం లేదు.

"ఎవరా భానుప్రకాష్? అతడు దొంగతనానికి వస్తే అంతటితో సరిపెట్టుకోక హత్య ఎందుకు చేశాడు?"

ఈ సందేహాని కతడి మనసు నవ్వింది.

"భానుప్రకాష్ మధుమూర్తిని గాయపరిచాడు. స్నేహితుణ్ని హత్య చేసే వుద్దేశ్యమతడికి లేదు. హత్య చేసింది నువ్వు....నువ్వు...."

ప్రదీప్ మనసు సరిపెట్టుకుందుకు ప్రయత్నిస్తున్నాడు.

నిజానికి తనకు మధుమూర్తిని హత్యచేసే ఉద్దేశ్యం లేదు.

భానుప్రకాష్ పారేసుకున్న కత్తి తన్ను హత్యకు ప్రోత్సహించింది.

ఈ ఆలోచనకు ప్రదీప్ మనసు నవ్వింది.

"అసలు నువ్వు హత్య చేసిందెందుకు? శారదను దక్కించుకోవాలని గదా! అయితే శారదే హంతకురాలవుతుందా?"

ప్రదీప్ మనసు పాడైపోయింది.

అతడు దేనిపైనా దృష్టిని కేంద్రీకరించలేక పోతున్నాడు.

మధుమూర్తి అతనికి మంచి స్నేహితుడు.

అతడెప్పుడూ ఇతరులను నొప్పించేవాడు కాదు. సూటిగా మాట్లాడేవాడు. తన్ను తాను చిన్నబుచ్చుకునేందుకు వెనుకాడేవాడు కాదు.

అతడి సలహాలలో స్నేహితుడి క్షేమంపట్ల ఆకాంక్ష వుండేది.

అతడి స్వార్థంలో కూడా పరార్థముండేది.

అలాంటి వాడిని తను హత్య చేశాడు....శారద కోసం!

శారద విషయంలో అతడు చేసిన తప్పేముంది?

ఆమె అతణ్ని కోరింది. అతడామె అంటే యిష్టపడి కూడా—ఆమె క్షేమాన్ని కోరి తనకు కట్టబెట్టాలనుకున్నాడు.

కానీ తానతణ్ని హత్య చేశాడు.

"భానుప్రకాష్ గురించి తెలిస్తే బాగుండును?" అనుకున్నాడు ప్రదీప్. ఎందుకంటే....

హత్య తనవల్లే జరిగిందని అతడికి తెలుసు....

కానీ—తనకంటే ముందు భానుప్రకాష్ అతణ్ని గాయపరిచాడు.

చావు మొదటి గాయానికే కలిగిందేమో!

కాదని ప్రదీప్‌కు తెలుసు. కానీ భానుప్రకాష్ అతడి తప్పును తుడిచేపెట్టి మనసుకు శాంతిని ప్రసాదించే ఏకైక సాధనం....

రోజులు గడుస్తున్నా ప్రదీప్ మామూలు మనిషి కాలేకపోతున్నాడు.

ఒకరోజున అతడు మధుమూర్తి తలిదండ్రులను కలుసుకున్నాడు.

వాళ్ళు శోకమూర్తుల్లా ఉన్నారు.

కాసేపు మధుమూర్తి గుణగణాలను పొగిడాడు.

"బాబూ మా వాడు నీ గురించి చాలా గొప్పగా చెబుతూండేవాడు. నీవంటి స్నేహితుడు దొరకడం అదృష్టమనేవాడు. జీవితంలో ఎలాంటి అవసరానికైనా నువ్వు తనకుపయోగపడతావనేవాడు. నువ్వు ప్రేమలోనూ, ద్వేషంలోనూ తనకు సహకరించగలవనేవాడు. నీ పరిచయం వాడిలో మంచి మార్పు తెచ్చింది. పెళ్ళి

చేసుకోననేవాడు—నీ కారణంగానే మావాడు పెళ్ళి చేసుకుంటానన్నాడు. సంపాదన విషయంలో కూడా మా మాట వినేవాడు కాడు. నీ పరిచయం తర్వాతే మారాడు. వాడి ఉద్యోగం గురించే మాట్లాడాలని వెళ్ళాం మేమిద్దరం. తిరిగొచ్చేసరికి విధి వాడిని పొట్టన పెట్టుకుంది...."

దుఃఖం భరించలేకనో యేమో మధుమూర్తి తల్లి అక్కణ్ణించి లేచి వెళ్ళిపోయింది.

"మీకు భానుప్రకాష్ తెలుసా....?" అన్నాడు ప్రదీప్.

"అతడెవరు?" అన్నాడు అతడి తండ్రి ఆశ్చర్యంగా.

హత్యా సమయంలో అని చెప్పకుండా ప్రదీప్ అతడికి మధుమూర్తి ద్వారా తనకు తెలిసిన భానుప్రకాష్ విశేషాలు చెప్పాడు.

"నాకు తెలిసి మా వాడికలాంటి స్నేహితులెవరూ లేరే?" అన్నాడు మధుమూర్తి తండ్రి ఆశ్చర్యంగా.

"గుర్తు చేసుకుందుకు ప్రయత్నించండి...." అన్నాడు ప్రదీప్.

"ఎందుకులే నాయనా! ఆ భానుప్రకాషెవరో తెలిస్తే మాత్రం పోయిన నా కొడుకు తిరిగొస్తాడా?"

"తిరిగిరాడు. కానీ అకారణంగా హత్యలు చేసే దుర్మార్గులు తప్పించుకోలేమని గ్రహించాలి. వాళ్ళకు సరైన గుణపాఠం చెప్పాలి...."

ప్రదీప్ యింకా యేదో అనబోయి ఆగిపోయాడు. ఆ మాటలన్నీ అతడికి సూటిగా తగులుతున్నాయి.

"ఆవేశంలో నువ్వు పొరబడుతున్నావు నాయనా!

స్నేహితుడైన వాడెవ్వరూ మా వాణ్ణి హత్య చేయ లేదు. చీమకుక్కూడా అపకారం చేయని మనస్తత్వం వాడిది. స్నేహితుడికోసం ప్రాణం కూడా యివ్వగల మంచి మనసు వాడిది. అసలు దొంగ కూడా వాడిని హత్య చేసుండాల్సింది కాదు. చంపాలనుకున్నవాడు కూడా మనసు మార్చుకుని పోగలడు. ఆ రోజు మా దుర దృష్టం కొద్దీ అక్కడ జరక్కూడనిదేదో జరిగింది....". అంటూ నిట్టూర్చాడు మధుమూర్తి తండ్రి.

ప్రదీప్ చటుక్కున అక్కణ్నించి లేచి పోయాడు.

# 7

ఒకరోజున శారద ప్రదీప్‌ను కలుసుకుంది. అత డామెను తప్పించుకోవాలనుకున్నాడు కానీ ఆమె వదల లేదు.

"ఏదో తప్పు చేసినవాడిలా అలా ముఖం చాటేస్తా వేం?" అందామె.

"నిన్ను చూస్తే మధు గుర్తొస్తున్నాడు...." అన్నాడతడు.

"అయితే?"

"నీ విషయంలో అతడు నాకు పోటీ వచ్చాడు. పోటీ నుంచతణ్ణి తప్పించాలనుకున్నాను. కానీ ఇలా కాదు...."

ఇద్దరూ పార్కులో ప్రవేశించి ఓ చోట కూర్చు న్నారు.

"నాతో యేమైనా మాట్లాడాలా?" అన్నాడు ప్రదీప్.

"చాలా మాట్లాడాలి...." అంది శారద.

"త్వరగా మాట్లాడు...."

"రెండు కోరికలున్నాయి మధుకు. అవేమిటో నువ్వు

చెప్పాలి...."

ప్రదీప్ మాట్లాడలేదు....

"భానుప్రకాష్ గురించి చెప్పావు. అతణ్ని తెలుసుకోవాలని చాలా ప్రయత్నిస్తున్నావు నువ్వు...." అంది శారద.

"నీకెలా తెలుసు?"

"మధు అల్లి చెప్పింది—"

"భానుప్రకాష్ గురించి వాళ్ళు నాకేమీ చెప్పలేదు...."

శారద నిట్టూర్చి—"భానుప్రకాష్ గురించి నువ్వు పోలీసుల కెందుకు చెప్పలేదు?" అంది.

"వాడిని నేను స్వయంగానే తెలుసుకుని కసి తీర్చుకోవాలి...."

"కసి తీర్చుకోవడమంటే?"

"ఏమో—చంపితే చంపేస్తాను—"

"అంత పని మాత్రం చేయకు...." అంది శారద.

"ఏం?"

"అప్పుడు నువ్వు హంతకుడి వౌతావు ఉరికంబమెక్కుతావు...."

"అయితే మాత్రం?"

"నన్ను ప్రేమించిన యిద్దరిలో మధు నాకు దక్కకుండా పోయాడు. నువ్వు కూడా నాకు దక్కకుండా పోతావా?"

ఉన్నట్లుండి ప్రదీప్ కళ్ళు మెరిశాయి. అతడి దిగులు ఉత్సాహంగా మారిపోయింది—"నువ్వు నన్ను ప్రేమిస్తున్నావా?"

"నిజం చెబుతున్నాను. నేను మధును ప్రాణం కంటె

ఎక్కువగా ప్రేమించాను. అప్పట్లో నువ్వంటే ప్రేమ లేదు కాని జాలి ఉండేది. మధు పోవడంతో అతడిపై ప్రేమ బాధగా మారిపోయింది. నీ పైన జాలి ప్రేమగా మారింది...."

"ఇది చెప్పడానికేనా యిక్కడికి వచ్చావు?" అన్నాడు ప్రదీప్. సరసరాలా పాకుతూన్న ఉత్సాహం అతడి మాటల్లో ధ్వనిస్తోంది.

"కాదు—" అంది శారద—"మధు నిన్ను రెండు కోర్కెలు కోరాడు. అవేమిటో తెలుసుకుని అవి తీర్చడంలో నేనూ నీకు సాయపడాలి. ఒకరికిద్దరమైతే యే పనైనా నిదానంగా ఆలోచించి మరింత తెలివిగా చేయగలుగుతాం!"

"శారదా! నువ్వు సహకరిస్తే నేనేమైనా చేయగలను."

"అందుకే అతను కోరిన రెండో కోరిక చెప్పు...."

"నిజం చెప్పాలంటే భానుప్రకాష్ గురించి మధు చెప్పిన దతడి రెండో కోరిక. నేను నీకు చెప్పనిదే మొదటి కోరిక........చెప్పాలంటే మొహమాటంగా ఉంది. నువ్వడిగావు కాబట్టి చెబుతున్నాను. ఇందుకు నువ్వు నన్ను తప్పుగా అర్థం చేసుకోకూడదు. నేను నిన్ను పెళ్ళి చేసుకోవాలన్నది మధు కోరిక—...." అని చెప్పేసి ప్రదీప్ ఆమె ఏమంటుందోనన్న భయంతోనో యేమో పక్క చూపులు చూశాడు.

"దీనికి నువ్వింత తటపటాయించడమెందుకు? మధు మొదటి కోరికేమిటో నువ్వు చెప్పకపోయినా నే నూహించాను—" అంది శారద.

"అయితే ఈ విషయంలో నీ అభిప్రాయ మేమిటి?"

"ప్రదీప్! మధు నా కంటే కూడా స్నేహితుడిగా నీ కెక్కువ విలువ నిచ్చాడు. లేకుంటే తన చివరి కోర్కెలను నాకు బదులు నీకు చెప్పడు. అతడి చివరి కోర్కెలు తీర్చడం మన విధి. మన వివాహం జరగాలి. భాను ప్రకాష్‌మీద పగ తీరాలి—" అంది శారద.

"నా మనసులోని మాటే నువ్వు చెప్పావు. అయితే నా ఆలోచన వేరు. ముందు భానుప్రకాష్‌పై ప్రతీకారం తీర్చుకోవాలి. తర్వాతనే మన వివాహం...."

"అసలా భానుప్రకాషెవరో నాకు తెలియదు. నాకో చిన్న అనుమాన ముంది. భానుప్రకాష్ పేరు నీ కతడు కల్పించి చెప్పాడేమోనని! తనపై యేదో హత్యా ప్రయత్నం జరుగుతుందన్న భావం నీలో కలిగించి తనాత్మహత్య చేసుకున్నాడేమో!"

"అతడి దాత్మహత్య కాదు. హత్య!" అన్నాడు ప్రదీప్.

"అంత ఖచ్చితంగా నువ్వెలా చెప్పగలవు? మొదటిన్నుంచీ అతడు నాతో వివాహాని కిష్టపడలేదు. ఆత్మహత్య చేసుకుంటానని బెదిరిస్తూ నాకుత్తరం రాశాడు కూడా! నువ్వూ నేనూ పెళ్ళి చేసుకోవాలని అతడి కోరిక...."

"నువ్వేమనుకున్నా సరే—పోలీసు లతడిది హత్యే నని ధృవపరిచారు. నీకు తెలిసిన అతడి స్నేహితుల వివరాలు నా క్కావాలి. నేనా భానుప్రకాష్ ఆచూకీ తెలుసుకుంటాను—" అన్నాడు ప్రదీప్.

"మధు స్నేహితులతో నాకు ముఖపరిచయం లేదు. కానీ కొందరి పేర్లు తెలుసు. అందులో కొందరి వివరాలు కూడా తెలుసు—" అంది శారద.

ప్రదీప్ శారద చెప్పిన వివరాలు నోట్ చేసుకుని—
"వీటితో భానుప్రకాష్ వివరాలు తెలుసుకోగలననే ఆశి స్తున్నాను—" అన్నాడు.

# 8

శారద తన్ను పెళ్ళి చేసుకుందుకు సిద్ధంగా ఉండడం—ప్రదీప్‌లో కొత్త ఉత్సాహాన్ని కలిగించింది. అతడు భానుప్రకాష్ వివరాలు సేకరించి శారద మెప్పు పొందా లనుకున్నాడు.

అయితే అత డనుకొన్న దొక్కటి — జరిగిన దొక్కటి....

శారద ప్రదీప్‌కు ముగ్గురు మధుమూర్తి స్నేహితుల వివరా లిచ్చింది. వాటిలో అతడు మరో పదిమంది గురించి తెలుసుకున్నాడు.

వారిలో భానుప్రకాష్ పేరుగలవా డెవ్వడూ లేడు. భానుప్రకాష్ వారికి తెలియదు.

ఇంకా విచిత్ర మేమంటే వారందరికీ ప్రదీప్ తెలుసు.

ప్రదీపంటే వారందరికీ ఎంతో గౌరవభావముంది.

మధుమూర్తి తన స్నేహితులందరికీ ప్రదీప్ గురించి ఉన్నతంగా చెప్పాడు. ప్రదీప్ కారణంగా తన జీవిత విధానం మారనున్నదని చెప్పాడు.

"మా వాడు కాస్త ఆలస్యంగా పుట్టాడనిపించేది మాకు. వాడి ఆలోచనలు కొన్ని దశాబ్దాలు వెనక్కుం టాయి. వాడిని మార్చాలని మేమంతా ప్రయత్నించి విఫలు లయ్యాం. తన పద్ధతి తనదే ననేవాడు—మా కే మంత్రిం వేశాడో కానీ—తను మారదల్చుకున్నా నన్నాడు. జీవితంమీద కొత్తగా ఆశలు పుట్టాయన్నాడు.

మనిషిలో కొత్త ఉత్సాహం చూశాం. అందుకే మిమ్మల్ని అభినందించాలనుకున్నాం కూడా. ఈ లోగా వాడే మనందర్నీ వదిలి వెళ్ళిపోయాడు—" అన్నారు మధుమూర్తి మిత్రులందరూ ఏక కంఠంతో.

దీంతో ప్రదీప్‌కు అర్థమైన విశేషాలు రెండు—

మధుమూర్తి ప్రదీప్‌ని ప్రాణస్నేహితుడిగా లెక్క వేసుకున్నాడు. ఎన్నో విషయాల్లో అతడి నాదర్శంగా తీసుకుని తన స్నేహితుల కతడి గురించి ప్రత్యేకంగా చెప్పాడు.

రెండో విశేషం—అతడు శారదను పెళ్ళాడాలని నిర్ణయించుకున్నాడు.

ఆ నిర్ణయ మతడికి సంతోషం కలిగించింది. ఆ సంతోషంలోంచి ప్రదీప్ పట్ల కృతజ్ఞత పుట్టి పెరిగింది.

కానీ—ప్రదీప్ మధుమూర్తిని హత్య చేశాడు.

మధుమూర్తి స్నేహితులను కలుసుకోవడం ద్వారా ప్రదీప్‌కు భానుప్రకాష్ ఆచూకీ తెలియలేదు. కానీ తను నేరస్థుడన్న భావం మరింతగా పెరిగింది.

ప్రదీప్ మనస్సు పాడయింది. అతడిలో దిగులు పెరిగింది.

ఆ సమయంలో అతణ్ని శారద కలుసుకుంది.

"నేనో గొప్ప విశేషం తెలుసుకున్నాను...." అందామె.

"ఏమిటది?"

"భానుప్రకాష్ రూపురేఖలను మధు నీ దగ్గర వర్ణించాడా?"

"ఎందుకు?"

"రూపురేఖలు తెలిస్తే భానుప్రకాశాన్వేషణలో మనం

సులభంగా తెలుసుకోవచ్చు—"

మధుమూర్తి యింటి ముందు తన్ను తోసి పారిపోయిన దొంగ ప్రదీప్ కప్పుడు గుర్తుకొచ్చాడు. చీకట్లో అతడి ముఖం కనపడలేదు కానీ—ఆకారం స్పష్టంగా గుర్తుంది. ఎత్తు, లావు వగైరాలన్నీ యిప్పటికీ తను చెప్పగలడు.

"రూపురేఖలు తెలియడంవల్ల ప్రయోజనం?" అన్నాడు ప్రదీప్.

"మధు స్నేహితులలో భానుప్రకాషెవరో తెలుసుకోవచ్చు—"

"పేరుతో కనుక్కోలేనిది రూపురేఖలలో యెలా సాధ్యపడుతుంది?"

"అతడు నీకు పేరు తప్పు చెప్పాడు."

"ఎందుకని?"

మధుమూర్తిది విచిత్రమైన స్వభావం. చిన్నతనం నుంచీ అతడు స్నేహానికెంతో విలువచ్చేవాడు. చిన్నప్పుడతడోసారి ఓ స్నేహితుడి చేతుల్లో చావుదెబ్బలు తిన్నాడు. అతణ్ని కొట్టిందెవరో చెప్పమని తలిదండ్రులు ప్రాణం తీశారు. అతడు భానుప్రకాష్ పేరు చెప్పాడు.

ఎంత ప్రయత్నించినా అతడి తలిదండ్రులకు భానుప్రకాషెవరో తెలియలేదు.

నాలుగురోజులు పోయాక అతడు తల్లితో—"ఇప్పుడు నేనూ నన్ను కొట్టినవాడూ మళ్ళీ స్నేహితులమైపోయాం—వాడెవరో మీకు తులుసుంటే ఈ జన్మకు మేము మళ్ళీ స్నేహితులం కాలేకపోదుము—" అన్నాడు.

స్నేహానికి మధుమూర్తిచ్చిన ప్రాధాన్యతలోంచి పుట్టిన పేరు భానుప్రకాష్. తనకు జరిగిన అన్యాయాని

మధుమూర్తికి ప్రదీప్ తన్ను పొడిచాడని తెలిసింది—

ఎందువల్ల?

అనుకోకుండా ప్రదీప్ పొరపాటువల్ల. గదిలో దీపం వెలిగింది.... ఆ దీపం వెలుతుర్లో అతడు హంతకుణ్ని చూశాడు. చూసీ చూడగానే హత్యకు కారణం తెలుసుకున్నాడు.

ఆ సమయంలో కూడా అతనిలోని మంచితనమే పని చేసింది.

తాను ప్రదీప్ హంతకుడని గ్రహించినట్లు ప్రదీప్‌కి తెలియకూడదనుకున్నాడు. వెంటనే భానుప్రకాష్ పేరు కల్పించి చెప్పి—శారదను పెళ్ళి చేసుకో అన్నాడు.

మధుమూర్తి హంతకుడిగా ఎవరిని భావిస్తూ మరణించాడో ఆ దైవానికే తెలియాలి. కానీ మరణిస్తూ కూడా హంతకుడి ఉనికి నతడు రహస్యంగా ఉంచడానికి గానీ లేక హంతకుడి మనస్సుకు శాంతి ప్రసాదించడానికి గానీ ప్రయత్నించాడు.

మరి ప్రదీప్?

"నో—!" అని అరిచాడు ప్రదీప్.

"ఏమయింది ప్రదీప్?" అంది శారద తెల్లబోయి.

"భానుప్రకాష్‌మీద కసి తీర్చుకోమని నా కతడు మరీ మరీ చెప్పాడు. అలాంటప్పుడు భానుప్రకాష్ అనే వ్యక్తి లేకుంటే యెలా?" అన్నాడు ప్రదీప్ తమాయించుకుని మాట మార్చుతూ.

"భానుప్రకాష్ వున్నాడు. ఆ పేరే తప్పు. మనం ఆ వ్యక్తెవరో తెలుసుకోవాలి...." అంది శారద.

"ఎలా తెలుస్తుంది?"

"మన స్నేహంలో చిత్తశుద్ధి ఉంటే యెలాగో అలా తెలుస్తుంది...."

ప్రదీప్ ఆలోచనలో పడ్డాడు.

"భానుప్రకాష్ మీద పగ తీర్చుకోమని మరీ మరీ నీకే చెప్పాడంటే అర్థమేమిటి? అది తనవల్ల కానిపని అనేగా! అయితే ఉన్నట్టుండి మధుకు జీవితం మీద ప్రేమ పుట్టింది. బ్రతికితీరాలన్న పట్టుదల అతడిలో బయల్దేరింది. అందుకే అతడు తన్నంతం చేసేవాడిని క్షమించదల్చుకోలేదు. తన మిత్రుల్లో ముఖ్యుడివైన నీకా పని అప్పజెప్పాడు. అపురూపమైన స్నేహపాత్రుడైన మధు క్షమించని ఆ వ్యక్తిని నీవు కూడా క్షమించకూడదు. అతడి చివరి కోరిక తీర్చవలసిందే!"

"నిజం చెప్పావు శారదా!" అన్నాడు ప్రదీప్.

"మధూ వాళ్ళింట్లోంచి సుమారు పన్నెండు తులాల బంగారం, వెయ్యి రూపాయల నగదు పోయాయి. దొంగ యేదో ఒక రోజున దొరుకుతాడనే నా నమ్మకం—...."

"పోలీసుల కంటే ముందు ఆ దొంగను నేనే పట్టుకుంటాను...." అన్నాడు ప్రదీప్.

"ఎలా!"

"నాకిప్పుడు భానుప్రకాష్ ఎవరో తెలిసింది...."

"ఎలా?"

"మధు నాకు భానుప్రకాష్ రూపురేఖలు వర్ణించాడు—...."

"ఎవరతడు?" కుతూహలంగా అడిగింది శారద.

"నీకు రేపు తెలుస్తుంది...."

శారద యెంతడిగినా ప్రదీపామె కంఠమమించి చెప్ప లేదు.

•  •  •

మర్నాడు ఊరి చివర కొండకింద చెరువులో ప్రదీప్ శవం పోలీసులకు దొరికింది. అతడి జేబులో బాల్ పెన్‌తో వ్రాయబడ్డ ఉత్తర మొకటి శారద పేరున ఉంది!

"శారదా!

స్నేహితుడి చివరి కోరిక తీర్చగలుగుతున్నం దుకు నా కెంతో స్నేహంగా వుంది.

ప్రదీప్."

అది ఆత్మహత్యని పోలీసులంటున్నారు.

భానుప్రకాషే ప్రదీప్ని చంపేశాడని శారద అను కుంది. తెలివిగా అతణ్ని చంపుదామని కొండ చివరకు తీసికెడితే చివరిక్షణాల్లో హంతకుడతడి పథకం కని పెట్టి తనే ప్రదీప్ని కిందకు తోసేసి ఉండొచ్చునని ఆమె భావం.

"లేకుంటే ప్రదీప్ కి ఆత్మహత్య చేసుకోవాల్సిన అవ సరమేమిటి?" అన్నదామెకు జవాబులేని ప్రశ్న.

మధుమూర్తి హంతకుడిపై ప్రతీకారం తీర్చుకునే మార్గంగా—ప్రదీప్ కి మిగిలిన దొక్కటే ఆత్మహత్య మాత్రమేనని ఆమెకు తెలియదు.

—: అయిపోయింది :—

# డు చేసిన నేరం?

కె.బి.యస్. కుమార్

్భరమైన అలజడి—భయం

చిన్నా పెద్దా మగాళ్ళు
వేగంగా పరిగెడుతున్నారు

ంది. వాళ్ళ ఆయాసంలో
రాలు కారిస్తోన్న స్వేద

ట్ల దూరంలో యిద్దరు
తప్పించుకోవాలన్న
చ్చిపోతామన్న భయం

వుంది. దొరకకూడదన్న ప్రార్థన వుంది.

ఆ యిద్దర్లో ఒకరు మగ — రెండవది ఆడమనిషి.

అతని పేరు సుధాకర్. ఆమె పేరు రాధ.

దాదాపు అరగంటనుండీ వారు పరిగెడుతూనే వున్నారు.

రాధకి ఆయాసం అధికమవుతోంది. కాని ఆయాసానికి ప్రాముఖ్యత యిస్తే ప్రాణం సునాయాసంగా ఆమెనుండి విడిపోతుంది వెనక తరుముతోన్న కోపం శక్తిగా తెగువతనం వుంది.

అందుకే ఆయాసాన్ని లెక్క చెయ్యటంలేదామె. పడుతోంది. లేస్తోంది. పరిగెడుతోంది. పడుతూ లేస్తూ పరిగెడుతోంది.

ఆమె లేత పాదాలు కరకురాతి గుళ్ళపైబడి ఒరుసుకుపోయాయి. గులకరాళ్ళు గాయాలు చేశాయి. కాని ప్రాణభయం వాటిని, వాటి తాలూకు బాధని తాత్కాలికంగా మర్చిపోయించి.

సుధాకర్ కి ఆమెని చూస్తే జాలివేస్తోంది. తమ పరిస్థితిని, ప్రస్తుత పరిస్థితిని చూస్తే అతనికి దుఃఖం ఆగటంలేదు. తామిద్దరూ నేరం చేశారు. నిజమే. కాని యిది తెలిసి చేసిన నేరం కాదు. ఒక్క మాటలో చెప్పాలంటే యిది దేవుడు చేసిన నేరం!

వాళ్ళిద్దరూ అలా పరిగెడుతూనే వున్నారు. సుడిగాలిలా, సంధించిన బాణాల్లా దూసుకుపోతూనే వున్నారు. తరుముతోన్న వాళ్ళకి అందకుండా.

## 2

రాధ గుండెలు ఎగిరిపడుతున్నాయి. కడుపు నొప్పిగా వుంది.

ఆమె శరీరం స్వేదంతో తడిసిపోయింది. పెదాలెండిపోయాయి. నాలిక పిడచగట్టుకుపోయింది. మాట్లాడదామంటే గొంతు పెగలటంలేదు. కాళ్ళు పీక్కుపోతున్నాయి. పాదాలు మండుతున్నాయి. కళ్ళు బైర్లుగమ్ముతున్నాయి. ఉచ్ఛ్వాసనిశ్వాసలు బరువుగా శబ్దంతో వెలువడుతున్నాయి, గురకలా.

చప్పున ఆమె ముక్కువద్ద చెయ్యి కాస్త ఎడంగా అడ్డంపెట్టాడు సుధాకర్.

ఆ ప్రాంతంలో దట్టంగా పెరిగిన దుబ్బులున్నాయి. పెద్ద పెద్ద రాతిగుండ్లున్నాయి. రోడ్డు అనేక మలుపులు తిరిగుంది.

రాధ చెయ్యిపట్టుకుని ఒక్క గెంతులో మలుపు తిరిగి రాతిబండల చాటుకి గెంతి దుబ్బుల చాటున ప్రాకి నక్కి చూస్తున్నాడు సుధాకర్. అతని గుండె వేగంగా చప్పుడు చేస్తోంది. ప్రాణభయం పెద్దపులిలా వాళ్ళ ముందు కూర్చొని వుంది భయంకరంగా నోరు తెరుచుకుని.

క్షణాలు భారంగా నిమిషాలవుతున్నాయి.

అయిదు—పది—పదిహేను—యిరవై....

తామింకా ముందుకి పరుగెడుతున్నారని భావించి 'వాళ్ళు ముందుకి సాగిపోయి వుంటారు. తామిద్దరూ ప్రస్తుతానికి తప్పించుకున్నట్టే.

నిజంగా ముందుకి వెళ్ళిపోయి వుంటారా? లేక యిక్కడే ఎక్కడో నక్కివుంటారని అక్కడొకడూ అక్కడొకడూ పొంచి వున్నారా?

గొంతెండిపోవటంవల్ల అప్పుడప్పుడూ దగ్గుతెరకమ్ముకొస్తోంది. దగ్గాలంటే భయం! అసలు ఊపిరిపీల్చి వదలాలంటేనే గండంగా వుంది. ఆ చప్పుడు పసిగట్టి

ఎవరైనా మీదపడతారేమోనని!

అప్రయత్నంగా రాధకేసి దృష్టిసారించిన సుధాకర్ వులిక్కిపడ్డాడు.

వెక్కి వెక్కి ఏడుస్తోంది రాధ!

భయం కల్సిన అనునయంతో ఆమె వెన్ను నిమిరాడు. ఆమె మొహాన్ని దోసిట్లోకి తీసుకుని 'ప్రమాదం సుమా' అన్నట్టు సైగ చేశాడు.

కాని ఆమె ఆగటంలేదు. కట్టలు తెగిన ప్రవాహంలా ఆమెలోంచి దుఃఖం తన్నుకువస్తోంది. సుధాకర్ మొహాన్ని చూడలేకపోతోందామె. పశ్చాత్తాపం ఆమెని దహించివేస్తోంది. 'ప్రాయశ్చిత్తం మరణమే సుమా' అని హెచ్చరిస్తోంది.

సుధాకర్ పరిస్థితికూడా అలాగే వుంది. ఆ భయంకర నిజం—నిప్పులాంటి—కాదు—లావాలాంటి ఆ నిజాన్ని తెలుసుకున్నాక తనకీ బ్రతకాలనిపించలేదు.

కాని అంతలోనే మనసు ఎదురుతిరిగింది.

“ఏం? ఎందుకు చచ్చిపోవాలి? యిందులో తాము చేసిన నేరం ఏమిటి? తమకి తెలీకపోవచ్చుగాని సమాజంలో యిలాంటి సంఘటనలు ఎక్కడో ఒకచోట సంభవించే వుంటాయి. సంభవించినా సంభవించక పోయినా జరిగిందేదో జరిగిపోయింది. దీనికి పరిష్కారం మరణం కాదు. ఆత్మాహుతి కాదు. కానేకాదు. తాము బ్రతకాలి. కనీసం....”

ఆ వేదనతో మరిగిపోతున్న మస్తిషం ఆలోచనల్లో వుండగానే తమ సంభాషణ చాటుగా విన్న ప్రక్కింటావిడ దండోరా వేసింది. పదినిముషాల్లో సగం వూరు 'అంటుకుంది' ఈ వార్తతో.

తెలిసి చేసిన తప్పుకి ఈ ఊళ్ళో తరిమి చంపటం శిక్ష. పట్టుబడితే—సజీవ దహనం సరైన శిక్ష.

తాము యింట్లోనే వుంటే వాళ్ళకి దొరక్క తప్పదు. మరణం తప్పదు.

అందుకే పెరటి తలుపులు తెరచుకుని పిక్కబలాన్ని అరువు తెచ్చుకున్నారు. వాళ్ళు కనుక్కుని వెంటబడ్డారు....

ఆ ఊళ్ళో కరెంటుంది. చదువుకున్న వాళ్ళున్నారు. రక్షిత మంచినీటి సరఫరా పథకం క్రింద కుళాయిలున్నాయి. ఆధునిక వ్యవసాయ పద్ధతులు అమలు చెయ్యబడుతున్నాయి. నాగరికత వుంది. అప్పర్ ప్రయిమరీ స్కూలుంది. పశువుల ఆసుపత్రి ఉంది.

అయినా మూఢనమ్మకాలు పోలేదు. మూఢాచారాలు పోలేదు చాలామంది ప్రజల్లో మూర్ఖత్వం పల్చబడలేదు. జాలి వారి ఆభరణమైతే పగ, కరుకుదనం ఆయుధాలు.

పాతకాలంలో అప్పుడున్నట్టూ, కొన్ని 'దేశాల్లో యిప్పటికీ ఉన్నట్టూ కొన్ని రకాల తప్పులకి కొన్ని శిక్షలున్నాయిక్కడ. దొంగతనంచేస్తే కాళ్ళు నరికేస్తారు. వ్యభిచరిస్తే పురుషాంగాన్ని కోసివేస్తారు. స్త్రీకయితే మర్మాంగంలోకి ఇనుప చువ్వలు ప్రవేశపెడతారు. ఇప్పుడు సుధాకర్ రాధ చేసిన 'తప్పు'కయితే తరిమి చంపుతారు. తప్పించుకుంటే ఫర్వాలేదు. పట్టుబడితే....

## 3

టైమ్ చూసుకున్నాడు సుధాకర్.

తామక్కడ దాక్కుని దాదాపు గంటన్నర కావస్తోంది. ఫర్వాలేదు. వాళ్ళు తిన్నగా ముందుకి వెళ్ళిపోయి ఉంటారు. తాత్కాలికంగా ప్రమాదం తప్పింది.

యిక ఈ ఊరితో తమకి ఋణం తీరిపోయింది. తన ఉద్యోగంకూడ వూడిపోయినట్టే లెక్క.

ఉద్యోగం పోతే కూలో నాలో చేసుకోవచ్చు. జానెడు పొట్టకి పిడికెడు నూకలు సంపాదించలేని వాజమ్మ కాడు తను.

కాని తమ జీవితం వూడిపోయినట్టయిందిప్పుడు.

నిజం నిప్పులాంటిదంటారు. ఆ నిప్పు జ్వాలైతే ఆ జ్వాల చిచ్చుగా మారి కార్చిచ్చై నందనవనం లాంటి తమ జీవిత నౌకని మాడ్చేస్తోంది. ఈ నిజం తెలీకుండా ఉంటే ఎంత బావుణ్ను!?

మోకాళ్ళపై తలాన్చుకుని వెక్కి వెక్కి ఏడుస్తోన్న రాధని చూశాడు సుధాకర్. ఆమెనెలా ఓదార్చాలో అతనికి బోధపడ్లేదు.

అయినా యిది ఓదారుస్తూ కూచునే సమయం కాదు. ముందీ ప్రాంతంనుండి బైటపడాలి. ఈ మూఢాచారపు చురుకత్తుల వలయంలోంచి తప్పించుకోవాలి.

ఎర్రగా వాచిపోయిన రాధ కోమలమైన పాదాలని చూసి జాలిపడ్డేడు సుధాకర్. ఆమె జబ్బపట్టుకుని లేవదీశాడు.

రాధ మాట్లాడ్లేదు. ఏడుపుని తాత్కాలికంగా ఆపి, వేదనని తాత్కాలికంగా సమాధిచేసి, విరక్తిని తాత్కాలికంగా హత్యచేసి ఆమె అతనివెంట నడవసాగింది.

సుధాకర్ మనసు కీడుని శంకిస్తూనే వుంది. ముందు కెళ్ళినవాళ్ళు అంత దూరం తాము వెళ్ళుండరని భావించి వెనుదిరిగి యిదే దారిలో వస్తే తనుకి ఆయువు మూడుతుంది.

అందుకే అతడు చాలా జాగ్రత్తలు తీసుకుంటు

న్నాడు. రాధ కుడిచెయ్యి తన ఎడంచేత్తో గట్టిగా పట్టుకుని జాగ్రత్తగా అడుగులు వేస్తున్నాడు.

చిన్న చిన్న చెట్లు. అక్కడక్కడా పెద్ద పెద్ద చెట్లు. పెద్ద పెద్ద రాతిబండలు. గుండ్రంగా ఏపుగా పెరిగిన దుబ్బులు. ఎండుటాకులు పాదాలక్రిందపడి చప్పుడు చేస్తున్నాయి. ఏ చిన్న చప్పుడు వినవచ్చినా సుధాకర్ ఉలిక్కిపడుతున్నాడు.

ఈదురు గాలి వీస్తోంది. చీకటిపడటానికింకా అరగంట వ్యవధి ఉంది. దానిలో రెండుసార్లు కురిసిన వర్షమే! మళ్ళీ రానేలేదు. గాలినిబట్టి వస్తుందేమో అనిపించినా వచ్చేలాలేదు.

దాదాపు యాభై కిలోమీటర్ల దూరంలో అడవి ప్రారంభమవుతుంది. చెట్లు పేరూల్ని ఆకర్షిస్తాయి కదా! బహుశ అక్కడ వర్షం కురుస్తూండవచ్చు.

మనసుని వర్తమానంనుండి మళ్ళించాలని ఏదేదో ఆలోచిస్తున్నాడు సుధాకర్. ఓ ప్రక్క సిక్స్త్ సెన్స్ అతణ్ని హెచ్చరిస్తూనే వుంది. యాంత్రికంగా అడుగులు వేస్తున్నాడు.

కాని వర్తమానం నీడలాంటిది కదా! జీవితాంతం తోడుగా వుండే వర్తమానం వాళ్ళపాలిటి భవిష్యత్తు అయినప్పుడు ఎన్ని ఆలోచనలు చేసినా ఏం లాభం?

వాళ్ళు అలా నడుస్తూనే వున్నారు.

"....ఇక నేను నడవలేను...." అంది రాధ, చాల సేపటి తర్వాత మాట్లాడుతూ.

"ప్లీజ్—రాధా! కాస్త ఓపిక తెచ్చుకో. ఇంకెంత? పావుగంట. రోడ్డు చేరుకోగలం. ఈలోగా రోడ్డు కూడా వచ్చేస్తుంది. కాసేపు అలుపు తీర్చుకుని ఏదైనా

కస్తే ఎక్కి వెళ్ళిపోదాం...." అనునయపూర్వకంగా అన్నాడు సుధాకర్.

# 4

కీచుమంటూ ఆగిపోయింది లారీ.

"కహాఁజానా?" గద్దించినట్టడిగాడు డ్రయివరు. అతడు జుట్టుని తలమీద ముడివేసిన తీరు అతన్ని సిక్కుగా చెబుతోంది.

"విశాలపట్నం—" స్పష్టంగా చెప్పాడు సుధాకర్.

విశాలపట్నం అక్కడికి దాదాపు ముప్పయ్ కిలో మీటర్లుంటుంది. పదికిలోమీటర్లు దాటాక పది కిలో మీటర్లు ఘాట్ సెక్షన్ కావడంతో మొత్తం గంటన్నర సేపు ప్రయాణం సాగుతుంది.

ఎక్కమన్నట్టు సైగచేశాడు డ్రయివరు. క్లీనరు ప్రక్కకి తప్పుకొని లోనికి దారిచ్చాడు.

ముందుగా తనే యెక్కబోయాడు సుధాకర్ కాని ఆ తర్వాత రాధని పైకి లాక్కోటం కష్టం. పరిగెత్తి పరిగెత్తి పిక్కలేకాదు జబ్బలు కూడ శక్తిని కోల్పోయాయి.

రాధకూడ—చిటికెన వ్రేలితో తోస్తే చాలు. ఒరిగి పోయేలా వుంది.

ముందుగా రాధని ఎక్కమని సైగచేశాడు సుధాకర్. ఆమె నడుం భాగంలో రెండువైపులా చేతులువేసి నెమ్మదిగా ఆమెని ఎక్కించగలిగాడు. తొడల భాగంలో పాంట్ని కాస్త పైకి లాక్కుని తనూ ఎక్కబోతూ టైరుమీద కాలు మోపి రెండవకాలుని కూడదీసుకుని పైకి—క్యాబిన్లోకి యెక్కబోతూ—

దభీమని క్రిందపడిపోయాడు!

తను మామూలుగా క్రిందపడిపోలేదని క్లీనరు తనని బలంగా వెనక్కి తోసేశాడని క్రిందపడ్డ మూడో క్షణంలో గ్రహించాడు సుధాకర్.

కాని అప్పటికే ఆలస్యమైపోయింది.

## 5

గట్టిగా హూంకరించాడతను.

మిగతా వాళ్ళందరూ మవునంగా వున్నారు, తలలు వాల్చుకుని. వాళ్ళ మొహాల్లో సైతం ఓటమి తాలూకు ఛాయలు వికృత నాట్యం చేస్తున్నాయి. నిరుత్సాహం అంగుళం మందాన పేరుకుపోయి వాళ్ళలో మరింత పౌరుషాన్ని కసినీ పులుముతోంది.

శుక్ల పక్షపు ద్వాదశి కావటంతో చంద్రుడు వినువీధిలో ప్రవేశించి ప్రకృతిని వెన్నెలపూత పూశాడు. వీస్తోన్న గాలికి అక్కడున్న చిన్న చిన్న చెట్లూ పొదలూ విచిత్రంగా కదులుతున్నాయి. వాళ్ళ మనోభావాలు గ్రహించి భయంతో వణికిపోతున్నవా అన్నట్టుగా.

మెయిన్ రోడ్డుని కలుపుతూ పొదల మధ్యగా సాగిపోయిన కాలిబాట ఎలుకనో కప్పనో తిని నల్లని బండల పైన మత్తుగా పడుకున్న గోధుమరంగు పాములా వుంది.

"ఛఛ....యింతమందిమి ఉండికూడ యిద్దర్ని పట్టుకోలేక పోతిమిగదా!" అన్నాడు మొదటిగా హూంకరించినవాడు.

"దాంట్లో—ఆ యిద్దర్లో ఒకతె ఆడది!" రెండో వాడు మొదటి వాడి మాటలకి ఆజ్యం పోశాడు.

"ఏం చేస్తాం? వాళ్ళు పరిగెత్తడంలో ఘటికులమాదిరున్నారు. పోనీ రాళ్ళతో కొట్టి చంపుదామనుకుంటే."

"అమ్మయ్యో! మొదట్నుండీ ఆచారాల ప్రకారం

చేస్తావుంటేనే 'కానపూలమ్మ' దేవత మనమీద కోపం చూపుతావుంది. అడివిలో కురిసిన వాన యిక్కడ వాసనగూడ చూపడంలేదు. ఒకటి చెయ్యబోయి ఇంకోటి చేస్తే యింకేమున్నా వుందా?" మొదటివాడు గుండెల మీద చెయ్యేసుకున్నాడు.

"వాళ్లు తప్పు యిక్కడికొచ్చినాక చెయ్యలేదుగదా! తెలియకుండా చేసిన తప్పు ఆలస్యంగా యిక్కడికొచ్చినాక తెలిసింది. దానికి వాళ్ళలో వాళ్ళే కుమిలిపోతూ ఉన్నారు. పాపం యెంతో బాగా పిల్లలకు పాఠాలు చెప్పేవాడు...."

"అవును. అసలే మనవూరంటే ఉద్యోగంచేసే వాళ్ళెవరూ తొక్కిచూడరు. వచ్చినా గంటనో అర్థ గంటనో వుండి పనులు చూసుకొని పోతారుగాని పెళ్లాన్ని కూడ పిలుచుకొనివచ్చి కాపురం పెట్టరు. నాలుగు తగిలించి తరిమేసివుంటే బాగుండేది...."

"నోరుముయ్యండి!" గట్టిగా అర్చాడు మొదటివాడు. "ఎర్రదిబ్బ గ్రామాన్ని ఏ గవర్నమెంటూ పట్టించుకున్న పాపాన పోలేదు. మనకా యాశ మొదట్నుండీలేదు. మనం ఈమాత్రమన్నా యింత కూడు గతికి బతుకుతున్నామంటే అది కానపూలమ్మతల్లి చల్లని చూపే. ఆ తల్లికి కోపం తెప్పించినామంటే ఎర్రదిబ్బ పీనుగులదిబ్బ అయిపోతుంది. అందుకే ఈ వూళ్లో పెద్దలు—ఏ అనాచారం జరిగినా అపచారంగా తలుస్తూ దానికి సంబంధించిన వాళ్ళకి కఠినమైన శిక్షలేస్తూ వస్తున్నారు.

రాను రాను ఈ ఊళ్ళో చదువుకున్నోళ్ళు ఎక్కువ కావడంతో ఈ ఆచారాలంటే పెడమొహం పెడుతున్నారు. చూసినావా! పదేండ్ల కిందటికీ యిప్పటికీ

మన బ్రతుకులు యింకా అధ్వాన్నమైపోయినాయి. అప్పుట్నుండే కదా ఊరు రెండుభాగాలైందేది!? మనమే ఎక్కువమంది వుండడంతో వాళ్ళు నోరు మూసుకున్నారు. మన జనాన్ని మనం పెంచుకోవాల. అప్పుడు కానపూలమ్మ తల్లికి సంతోషమైతాది. ఆ తల్లి సల్లని దీవన వుంటే మనకు కాసులొస్తాయి. పంటలు పండుతాయి. ప్రతిరోజూ మనం పండుగ చేసుకోవచ్చు.

"అందుకే మన ఊళ్ళో ఏ తప్పూ జరగరాదు. మనం జరగనియ్యకూడదు. ఎవరో ఎక్కడో తప్పుచేసినాడు, యిక్కడ మనమెందుకు దండించాల అని మనం అనుకోగూడదు వాళ్ళ తప్పు యిక్కడ బైటపడినాదీ అంటే కానపూలమ్మదేవత కళ్ళు తెరిచినాదనే అర్థం. ఆయమ్మ 'అంటు' సయించదు, కాబట్టే మనకు తెలిసిపోయినాది. మన ఆచారం మనం చెయ్యలేదో, మనకు మంచినీళ్ళు కూడా పుట్టవ్. ఊళ్ళో పెద్దోళ్ళుగా, పెద్దోళ్ళ అడుగుజాడల్లో నడవాల్సిన 'యిది' మనకున్నది. మనూళ్ళో పుట్టి పెరిగినోడు తప్పు చేసినా యిదే శిక్షగదా! ఎవడి వల్లనో మనూరు నాశనమైపోవడం చూస్తూ వూరికే వుండగలమా మనం?"

సుదీర్ఘమైన వుపన్యాసాన్ని తాత్కాలికంగా ఆపుచేస్తూ అతడు ఆ వెన్నెల్లో అందరి ముఖాలూ పరికించాడు. నాదస్వరం విన్న నాగు లవుతున్నారని గ్రహించాడు. 'సనాతన సంప్రదాయాన్ని' నిలబెట్టినవాడిగా తన్ను తానే అభినందించుకున్న భావన అతని హృదయంలో లీలగా పొడసూపింది. ఇక యెక్కువగా చెప్పటం అనవసరమన్న నిర్ణయాని కొచ్చాడతను.

"....కాబట్టి ఎక్కడున్నా మనం వాళ్ళని పట్టు

పోవాల. కావపూలమ్మ కళ్ళు పల్లబడాల. వెతకండి. వాళ్ళక్కడే యెక్కడో దాక్కొనుంటారు. లేదా యింకో గంటసేపు యిక్కడే వుందాం. చీకట్లో అడ్డ దారిగుండా రాలేరు. ఒకవేళ ఆ దారిగుండా పోయినా రోడ్డు కతలి దిక్కున మనోళ్ళలో సగం మంది వున్నారు గదా! ఈ దారి విశాలపట్నం—యిదే దారి యెనక్కి పోతే నాయుడుపట్నం. ఏ లారీయో యెక్కి వాళ్ళు విశాలపట్నమైనా రావాల; నాయుడు పట్నమైనా పోవాల. కాబట్టి మనకో మనవాళ్ళకో చిక్కుతారు. రాండి. అక్కడ మర్రిచెట్టునీడ చీకటిగా వున్నాది. అక్కడ కూచుందాం...."

అందరూ మంత్రముగ్ధుల్లా తలవూపారు.

## 6

కెవ్వున కేక వేసింది రాధ. కాని అది పెదవుల్ని దాటి బైటికి రాలేదు. క్లీనరు మెరుపులా ఆమె పొదివి పట్టుకుని చప్పున ఆమె నోరు మూశాడు. మరుక్షణం లారీ ఒక్క జర్కుతో ముందుకు దూకింది.

సుధాకర్ అరుపులు యింజను శబ్దంలో కలిసి పోయాయి.

రాధ పెనుగులాడుతోంది. తనని ఒడిసిపట్టుకున్న క్లీనర్ని రక్కుతోంది. వాడి బాహువుల్లోంచి బైట పడటం కోసం శక్తినంతా కూడగట్టుకుని గింజు కుంటోంది. వాడి చేతుల్ని కొరకటానికి ప్రయత్నిస్తోంది.

కాని ఆమె ప్రయత్నాలేవీ ఫలించలేదు.

డ్రయివరు డ్రయివ్ చేస్తూనే వున్నాడు. అతని శరీరం క్రమంగా వేడెక్క నారంభించింది. ఆడగాలి సోకి నెల దాటింది. శరీరంలో కొత్త హుషారు పుట్టు

కోస్తోంది.

లారీ డ్రయివర్లది ఒక రకంగా జల్సా జీవితం. బెంగుళూరు టు హైదరాబాద్ లాంటి లాంగ్ టూర్సులో మధ్యలో యెన్నో పల్లెలు, పట్టణాలు తగుల్తాయి. బోలెడంతమంది ప్యాసింజర్సుని యెక్కించుకుంటారు. నాలుగు చేతులా నోట్లతో కిటకిట లాడుతుంటాయి. వాళ్ళ లాభమూ సౌలభ్యం కోసం పగలుపూట లోడింగ్ అన్ లోడింగ్ కార్యక్రమాలు చూసుకుంటూ విశ్రాంతి తీసుకుంటారు. రాత్రులు ప్రయాణం చేస్తారు. డబ్బు విచ్చలవిడిగా ఖర్చు చేస్తారు.

లారీడ్రయివర్ల కోసం రాత్రులు పూర్తిగా తెరుచుకుని అనేక హోటళ్ళు ఆత్రంగా యెదురుచూస్తుంటాయి, హైవాన్ రూట్ సెంటర్సు దగ్గరా చోట్ల. అవి వాళ్ళ ఆకలితో బాటు 'ఆకలి' కూడ తీరుస్తాయి. మత్తుపానీయాలు కూడా సరఫరా చేస్తాయి. అందుకే వీళ్ళు చాల మటుకు సంపాదన, సౌఖ్యము చూసుకుంటారు. ఇంటి మీద ధ్యాస తక్కువ.

అలాంటి సౌఖ్యాని కలవాటుపడి ఇటీవల రోగం తెచ్చుకుని ఈ మధ్యే కోలుకున్నాడీ డ్రయివరు. ఇకపై వచ్చినా కిరాయి సుఖం జోలికి పోకూడదని వాళ్ళ దేవుడిపై ఒట్టు పెట్టుకున్నాడు. ఏదయినా ఫ్యామిలీ సరుకు దొరికితే పండుగ చేసుకోవాలనీ అనుకున్నాడు.

దూరం నుండి చూడగానే క్లీనరుకి సూచన ఇచ్చాడు. వాళ్ళ అంచనా కరెక్టయింది. సుధాకర్ లారీ ఆపాడు. ఒకవేళ సుధాకరే ముందుగా లారీ యెక్కివున్నట్టయితే బహుశా వాళ్ళు అతన్ని చంపేసేవాళ్ళేమో!

క్లీనరు పశుబలం ముందు రాధ బేలతనం ఆగలేదు.

క్యాబిన్ లో వున్న ప్లాస్టిక్ వైరుతో ఆమె రెండు చేతుల్నీ వెనక్కి విరిచి కట్టేశాడు. మాసిపోయి చెమట ప్లస్ ఆయిల్ వాసన కొడుతోన్న కర్చీఫ్ తో ఆమె నోటిని బంధీని చేశాడు.

వాడి మనసు గాల్లో తేలిపోతోంది.

తన కందిన ఫలం ఏదైనా సరే. అందులో తనకీ భాగం పంచుతాడు గురూగారు. ఆ రోజు తనకి జ్వరంగా వుండబట్టిగాని లేకపోతే గురూగారితో బాటే తనకీ రోగం తగిలుండేది!

అప్పట్నుండి గురూగారు ఫ్యామిలీ పిట్టను పట్టక పోతాడా, తనకూ భాగం రాకపోతుందా అని ఆబగా యెదురుచూస్తున్నాడు. ఇన్నాళ్ళకి దొరికింది!

కసిగా చూశాడు రాధవంక. చేతులు, పెదవులు స్వేచ్ఛని కోల్పోగా నిస్సహాయంగా సీటుపై చేరగిల బడిన రాధ కళ్ళలోంచి క్రోధాగ్నిజ్వాలలు జలపాతంలా దూకుతున్నాయి. నర నరమూ జుగుప్సతో కుంచించుకు పోతూ రోమాలు నిక్కబొడుచుకుంటూంటే ఆమె ఆ యిద్దర్నీ మింగేసేలా చూడ్డం తప్ప మరేమీ చెయ్య లేకపోతోంది.

అయిపోతోంది. మరి కొన్ని నిమిషాల్లో తనని ఘోరంగా అవమానించబోతున్నారీ రాక్షసులు. తన జీవితం ముగియబోతోంది. ఎటూ ముగియాల్సిన జీవితమే ఇది. కాని యింత ఘోరమయిన మలుపు తిరగబోతోం దని తను కల్లో కూడ వూహించలేదు.

ఆ భయంకరమైన నిజం తెల్సినప్పుడే యే కత్తితోనో పొడుచుకుని వుంటే ఈ ఉపద్రవం ఎదురయ్యేది కాదు. ఎర్రదిబ్బ గ్రామస్థులకి దొరికిపోయి వాళ్ళ చేతుల్లో

చచ్చిపోయినా ఈ ఉపద్రవం యెదురయ్యేది కాదు.

'భగవాన్! యిప్పటికే ఒక నేరం చేసి మాధవి వ్యక్తిత్వం కూల్చేశావు. సహాయం కోసం గొంతు చిల్లులుపడేలా కేకలు పెట్టినా ఎవ్వరూ ఆదుకోలేని, అవకాశంలేని ఈ నిర్జన ప్రాంతంలో ఈ క్రూర మృగాల అగ్ని కౌగిట్లో పారేసి వినోదం చూస్తూ మరో నేరం చెయ్యకు ..'

ఆమెని ఉలికిపాటుకి గురిచేస్తూ దాదాపు రెండు కిలోమీటర్లు వెళ్ళిన లారీ క్రమంగా వేగం తగ్గసాగింది.

రాధ గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయి. సరైన నిర్ణయం కోసం ఆమె మస్తిష్కం వేగంగా ఆలోచించనారంభించింది.

## 7

గట్టిగా ఏడుస్తున్నాడు సుధాకర్.

పరిసరాల్లో వున్న చెట్లూ పుట్టలకీ చీకటికీ వెన్నెలకీ అతని ఏడుపు స్పష్టంగా వినబడుతోంది. కాని ఓదార్చటానికి వాటికి నోరులేదు.

హృదయాన్ని పిండే ఆవేదన అతని కనుగుడ్లని చీల్చుకుని కన్నీటి రూపంలో స్రవిస్తోంది.

కర్తవ్యం తోచలేదు సుధాకర్ కి. అలా ఏడుస్తూనే వున్నాడు.

నెమ్మదిగా లేచాడు. క్రింద పడ్డప్పుడు బెణికిన పాదం ముందుకి అడుగు వెయ్యనివ్వలేదు. మోకాలి చిప్పలు మంట పెడుతున్నాయి. అప్రయత్నంగా తడుముకున్నాడు. ఆ భాగంలో ప్యాంటు చినిగిపోయింది. వెచ్చని తడి తగిలింది.

అతి కష్టంమీద రెండడుగులు వేశాడు. కనిపించిన

మొక్క తాలూకు ఆకులు తెంపాడు. నలిపి గాయంపై వేశాడు.

భగ్గున మండింది.

పళ్ళ బిగువున బాధని ఓర్చుకున్నాడు.

పులుల చేతికి లేడి చిక్కింది. బ్రతకనిస్తాయా అవి? బ్రతుకుతుందా అది?

రాధది అసలే సున్నిత హృదయం. ఇప్పుడు జరిగిన దారుణాన్నే జీర్ణించుకోలేకుండా వుంది. దానికీ ఘోరం కూడ జరిగితే ఆమె అస్సలు భరించలేదు.

ఆమె ప్రాణం గగనాని కెగిరిపోవడం ఖాయం.

తను ఏకాకిగా మిగిలిపోవడం ఖాయం.

తను మాత్రం యెందుకు బ్రతకాలి? బ్రతికి ఎవర్నుద్ధరించాలి??

బాధల్ని పంచుకునేవారు లేరు. బాధల్లో ఓదార్చేవారు లేరు. వున్న వుద్యోగం కాస్త వూడిపోయినట్టే లెక్క. మూఢాచారాలే వూపిరిగా, పెనువృక్షాల్లా ఎదిగిపోయిన మానవారణ్యంలో మొలకెత్తిన తులసి మొక్కల్లా తాము; అడుగడుగునా ఆపదలు!! క్షణక్షణం మరణ భయం!?

బ్రతికి వున్నా ఒకరి నొకరు తలెత్తి చూసుకోలేని పరిస్థితి!

బ్రతికి, బ్రతికున్న శవాల్లా బ్రతుకీడ్చేబదులు ఈ బ్రతుక్కి ఫుల్ స్టాప్ పెట్టేస్తే—?

సమస్య యిట్టే పరిష్కారమౌతుంది!

దేవుడు చేసిన నేరానికి మనిషి చూపిన పరిష్కారం!!

అసలు దేవుడనేవాడున్నాడా?

తాము యింతకాలం 'దేవుడు' పేరుతో విగ్రహాల్ని పటాలనీ కొలిచి తప్పు చేశారా?

ఆ తప్పుకేనా ఈ శిక్ష?

సమస్యల్ని పరిష్కరించాల్సిన దేవుడే సమస్యల్ని సృష్టిస్తే మానవుడు యెవరితో మొర పెట్టుకోవాలి?

కంచే చేను మేసిన వైనం యిది!

వర్తమానం భూతకాలంలోకి పరుగుతీసింది.

## 8

రంగనాథం నీరసమైన చూపులు అక్కడున్న వాళ్ళని కాసేపు బైటికి వెళ్ళమని శాసించాయి.

గదిలో రంగనాథం, రాధ — యిద్దరే మిగిలారు.

ఆయన కళ్ళల్లో వెలుగు క్రమంగా అంతరిస్తోంది. కనుగుడ్లు క్షణ క్షణానికి తడిని కోల్పోతూ గాజుగోళాల్లా మారిపోతున్నాయి.

వాతావరణం గంభీర మౌనముద్ర దాల్చింది.

రాధ వూపిరి బిగబట్టింది, నాన్న చివరి క్షణాల్లో తనతో యేం చెప్పబోతున్నాడు? ఆ రహస్యాన్ని యిన్నేళ్ళూ ఎందుకు దాచాడు? అంత విలువైన రహస్యమా అది?

ఆ నిశ్శబ్దాన్ని చీలుస్తూ రాధ ఆలోచనల్ని భంగపరుస్తూ రంగనాథం కంఠం నీరసంగా విచ్చుకుంది. హీనమైన పలుకులతో ఆయన పెదవులు కదలాడాయి.

"నువ్వు....నువ్వు....నా కూతురివి కావమ్మా!"

అప్రతిభురాలైంది రాధ. దెబ్బతిన్నట్టు చూసింది రంగనాథం వంక.

"అవునమ్మా...." అన్నాడు రంగనాథం. లేని

శక్తిని కూడదీసుకుని ఆయన చెప్పటం ప్రారంభించాడు.

రంగనాథం చెల్లెలు రూపవతి. పేరే కాదు. మనిషి కూడ రూపవతే!

చదువుకునే రోజుల్లో రూపవతి శేఖరం అనే యువకుణ్ణి ప్రేమించింది. శేఖరం కూడ ఆమెని గాఢంగా ప్రేమించాడు. కాని అవి కులాంతర వివాహాలని సమర్థించని రోజులు కావటంతో, శేఖరం అస్పృశ్యకులస్థుడు కావటంతో, శేఖరం తండ్రి వారి కలయికకి అడ్డు వేశాడు.

కాని శేఖరానికి ప్రేమ విలువ తెలుసు. రూపవతి మనసు తెలుసు. పైగా అతడు చాల పట్టుదల గలవాడు. తండ్రికి తెలీకుండా అతడు తమ రిజిస్టర్ మేరేజికి అన్ని యేర్పాట్లూ చేశాడు.

పెళ్ళి తర్వాత ఆశీర్వాదం కొరకు పూలదండల్లో వచ్చిన నవదంపతులకు శేఖరం తండ్రినుండి తిరస్కారమే ఎదురైంది.

మ్లాన హృదయాలతో కట్టుబట్టలతో యిల్లు విడిచి వెళ్ళిపోయారు శేఖరం దంపతులు. శేఖరం అన్న — యింట్లో వుండికూడ పెదవి కదపలేకపోయాడు.

ఉద్యోగాన్వేషణలో శేఖరం ప్రయత్నాలు త్వరలోనే ఫలించాయి. కాని—

విధివ్రాత మరోలా వుంది.

పెళ్ళయిన ఆర్నెల్లలోనే శేఖరం ఒక రైలు ప్రమాదంలో దారుణంగా మరణించాడు.

రూపవతి నెత్తిన పిడుగు పడినట్లయింది. అరణ్యం లాంటి యీ సమాజంలో ఆమె లేడి కూనలా వణికి పోయింది.

కామాంధుల ఆకలి చూపులు, స్వార్థపరుల దారుణ

కోరికలు ఆమెని భీతహారిణిలా మార్చాయి.

ఇంటికి తిరిగిరావటానికి ముఖం చెల్లక ఆత్మహత్య చేసుకునేదే! కాని ఆ పని చెయ్యలేకపోయింది.

కారణం శేఖరం ప్రతిరూపం ఆమెలో ప్రాణం పోసుకుని వుండటమే!

తల దాచుకుని పుట్టిల్లు చేరిన రూపవతిని రంగనాథం ఆదరించాడు. ఆమెకి ఏ లోటూ లేకుండా చూసుకోనారంభించారు రంగనాథం దంపతులు.

విధి రూపవతి నుండి శేఖరాన్ని కర్కశంగా విడదీసినా ఏ కళనుండి కాస్త జాలి కలిగిందో — పై లోకంలో మళ్ళీ వాళ్ళిద్దర్నీ కలిపింది.

ప్రసవించాక ధనుర్వాతం కమ్మి రూపవతి మరణించింది.

వర్ణాంతర వివాహాలని వెలివేస్తూ అలాంటి దంపతుల్ని నిర్దయగా తరిమివేసే ఆ రోజుల్లో ముక్కుపచ్చలారని ఆ శిశువుకి సంకరజాతి ప్రాణిగా ముద్రపడుతుందని ఆ శిశువుతో ఊరు మారారు రంగనాథం దంపతులు. ఆ శిశువు 'రాధ' పేరుతో రంగనాథం కూతురుగా చెలామణి అయింది.

ఇదంతా విన్న రాధ కనురెప్పలు బరువుగా కొట్టుకున్నాయి. కన్నీటి బిందువులు జలజలా రాలిపోతున్నాయి మేనమామపట్ల కృతజ్ఞతా భావంతో.

మరింత శ్రద్ధతో రాత్రింబవళ్ళు మేలుకుని రంగనాథానికి సపర్యలు చెయ్యసాగింది. అయినా ప్రయోజనం లేకపోయింది.

మూడోరోజు ఉదయం రంగనాథం మరణించాడు.

  

"నీనుకూడ మా అమ్మ అడుగుజాడల్లో నే నడుస్తున్నా ననిపిస్తోంది" అంది రాధ.

బరువుగా నిట్టూర్చాడు సుధాకర్.

"ప్రేమించడం మనిషి హక్కు. అది వారసత్వం కాదు" అన్నాడు సుధాకర్.

"నా జన్మవృత్తాంతం నీకు ముందుగానే చెప్పటం మంచిదని చెబుతున్నాను. ఆలోచించుకుని నీ నిర్ణయం...."

సుధాకర్ చెయ్యి ఆప్యాయంగా రాధ తల నిమిరింది....

"పిచ్చి రాధా! పంతొమ్మిది సంవత్సరాల నాటి మాట చెబుతున్నావు నువ్వు. ఇప్పుడు రోజులు మారుతున్నాయి. యువతరం పిడికిలి బిగిస్తోంది. ప్రభుత్వం సహకరిస్తోంది. వర్ణాంతర వివాహాలని విమర్శించేవాళ్ళని అధిగమిస్తూ ప్రోత్సహించేవారు అధికమవుతున్నారు. అయినా, నవమాసాలు మోసి కన్నతల్లి కులమే సంతానానికీ సంక్రమిస్తుందని పెద్దలంటారు. ఆ రకంగా మనిద్దరిదీ ఒకే కులం. అయినా నా కా పట్టింపులు లేవని నీకు తెల్సు.

"మనిద్దరం ఉద్యోగాలు చేస్తున్నాం. ఒకే స్కూల్లో పని చేస్తున్నాం. పవిత్రమైన ఉపాధ్యాయ వృత్తి మనది. కులాలూ మతాలూ వేరే అయినా మానవులంతా ఒకటే అని పలుకుతున్నాం. విద్యార్థుల చేత పలికిస్తున్నాం. వాళ్ళ మనసుల్లో కులమతాల తారతమ్యాలని రూపుమాపి సర్వమత సమానత్వాన్ని జాతీయ సమైక్యతని ప్రబోధిస్తున్నాం.

"అలాంటి మనలో నీ జన్మ వృత్తాంతం నా మనసుని

మార్చివేస్తుందేమోనన్న సందేహం నీకు. మార్చుకోవాలన్న సంకల్పం వాడు కలిగితే మన వృత్తికి కళంకం ఆపాదించబడినట్టే...."

ఆరాధనాపూర్వకంగా చూసింది రాధ, సుధాకర్ వంక.

కాని రెండు కళ్ళు బుసకొడుతూ ఆ ఇద్దర్నీ చూస్తున్నాయన్న సంగతి ఆ క్షణంలో వాళ్ళిద్దరికీ తెలీదు.

* * *

"మీ పద్ధతి నాకు నచ్చలేదు...." తిరస్కారాన్ని ముఖం నిండా పులుముకుని అన్నాడు సుధాకర్, ఏకాంబరాన్ని చూస్తూ.

"నేనేం చేశాను?" గుటకలు మ్రింగుతూ చూశాడు ఏకాంబరం.

"విద్యార్థులు అమాయకులు. మంచేదో చెడేదో వాళ్ళకి తెలీదు. ప్రతిదాన్నీ అమాయకంగా నమ్మేసే నైజం వారిది. మంచిని గురించి, చెడుని గురించి విపులంగా చెప్పి చెడుని విడనాడి మంచిని అవలంబించమని ఉద్బోధించే ఉద్యోగం మనది. అలాంటి ఉపాధ్యాయ వృత్తిలో వుంటూ.... ఛీఛీ ...మీలో యింత వెధవబుద్ధి వుంటుందని నే ననుకోలేదు...."

ఏకాంబరం కోపంతో రెచ్చిపోయాడు. కసితో పళ్ళు నూరాడు. కాని అతడు బలవంతంగా తమాయించుకున్నాడు.

"ఏం చేశాను?" అడిగాడు బింకంగా.

"సెవెన్తు క్లాసు స్టూడెంటు విపులని క్లాసులు వదిలాక లైబ్రరీలోకి ఎందుకు పిలిచారు?"

"అ....అబ్బే....లైబ్రరీ పుస్తకాలు సర్ది—ఆర్డర్లో

పెడదామని....”

“లైబ్రరీ పుస్తకాలు సర్దటానికి మీకు అమ్మాయే కావల్సొచ్చిందా?”

“అబ్బే....అమ్మాయిలకి ఓపిక ఎక్కువ కదా!” గుట కలు మింగుతున్నాడు ఏకాంబరం.

“కాదు....!!” శక్తికొద్దీ బల్లపై గుద్దుతూ గట్టిగా అర్చాడు సుధాకర్. “లైబ్రరీ పుస్తకాలు కూడా సర్ద లేని మగ స్టూడెంట్సు మన స్కూల్లో ఎవ్వరూ లేరు. ఏదైనా చెబితే ఎగురుతిరుగుతారేమోనని భయపడ్డానికి యిది కాలేజీ కాదు....”

ఏకాంబరంలో తెగింపు వచ్చింది. అతని కళ్ళు క్రమంగా ఎరుపెక్కుతున్నాయి.

“మీరు నన్ను అవమానిస్తున్నారు” ఉక్రోషంగా అన్నాడు ఏకాంబరం.

“కాదు. అమాయకత్వాన్ని స్వార్థానికి వాడుకోటా నికి ప్రయత్నించిన మిమ్మల్ని మందలిస్తున్నాను. హెచ్చ రిస్తున్నాను. నిన్న విపుల నన్ను కలుసుకుంది. అంతా చెప్పింది....”

“ఏం చెప్పింది?” నిర్లక్ష్యంగా తలెగరేస్తూ అన్నాడు ఏకాంబరం.

“మీరు మూడు రోజుల క్రిందట విపులతో చెప్పా రట, మర్రోజు మినీ స్కర్టు వేసుకురమ్మని. మన స్కూలుకి అలాంటి యూనిఫామ్ యేదీలేదు. పైగా అది వాళ్ళ స్వవిషయం. అందులో మీ జోక్యం దేనికి?”

“రోడ్డుని వూడుస్తున్నట్టున్న లంగా వేసుకొచ్చింది. గాలి కడ్డం పడితే ప్రమాదమని వేసుకురమ్మన్నాను. తప్పా?”

"తప్పు కాదు. కాని మీరు ఆ కారణంతో కాదు మినీ స్కర్టు వేసుకురమ్మన్నది. బల్లపై స్టూలు వేసి ఆ అమ్మాయిని యెక్కించి స్టూలు కదలకుండా పట్టుకునే నెపంతో అక్కడ నిలుచుని పైకి చూస్తూ ...ఆమె అండర్ వేర్ లాగటానికి ప్రయత్నించటం, క్రింద నిలుచుని ఆ అమ్మాయి చేతులు పైకెత్తి పుస్తకాలు సర్దుతోంటగా ఆమెపై బడ్డ బూజు దులిపే ప్రయత్నంలో బాహుమూలల్ని వక్షస్థలాన్ని తడమటం.... ఛఛ.... వర్ణించటానికాక్కాదు. వూహించటానికే లజ్జగా, అవమానకరంగా వుంది....

"విపుల వ్రాసియిచ్చిన స్టేట్‌మెంటుని ఎన్‌క్లోజ్ చేసి డియ్యీవోగారికి రిపోర్టు చెయ్యటం ఈ స్కూలు హెడ్మాస్టరుగా నా బాధ్యత. కాని మొదటి తప్పుగా భావించి విడిచిపెడుతున్నాను. స్కూలుకి రావటానికి సిగ్గుపడుతూ మిమ్మల్ని చూడటానికే భయపడుతూ తల్లిదండ్రులకి చెప్పలేక నావద్ద బేలగా రోదించింది పిల్ల. ఈ విషయం వాళ్ళ నాన్నకి చెబితే అతను మిమ్మల్ని హత్య చేసినా ఆశ్చర్యం లేదు. బీ కేర్‌ఫుల్" గంభీరంగా అన్నాడు సుధాకర్.

ఏకాంబరం వదనం నల్లగా మాడిపోయింది. ఆ క్షణంలోనే యెగురుదెబ్బ తియ్యాలని ప్రయత్నిస్తూ అతని పెదవులు విచ్చుకోబోయాయి. కాని సహనాన్ని అరువు తెచ్చుకున్నా డతడు.

వికటంగా మారిన అతని వదనంలో వికృతహాసం లాస్యం చేసింది.

తల వంచుకుని వడి వడిగా అక్కడి నుండి వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి సుధాకర్ గదిలో దొంగతనం జరిగింది. ఇద్దరు దొంగలు నిద్రపోతూన్న అతన్ని అలాగే మంచానికి కట్టివేసి అయిదు వేలు నగదు, బంగారు ఉంగరం, రిస్టువాచి, అలారం గడియారంతో పాటు టేబుల్ డ్రాయర్ వెదికి మరో దాన్ని కూడ పట్టుకుపోయారు.

అది....విపుల వ్రాసిన కాగితం!!

ఎవరు చేయించారో సుధాకర్ కి తెలుసు.

ఋజువు చెయ్యటానికి ఆధారాల్లేవు!

* * *

పిల్లలచే అటెండెన్సు తీసుకుంటోన్న సుధాకర్ జీపు ఆగిన శబ్దం విని తలెత్తి చూశాడు.

డియ్యీవో భరణికుమార్ దిగుతున్నాడు.

ఎదురు వెళ్ళి విష్ చేసి వినయంగా ఆహ్వానించాడు.

సర్ ప్రయిజ్ విజిట్ అది.

అయినా స్టాఫ్ అందరూ వున్నారు. పిల్లలూ వున్నారు.

ఆరో తరగతిలోకి నడిచాడు భరణికుమార్, కానేపయ్యాక.

"దుర్గాచరణనాగ్ కథలోని నీతి యేమిటి?" ఆరో తరగతి తెలుగు పుస్తకంలోంచి ఓ ప్రశ్నని ఓ కుర్రాణ్ని లేపి అడిగాడు.

"పట్టుదల వుంటే కానిది లేదు."

"దుర్గాచరణ్ నాగ్ కాక మరొకరెవరైనా నీకు తెలుసా అలాంటి వ్యక్తి?"

"మా తెలుగు మాస్టారే సర్!"

"గుడ్! ఎలా చెప్పగలవ్?" ప్రశంసాపూర్వకంగా ఒక్కసారి సుధాకర్ని చూసి, మళ్ళీ విద్యార్థివైపు తి

గాడు ధరణికుమార్.

"రాధ టీచర్ కీ మాష్టారుకీ సంబంధం వుంది. స్కూల్లో మాట్లాడుకోటానికి వీల్లేదు కదా! అలాగని మాష్టారు గదిలో కూడ బావుండదు. అందుకని యిద్దరూ అప్పుడప్పుడూ పార్కుల్లో, సినిమాల్లో కల్సుకుంటూ వుంటారు."

సుధాకర్ ముఖం పాలిపోయింది. వెయ్యి ఓల్టుల ఆశ్చర్యాన్ని నింపుకుని డియ్యావో తల సుధాకర్ కేసి తిరిగింది.

విద్యార్థులలో నెమ్మదిగా గుస గుసలు మొదలయ్యాయి.

మౌనంగా 'బి' సెక్షన్ లోకి నడిచాడాయన, ముఖం గంభీరంగా వుంచుకుని.

"రామకృష్ణ పరమహంస చెప్పిన కథ యేమిటి?" ఒక విద్యార్థి నడిగాడు.

"ఇంకొంచెం ముందుకు వెళ్ళు" విద్యార్థి చెప్పాడు.

"గుడ్! అంటే అర్థం విద్యార్థి అయినా ఉద్యోగి అయినా వ్యాపారి అయినా యిప్పుడు చేస్తోన్న కృషిలో ఆగిపోకుండా యింకా యింకా శ్రద్ధతో యింకా పట్టుదలతో యింకా ఉత్సాహంతో మరింత కృషి చేస్తే మరింత ఉన్నత స్థితికి వస్తాడు. లేకపోతే యెక్కడ వేసిన గొంగడి అక్కడే. అంతే కదూ!"

"అవును సార్! మా తెలుగు మాష్టారు రాధ టీచర్ని మొదట రోజుకి రెండుసార్లు పలకరించేవారు. ఆ తర్వాత ఆరుసార్లు. మూణ్ణెల్లయ్యేసరికి యిద్దరూ ఒకే గదిలో కూచుని ముద్దులు పెట్టుకునేవారు. మరో నెలకి కౌగలించుకునేవారు. మరింత కృషి చేస్తే ఆమెకు కడుపు

కూడ తగుండి. లేకపోతే యెక్కడ వేసిన గొంగడి అక్కడే కదండీ!?"

సుధాకర్ మొహంలో నెత్తురుచుక్క లేదు.

ధరణికుమార్ మొహంలో నెత్తురు రంగు ప్రత్యక్షమైంది.

* * *

ఆ గదిలో గంభీరత విలయతాండవం చేస్తోంది.

వంచుకున్న రాధ మొహంలోని నల్లద్రాక్ష పళ్ళ లాంటి కళ్ళలోంచి ఒకొక్క బిందువే రాలుతోంది అవమానం, అశ్రు రూపంలో.

ఆమె మొహం కందగడ్డలాగుంది.

ధరణికుమార్ సూటిగా వాళ్ళిద్దర్నీ చూస్తున్నాడు. ఆయన మౌనంలో గద్దింపు వుంది.

"ఇది అప్పర్ ప్రైమరీ స్కూలు గాబట్టి సరిపోయింది. కాలేజీ అయివుంటే ఈ పాటికి మీ పేర్లు అసభ్యపదజాలంతో కార్టూనులుగా గోడమీద కెక్కేవి. పేపర్లో వచ్చేవి. బాధ్యతాయుతమైన ఉపాధ్యాయ వృత్తిలో వుంటూ దేవతామూర్తుల్లాంటి విద్యార్థుల ముందు శృంగారం వెలగబెట్టడానికి మీకు సిగ్గులేదూ! చెప్పండి. మీ మీద యెలాంటి చర్య తీసుకోవాలి?"

ధరణికుమార్ ఈ మాటలని చాలా సేపైంది. ఇప్పుడాయన సమాధానం కోసం ఎదురుచూస్తున్నాడు.

ఏమని చెప్పగలడు సుధాకర్? తనపై కసితో ఏకాంబరం విద్యార్థులకి చిలకపలుకులు నేర్పించాడని చెప్పగలడా? అతడు చేసిన నేరాన్ని రుజువు చెయ్యగలడా?

చెయ్యగలడు! అందుకొక్కటే మార్గం, క్లాసు నుండి

విపులను పిలిపించి ఆ రోజు జరిగిన విషయాన్ని వెల్లడించమని చెప్పటమే! విపుల చెప్పగలదు. అందువల్ల ఆ పిల్ల భవిష్యత్తును తను ఉరి తీసినట్టే అవుతుంది. పెద్ద పిల్లైనా కాకముందే శృంగారాని కలవాటు పడిందన్న వదంతి ఆ పిల్లని నిలువునా చీరేస్తుంది.

ఏకాంబరం ఎంతకు తెగించాడు?

విద్య నేర్పాల్సిన విద్యార్థులకి విషాన్ని నూరిపోశాడు. సంబంధం — కౌగలింత — కడుపులాంటి పదాలకి అర్థమైనా తెలియని ఆ పసిమనసుల చేత ఆ పదాల్ని పలికిస్తున్నాడు.

ఇలాంటి నేరస్థులని యే చట్టం శిక్షిస్తుంది?

ఏ చట్టానికి అందుతారు వీళ్ళు?

తను, రాధ ప్రేమించుకుంటోన్న విషయం వాస్తవమే! అయితే తామేనాడూ స్కూల్లో గాని స్కూలు ఆవరణలో గాని ప్రేమికుల్లా ప్రవర్తించలేదు. తను హెడ్మాస్టరు. ఆమె అసిస్టెంట్సులో ఒకరు. అంతే!

తమ ప్రేమని చూసి ఓర్వలేక ఆ నాటి అవమానాన్ని భరించలేక విద్యార్థుల్ని ఉసిగొల్పి ఏకాంబరం కసి తీర్చుకుంటున్నాడు.

కొంపదీసి ఏకాంబరమే డియ్యీవోతో తనపై చిలవలు పలవలుగా లేనిపోనివి కల్పించి విజిట్‌కి ఆహ్వానించలేదు కదా! లేకపోతే ఇప్పుడు అర్థాంతరంగా విజిట్ చెయ్యడ మేమిటి?

“సమాధానం మీ వద్ద లేదన్నమాట....” భరణి కుమార్ కంఠం ఖంగున మ్రోగి సుధాకర్ ఆలోచనల్ని చీల్చేసింది.

“క్షమించండి సార్! త్వరలో నేను రాధను

వివాహం చేసుకోబోతున్నాను. ఈ విషయంలో నేరం చేసింది నేను కాదని ఖచ్చితంగా చెప్పగలను. ఎవరు చేశారో కూడ చెప్పగలను కాని నిరూపించలేను. మీరు యెలాంటి శిక్ష విధించినా అనుభవించటానికి సిద్ధంగా వున్నాను" అన్నాడు సుధాకర్ నిశ్చల గంభీర కంఠ స్వరంతో.

మర్నాడే—సుధాకర్ రాధ రిజిస్ట్రారు సముఖంలో దంపతులయ్యారు.

ఆ తర్వాత వారం రోజులకే సుధాకర్ కి ఎఱ్ఱదిబ్బకి ట్రాన్స్‌ఫర్ చేస్తూ ఆర్డర్సు వచ్చాయి. రాధ ఉద్యోగానికి రిజైను చేసింది.

మిత్రులు, శ్రేయోభిలాషులు విస్తుపోయారు.

"ఎఱ్ఱదిబ్బ పనిష్‌మెంటు ప్లేసు అక్కడా అప్పర్ ప్రయిమరీ స్కూలుంది. హెడ్మాస్టరు పోస్టు సంవత్సరం క్రితం నుండీ ఖాళీగా వుంది. చాలా దారుణమైన మూఢాచారా లున్నాయక్కడ. ప్రభుత్వం కూడ విసిగి వేసారి శ్రద్ధ తగ్గించి వేసింది. నియంతృత్వం రాజ్యమేలుతోం దక్కడ. ఊపిరి పీల్చినా వదిలినా తప్పుగా పరిగణిస్తా రక్కడ. అక్కడికి నిన్ను వేశారంటే యిది వారికి పుట్టిన బుద్ధి కాదు. ఎవరో కావాలని వేయించి వుంటారు. కొత్త దంపతులు. మీరు అక్కడికి వెళ్ళటం మంచిది కాదు. పైగా ఆ వూరికి బందిపోట్ల బెడద వుంది" అన్నారు.

సుధాకర్ చలించలేదు. ఈ పని వెనక ఏకాంబరం హస్తం వుందని అతనికి తెలుసు.

ఎఱ్ఱదిబ్బలో అడుగు పెట్టగానే కొందరు గ్రామస్థులు వాళ్ళని చుట్టేశారు. వాళ్ళు భార్యాభర్త అవునా

కాదా, కులమేమిటి వగైరా యక్షప్రశ్నలు శల్యపరీక్షల తర్వాత వారా గ్రామంలో వుండటాని కనుమతించారు.

సంవత్సరం రోజులు సవ్యంగానే గడిచాయి.

* * *

"శ్రీమతి రాధ గారికి,

శుభాకాంక్షలు. మీ ఉనికి తెలుసుకునేసరికి తలప్రాణం తోకకి వచ్చింది. ఎలాగైతేనేం? యిన్నాళ్ళకి తెలుసుకోగలిగాను. మీ బంధువు తాలూకు ఆస్తికి మీకు వారసత్వం సంక్రమించింది. మీరు వెంటనే వచ్చి బంధుత్వం నిరూపించి మీ ఆస్తిని స్వాధీనం చేసుకోగలరు. ఈ ఉత్తరం అందిన వెంటనే దిగువ యిచ్చిన చిరునామాలో నన్ను కల్సుకుని సహకరించగలరు.

ఇట్లు
చక్రధరరావు
అడ్వొకేట్."

రాధకి ఆశ్చర్యం వేసింది. తనకి తల్లిదండ్రులు లేరు. మేనమామ మేనత్త పెంచి పెద్ద చేశారు. ఇప్పుడు వాళ్లు కూడ లేరు. మరి ఈ బంధువు ఎవరు? వారికి తను యెలా తెలుసు? తనకి చెందేలా యెందుకు వ్రాశారు? ఎర్రదిబ్బ చిరునామాకి కవరొచ్చిందంటే ఖచ్చితంగా తనకే.

కనీసం అలాంటి బంధువున్నారని మామయ్యగాని అత్తయ్యగాని ఒక్కసారి కూడ తనతో చెప్పలేదే! మరి కొన్ని క్షణాల్లో అంతిమశ్వాస విడుస్తాడనగా మామయ్య తనతో యేదో చెప్పాలని తహతహలాడారు. ఈ విషయం గురించేనా?

ఇప్పుడేం చెయ్యాలి? ఈ ఆస్తిని తను ఆహ్వానించాలా తిరస్కరించాలా? ఇన్నాళ్ళుగా తాము సుఖంగానే బ్రతుకుతున్నారు. ఈ ఆస్తి తమ జీవితంలో సుడిగుండం సృష్టించదు కదా! ఇప్పటికి ఈ వూళ్ళో రెండుసార్లు బందిపోట్లు దాడి చేశారు. ఉద్యోగుల యిళ్ళలో యేముంటాయనే వుద్దేశంతో కాబోలు — రెండుసార్లు తమ జోలికి రాలేదు. తాము ఆస్తిపరులైనట్టు తెలిస్తే వాళ్ళ దృష్టి తమపైకూడ పడుతుందేమో!

సుధాకర్ స్కూలు నుండి రాగానే ఉత్తరం చేతి కిచ్చి తన అభిప్రాయం చెప్పింది రాధ.

"ఆ బంధువు యెవరో కానీ సినిమా కథలోలా ఈ ఆస్తి సంక్రమణం థ్రిల్లింగ్‌గా లేదూ! డబ్బు సమస్యల్ని సృష్టించవచ్చు. కాని నిజాయితీగల ఆ లాయర్‌ని కల్సి అభినందించాల్సిన అవసరం ఎంతైనా వుంది. అందుకైనా మనం వెళ్ళాలి. ఆస్తి వివరాలు చూసి అందుకోవాలో యే అనాధ శరణాలయానికైనా అప్పగించాలో ఆలోచిద్దాం" అన్నాడు సుధాకర్.

ఆ డబ్బు దారుణమైన సమస్య సృష్టించబోతోందని ఆ క్షణంలో వాళ్ళకి తెలీదు.

* * *

లాయర్ చక్రధరరావు రాధ దంపతుల్ని సాదరంగా ఆహ్వానించాడు. భోజనాలు విశ్రాంతి అనంతరం వారో ప్రత్యేక గదిలో కూచున్నారు.

"చూడమ్మా! నీ పేరు?" సౌమ్యంగా అడిగాడు చక్రధరరావు.

"రాధ...."

"మీ నాన్నగారి పేరు?"

"శేఖరం...."

"ఆయన ఎలా వుంటారు?"

"నాకు తెలీదు సర్! మా నాన్న అమ్మల మొహమైనా నే నెరుగను. నాకు ఊహ వచ్చినప్పటి నుండి మా మేనమామనే తండ్రిగా భావిస్తూ వచ్చాను. ఆయన చివరి రోజుల్లో నాకీ నిజం తెల్సింది."

చక్రధరరావు మొహంలో సంతృప్తి చోటు చేసుకుంది.

"మీ మేనత్తగారి పేరు?"

"నాకు మేనత్త వున్న విషయం తెలీదండీ!"

"మీ మేనమామ పేరు?"

"రంగనాథం."

"వారి భార్య పేరు?"

"పార్వతమ్మ"

"రంగనాథంగారు ఎప్పుడు చనిపోయారు?"

సంవత్సరం, నెల, తేదీలతో సహా చెప్పింది రాధ.

"వ్యాధి?"

"కేన్సర్."

"ఏ కేన్సర్?"

"లంగ్ కేన్సర్."

"రంగనాథంగారికి బ్రతికున్న రోజుల్లో ఒక చెడ్డ అలవాటుండేది. అది యేది?"

"తరచూ గోళ్ళు కొరుక్కునేవారు."

చక్రధరరావు మొహం వెలిగిపోయింది.

"చాలమ్మా! నువ్వు రంగనాథంగారి మేనకోడలివని నిస్సందేహంగా ఋజువైంది" అని, ఆయన వివరంగా చెప్పటం ప్రారంభించారు.

"మీ నాన్న మీ అమ్మని వివాహం చేసుకుని వాళ్ళ

నాన్నగారి వద్దకి వెళ్ళారు. కాని వాళ్ళది వర్ణాంతర వివాహం కావడంతో అక్కడ వారికి ఆశీస్సులు, ఆదరణకి బదులు తిరస్కారమే ఎదురైంది. తనకున్న యిద్దరు కొడుకుల్లో ఒకడు చచ్చాడనుకుంటానని చెబుతూ ఆయన మీ అమ్మ నాన్నల్ని వెంటనే యింట్లోంచి గెంటేశాడు.

"కొంతకాలం గడిచాక ఆయన తను చేసిన పనికి పశ్చాత్తాపపడ్డారు. చిన్న కుమారుడైన మీ నాన్నగారికోసం వెదికించారు. అప్పట్లో మీ ఆచూకీ దొరకలేదు. గత్యంతరంలేక తన పెద్దకొడుకుతో పాటు శేఖరంగారిక్కూడ తన ఆస్తిలో సగం వాటా వ్రాస్తూ శేఖరం తర్వాత ఆ ఆస్తి శేఖరం సంతతికి చెందేలా వీలునామా రాయించారు. మీ తాతగారి తదనంతరం ఆ వీలునామా అమలుపరచే బాధ్యత వారి లాయర్ గా నాకప్పగించారు.

"శేఖరం సంతతిని గుర్తించటం నాకు సమస్య అయింది. ఎందుకంటే వాళ్ళు నాకు తెలియదు. శేఖరం దంపతులు యింట్లో అడుగుమోపిన కొద్ది నిమిషాల్లోనే యిల్లు వదిలిపెట్టి వెళ్ళిపోయారు గాబట్టి శేఖరం ఇంట్లోని వస్తువులు, శేఖరం అన్నయ్య రూపురేఖలు మొదలైన ఆధారాలతో అతని సంతతిని పసిగట్టే అవకాశంలేదు.

"లాయరుగా నాకు కొన్ని పద్ధతులు తెల్సినా యెందుకైనా మంచిదని ఒక ప్రయివేట్ డిటెక్టివ్ సాయం కోరాను. ఇద్దరం కల్సి పరిశోధనకు పూనుకున్నాం.

"మీ నాన్నగారు పెళ్ళయిన కొద్దికాలానికే రైలు ప్రమాదంలో మరణించడం, మీ అమ్మ పుట్టిల్లు చేరటం, నిన్ను ప్రసవించిన వెంటనే మరణించటం, నువ్వు రంగనాథంగారివద్దే పెరగటం, అంగ్ కేన్సర్ తో రంగ

నాథం మరణించటం, నీ వివాహం సుధాకర్‌తో జర గటం, ఏకాంబరం కారణంగా మీవారికి ఎర్రదిబ్బ ట్రాన్స్‌ఫర్ కావటం—అన్నీ మా దర్యాప్తులో తెలి పడ్డాయి.

"రంగనాథంగారికి వేరే సంతానంలేదు. కాబట్టి నువ్వు నువ్వేనని తేలిపోయింది. చాల సంతోషంగా వుంది. ఇన్నాళ్ళకి నా పరిశోధన ఫలించింది. నా కర్త వ్యాన్ని నెరవేర్చబోతున్నందుకు యెంతో తృప్తిగా వుంది. దాదాపు లక్షరూపాయల విలువగల ఆస్తికి వారసురాలివి కాబోతున్నావమ్మా నువ్వు. ఈ సాయంత్రమే మిగత యేర్పాట్లు చేస్తాను" అన్నాడు చక్ర ధరరావు.

• • •

లక్షరూపాయలు కాదు, లక్ష అక్షౌహిణీల సైన్యంతో యిరవైతలల భయంకరమైన రాక్షసి తనమీద పడుతో న్నట్టు ఫీలయ్యాడు సుధాకర్, చక్రధరరావు వీలునామా చదివి విన్పిస్తోండగా.

భూమి వెయ్యి వ్రక్కలై ఆ శకలాలు దివికెగిరి వెయ్యి టన్నుల బరువుతో తన తలపై పడుతోన్నట్టు ఫీలయ్యాడు.

అగ్నిపర్వతమేదో బ్రద్దలై లావాద్రవం తనని నిలువునా ముంచేసినట్టు ఫీలయ్యాడు.

అతని శరీరంలో వణుకు ప్రవేశించింది.

స్వేదంతో దుస్తులు పూర్తిగా తడిసిపోయాయి.

రాధ తండ్రి శేఖరం....

శేఖరం తండ్రి పేరు....గురుమూర్తి!?

గురుమూర్తి పెద్దకొడుకు పేరు కరుణాకరం!

తను—కరుణాకరం కుమారుడు!

మై గాడ్.... మై గాడ్....

రాధ....తన చిన్నాన్న కూతురు!

చెల్లెల్ని పెళ్ళి చేసుకున్నాడు తను!

ఎంత పాపం చేశాడు తను?

తన చెల్లెల్ని తను ప్రేమించి—వివాహంకూడ చేసుకున్నాడు తను! ఇంతకంటే పాపం వేరే వుందా? ఇంతకంటే ఘోరం వేరే ఉందా? ఇంతకంటే నేరం వేరే ఉందా?

ఈ భయంకర నిజం తెలిస్తే రాధ భరించగలదా? జీర్ణించుకోగలదా?

తనకుద్యోగం వచ్చినప్పుడు తాతయ్య దెబ్బలాడాడు, 'నీకుద్యోగం చేసేంతకర్మ ఎందుకు పట్టింది? ఈ పొలాలూ ఆస్థి వ్యవహారాలూ చూసుకుంటూ ఇక్కడేఉండిపో' అని.

ఆ కారణంగా తనకాయింట్లో చుక్కెదురైంది. నాన్న తాతయ్యమాట కెదురు చెప్పలేదు. ఉద్యోగం పురుష లక్షణం అన్న వాదన తనది. తన భావాలు వాళ్ళకి నచ్చవు. వాళ్ళ అభిప్రాయాలు తనకి నచ్చవు. ఆ కారణంగా పోట్లాడి వచ్చేశాడు.

పౌరుషం ఎక్కువ తనకి. ఆ తర్వాత తన వివరాలేవీ తెలియపర్చలేదు.

అప్పుడు తమ లాయర్ దయానిధి. ఇప్పుడు చక్రధరరావు!

మతిపోయింది సుధాకర్‌కి.

ఇంటికి రాగానే బాంబు ప్రద్దలయింది.

సుధాకర్ చెప్పింది విని రాధ కెవ్వున కేక వేసింది.

సుధాకర్ ఓదార్చే ప్రయత్నం చేస్తుండగానే పూరు పగబట్టింది.

# 9

ఏదో శబ్దం వినరావటంతో సుధాకర్ అటు చూశాడు.

వాహనమేదో వస్తోన్న చప్పుడది. విశాలపట్నంనుండి నాయుడు పట్నం వెళుతోన్నట్టుగా శబ్దాన్నిబట్టి అర్థమైంది. రాధని లారీ డ్రయివరు విశాలపట్నంకేసి తీసికెళ్ళాడు. ఇప్పుడీ చప్పుడు నాయుడుపట్నంకేసి దూసుకు వస్తోంది.

ఇప్పుడు తనేం చేయాలి? రాధకోసం ఎదురుచూస్తూ ఇక్కడే కూచోవాలా లేక నాయుడుపట్నం వెళ్ళాలా?

నాయుడుపట్నం వెళ్ళి ఏం చెయ్యాలి?

ఇక్కడుండి మాత్రం ఏం చెయ్యాలి?

రాధ వస్తుందన్న నమ్మకం యెప్పుడో పోయింది.

వాహనం చప్పుడు దగ్గరవుతోంది. లీలగా కనిపిస్తోంది. అది లారీ! హెడ్‌లైట్సులేవు. చూస్తూండగానే అది సుధాకర్‌కి దగ్గరగా వచ్చి ఆగిపోయింది.

బిలబిలమంటూ మనుషులు దిగారు.

వాళ్ళలో రాధకూడ వుంది.

డ్రయివరు క్లీనర్ల మొహాలు అవదం తాగినట్టున్నాయి.

వాళ్ళలో కొందరు సుధాకర్‌ని చుట్టుముట్టి ఒడిసి పట్టుకున్నారు.

వాళ్ళు ఇంతకుముందు రాధని సుధాకర్‌నీ పట్టుకోవడంకోసం చెట్టునీడన మాటువేసి ఉన్నవాళ్ళు. లారీని చూడగానే సుధాకర్ దంపతులు అందులో ఉంటారన్న నమ్మకం కల్గి, లారీని ఆపుచేశారు. రాధ

దొరికింది. సుధాకర్ని గూర్చి అడిగారు. డ్రయివర్ చెప్పకపోయేసరికి చిత్తుగా తన్నారు. వణుకుతూ అసలు సంగతి చెప్పాడు వాడు. లారీని వెనక్కి మరలించారు.

సుధాకర్ చిక్కగానే వాళ్ళ ఆనందానికి మేర లేదు.

కానపూలమ్మ తల్లి కరుణించినట్టే భావించారు.

వాళ్ళ మాటల్నిబట్టి రాధకి యే అఘాయిత్యమూ జరగలేదని స్పష్టమైంది సుధాకర్ కి.

అయితే అంతకంటే భయంకరమైన ఆపద ముందుందని అతనికి తెలుసు.

# 10

పౌర్ణమి!

అదో విశాలమైన గది!

పది—పదిహేనుమంది హడావుడిగా అటూ ఇటూ తిరుగుతున్నారు. వాళ్ళు పరస్పరం మాట్లాడుకోవటం లేదు. మౌనంగానే ఎవరిపని వాళ్ళు చేసుకుపోతున్నారు. మరీ అవసరమైతే సైగలు చేసుకుంటున్నారు.

తెల్లని వెన్నెల గవాక్షంలోంచి గదిలోకి ప్రసరిస్తోంది. ఆ ప్రాంతంలో దాదాపు ఎనిమిదడుగుల నల్లని దేవతా విగ్రహం నిశ్చలంగా నిలబడి వుంది.

విరబోసిన జుట్టు. అరచెయ్యి సైజులో ఎర్రని కుంకుమ నుదుట మెరుస్తోంది. కనుగుడ్లు ఎరుపు రంగుని పొదువుకుని భీతిని గొలుపుతున్నాయి. భయంకరంగా తెర్చుకుని ఉన్న ఎర్రని నోట్లోంచి ఏనుగుదంతాలకి మల్లే రెండు పొడుగాటి కోరలు—చిన్న పిల్లలు చూస్తే గుండెలవిసి చచ్చేంత భయాన్ని గొల్పుతోన్నాయి. కోరల మధ్య మానవ కపాలం యిరుక్కుని ఉంది. పొడుగాటి

నాలిక బైటికి సాగివుంది.

మెడలో కపాలాల మాల! జబ్బలకీ కపాలాల మాలలు చుట్టబడి ఉన్నాయి. ఎడమ చేతిలో శూలాన్ని పోలిన ఆయుధం. కుడిచేతిలో మరో పుర్రె!

ఆమే కానపూలమ్మ దేవతా విగ్రహం!

ఆమె పాదాల ముందర పెద్ద పెద్ద పళ్ళేలలో పసుపు, కుంకుమ, విభూతి___రాశులు పోసి ఉన్నాయి. విగ్రహానికి ఇరువైపులా రెండు కాగడాలు మందంగా వెలుగుతున్నాయి.

గదంతా జిడ్డువాసనతో కూడిన అదోరకమైన వాసన!

విగ్రహం పాదాలకు ముందరి భాగంలో నేలమట్టానికి బెత్తెడు యెత్తుగా భూమిలోకి దిగ్గొట్టబడిన వధ్యశిల!

అటూ యిటూ తిరుగుతోన్న మనుషుల మోహాలు నిశ్చలంగా, నిర్వికారంగా నిర్వేదంగా ఉన్నాయి. ఆ మొహాల్లో కాంతిలేదు. మలినంలేదు!

ఒక ఆచారాన్ని పాటిస్తోన్న వాళ్ళలా, ఒక సంప్రదాయానికి పట్టంగట్టి దాని యేలుబడిలో మనుగడ సాగిస్తోన్న వాళ్ళలా యాంత్రికంగా తమ పనులు చేసుకుపోతున్నారు.

నాగరికతకి నిలయమైన మన సమాజంలో___యింకా చెప్పాలంటే నాగరికత విశృంఖలమై వెర్రితలలు వేస్తోన్న ఈ సమాజంలో ఆదిమజాతి నాగరికతకి అద్దంపడుతూ ఆ వాతావరణం!

గుళ్ళనీ గోపురాల్ని ప్రభుత్వం స్వాధీనం చేసుకొని యిష్టం వచ్చినట్టు పాలిస్తోన్నా తను మాత్రం వాటన్నిటికీ అతీతంగా ఈ ఎర్రదిబ్బ గ్రామం పొలిమేరల్లో రహస్యంగా ఉన్న ఈ గదిలో ఇంకా ఈనాటి

వగతూ నరబలులు స్వీకరిస్తూ ఎర్రని చిక్కని మానవ రక్తంతో నాలిక తడుపుకుంటూ ఆ నాలికని మూరెడు పొడుగున చాచి—మరింత రక్తాన్ని ఆహ్వానిస్తూన్న కాన పూలమ్మ విగ్రహంలోని తలభాగం — వెలుగుతోన్న కాగడాల కదలికల వెలుగునీడలు ముఖంపై ప్రసరింప చేస్తూండగా మరింత భీకరంగా అగుపిస్తోంది!

రెండురోజులుగా తిండిలేక బందీలుగా స్తంభాలకి కట్టబడి ఉన్నారు రాధ, సుధాకర్ లు.

వెన్నెల—గవాక్షంలోంచి లోనికి ప్రవేశించిన పిండి లాంటి వెన్నెల—నెమ్మదిగా విగ్రహం పాదాలకేసి జరుగుతోంది.

ఇద్దర్నీ బంధవిముక్తుల్ని చేశారు. రాధని కొందరు, సుధాకర్ ని కొందరు చెరోవైపుకి తీసికెళ్ళిపోయారు.

రాధని పద్మాసనం వేయించి కూర్చోబెట్టారు. మట్టి కడవలతో పదకొండు కడవల నీరు ఆమెపై గుమ్మరించి స్నానం చేయించారు. కట్టుకున్న దుస్తులు — సభ్యతకి భంగం వాటిల్లకుండా విడిపించి పసుపు బట్టలు ధరింప చేశారు. శరీరమంతా పసుపు రుద్దారు. కంఠంనుండి మోకాళ్ళవరకూ దుస్తులు కనిపించకుండా వేపమండలు ధరింపచేశారు. పసుపుతాటికి పసుపుకొమ్ము కట్టి మెళ్ళో వ్రేలాడదీశారు. నుదుట కుంకుమబొట్టు పెట్టారు.

జరుగుతున్న దేమిటో తెల్సు రాధకి. జరగబోయే దేమిటో కూడ తెలుసు. అయినా ఆమె భయంతో అరవటంలేదు. గింజుకోవటంలేదు. 'ఈ' అలంకారాలు చేయించుకోనని మొరాయించటంలేదు. కదిలే శిల్పంలా, నడిచే యంత్రంలా ప్రవర్తిస్తోంది. ఆమె ముఖంలో యే భావమూ లేదు. ఆ కళ్ళలోంచి ఒక్క చుక్క కూడ నీరు

రావటం లేదు.

నెమ్మదిగా ఆమెని నడిపించుకుంటూ వచ్చారు.

వధ్యశిల ప్రక్కన సున్నపు పట్టెలు పెట్టిన చిన్న మట్టి ముంత వుంది. అందులో యేముందో—కన్పించటం లేదు. దాని కంఠానికి మాత్రం పసుపుకొమ్ముని, తమల పాకుల్ని ముడివేసిన పసుపు దారం ఆభరణంగా ఉంది. ఈ బలి ప్రక్కన తళతళా మెరుస్తోన్న కత్తి ఉంది.

నెన్నెల వధ్యశిలకి కేవలం రెండంగుళాలదూరంలో ఉంది. అది సరిగ్గా వధ్యశిల మీదికి చేరిన వెంటనే వీళ్ళకి ఆయువు తీరిపోతుంది. ఒకరి తర్వాత ఒకర్ని నేలపై బోర్లాపడుకోబెడతారు. గడ్డం వధ్యశిలపై ఆనాలి. కత్తి తీసుకుని కానపూలమ్మ దేవతని మనసారా మూడుమార్లు తలచుకుని ఒకే వ్రేటుతో తల తెగనరుకుతారు.

....అలికిడికి నెమ్మదిగా తలెత్తింది రాధ. దాదాపు అదే అలంకారాల్లో సుధాకర్‌ని తీసుకువస్తున్నారు.

ఒక్కక్షణం ఇద్దరి చూపులూ కల్సుకున్నాయి.

కాని ఆ కళ్ళలో సంకేతంలేదు. సందేశంలేదు. సంక్షోభం లేదు.

తాము మృత్యువుకి అంగుళం దూరంలో ప్రయాణం చేస్తూనే ఉన్నారు. నేలపై యెంతదూరం పరుగెత్తినా ఆకాశంలోని చంద్రుడు చేరువలోనే కన్పించినట్టు ప్రతి గండమూ తప్పినట్టే తప్పి—కప్పుకుంటూనే ఉంది. ఇది చివరి మజిలీ!

ఇప్పుడు బ్రతికినా తర్వాతైనా చావాల్సిందే!

ఆ చావేదో—ఈవిధంగా వరించబోతోంది.

భరించక తప్పదు.

నాలుక్కళ్ళూ చప్పున నేలవైపుకి వాలిపోయాయి.

వెన్నెలవైపు చూశాడొకడు. వధ్యశిలకి అంగుళం దూరంలో వుంది.

క్షణాలు గడుస్తున్నాయి. నిశ్శబ్దం రుద్రతాండవం చేస్తోంది.

ఎవరి గుండె చప్పుడు వారికే వినిపించేంతటి నిశ్శబ్దం!

అలాంటి సమయంలో___

హఠాత్తుగా పెద్ద అలజడి ప్రారంభమైంది. పది పదిహేనుమంది గట్టిగా కేకలు వేసిన చప్పుడు! గుర్రపు డెక్కల మోత!

పెద్ద శబ్దంతో గదితలుపులు తెరుచుకున్నాయి.

బిలబిలమంటూ నలుగురు వ్యక్తులు గుర్రాలపై లోపలికి దూసుకు వచ్చారు.

పిస్తోళ్ళు గురిపెట్టారు.

గదిలోని వారి గుండెలవిసిపోయాయి!

బందిపోట్లు!

కాలు కదిపితే కాల్చేస్తారు!

పెదవి విప్పితే పాతేస్తారు!

శిలా ప్రతిమల్లా నిల్చుండిపోయారు.

"వూరు దోచుకున్నాం. కల్లు కావాలి ఎక్కడ?" రుద్రుడిలా అడిగాడు వారిలో ఒకడు.

భయంగా ఓ మూల చెయ్యిపెట్టి చూపించాడు వారిలో ఒకడు.

ఇద్దరు పాటిమనుషుల్ని___ఆ ఇద్దర్లో ఒక ఆడదాన్ని- అబలని బలిపశువుగా అలంకరించి మరి నాలుగు నిమిషాల్లో వాళ్ళ తలల్ని నిర్దాక్షిణ్యంగా వేరుచేసి కాఃపూలమత్త దేవతకి నైవేద్యంగా పెట్టడంకోసం కత్తి పట్టడానికి

సిద్ధంగా వున్నవాడిలో ప్రాణభయం!

కల్లుముంతలు తీసుకున్నాడు బందిపోట్లలో ఒకడు. అందరికీ అందించాడు. కిందా మీదా పోసుకుంటూ తాగారు. వాళ్ళలో ఒకడి దృష్టి రాధపై పడింది. మరొకడి దృష్టి సుధాకర్ పై పడింది.

ఇద్దర్నీ పట్టుకుని జేపమండలు పట్టుకుని లాగారు. ఇద్దర్నీ వాహనాలపై యెక్కించుకున్నారు. కాసేపు పిచ్చిగంతులు వేశారు. చిందులు తొక్కారు. గదిలోని వాళ్ళ ఆభరణాలు ధరించారేమోనని ఒకడు అందర్నీ చెక్ చేశాడు. రెండు ఉంగరాలు దొరికితే లాక్కున్నాడు. పిచ్చిపాటలు పాడుతూ గుర్రాలెక్కారు. మరుక్షణం అవి శరవేగంతో కనుమరుగైపోయాయి.

ఆచారాన్ని పవిత్రంగా పాటిస్తున్నామని రొమ్ములు చరచుకుంటూ గర్జించే ఆ నరరూప రాక్షసులతోబాటు నోటిదగ్గరి ఆహారం దూరమవుతున్నా గుడ్లప్పగించి విగ్రహం లాగే ఉండి పోయింది కానవూలమ్మ దేవతా 'విగ్రహం!'

# 11

"స్నానం చేసి దుస్తులు మార్చుకోండి" అన్నాడతడు.

తెల్లవారటానికింకా దాదాపు గంటన్నర వ్యవధి ఉంది. విపరీతంగా చలివేస్తోంది. నాయుడుపట్నం రూట్ లో ఎర్రదిబ్బకి దాదాపు పాతిక కిలోమీటర్ల దూరంలో ఉన్న యేదో ఊరది. అడ్డదారిలో ప్రయాణించటంతో ఖచ్చితంగా యే ఊరో తెలీటంలేదు. పచ్చని పొలాలు సస్యశ్యామలంగా కనిపించాయి.

ఊరిబైట ఓ పాడుపడిన భవనం ఉంది. అది ఎవరో జమీందారుదని చెప్పుకుంటారు. దాని ప్రక్కనే పెద్ద పెద్ద కొండలు ఉన్నాయి. అక్కడ సహజమైన సన్నని

జలపాతం ఉంది.

ఇద్దరిముందరా పొడిబట్టలూ తువ్వాళ్ళూ పడ్డాయి. మంత్రముగ్ధుల్లా నడిచారు. తోడుగా ఒకడు వెంట రాగా జలపాతం కేసి నడిచారు. ఎముకల్ని కొరికివేస్తోన్న చలిలో వారు నిర్లిప్తంగా స్నానాలు ముగించారు. ఆలోచించే శక్తి వాళ్ళ మస్తిష్కాలు యెప్పుడో కోల్పోయాయి.

మరో రూపంలో మృత్యువు వరించబోతోంది. అంతే!

భవనంలో ఓ గది కాస్త శుభ్రంగా ఉంది. గోడలకి కాగడాలు వెలుగుతూ వ్రేలాడబడి ఉన్నాయి.

నేలమీద నెగడు మండుతోంది.

రెండు పళ్ళెల్లోనూ నిప్పుల్లో కాల్చి ఉప్పూ కారం చల్లిన కోడి మాంసం స్పష్టంగా కనిపిస్తోంది.

ఆశ్చర్యంగా బందిపోటు కేసి చూశారు సుధాకర్ దంపతులు.

"నన్ను గుర్తించలేదా మాష్టారూ!" ముసుగు తీసేశాడతడు.

"గోపన్నా.... నువ్వు.... నువ్వు.... ...." ఆశ్చర్యంతో నోట మాట రావటంలేదు సుధాకర్ కి.

"బందిపోటును మాత్రం కాదు మాష్టారూ! అసలు బందిపోట్లు పట్టుబడ్డారో చచ్చిపోయారో తెలీదు గాని దాదాపు సంవత్సరం నుండీ బందిపోటు వేషంలో మా వూరి మూఢనమ్మకాలని పట్టుకుని వ్రేలాడుతోన్న మనుషులకి వెన్నుపోటు పొడుస్తూ బందిపోట్లుగా నమ్మించటానికి అప్పుడప్పుడూ నిజంగానే దోపిడీలు చేస్తూ పరోక్షంగా మళ్ళీ వాళ్ళకే ఖర్చుపెడుతూ వాళ్ల సొత్తుని మళ్ళీ వాళ్ళకే ముట్టజెబుతూ ఈ మూఢాచారా

లన్నీ ఖండిస్తూ నిర్మూలించడానికి ప్రయత్నిస్తోన్న రెండవ పక్షం ప్రతినిధులకి నాయకుణ్ని.

మిమ్మల్ని బంధించి బలి యివ్వబోతున్నట్టు మావాళ్ళు చెప్పారు. మీ కోసమే ప్రస్తుతం ఈ వేషంలో వచ్చాం. తర్వాత తీరిగ్గా మాట్లాడవచ్చు. ఆకలితో వున్నారు. ముందు అవి తినండి" అన్నాడు గోపన్న.

## 12

"మీ కంటే ఎక్కువగా నేను చదువుకొని వుండవచ్చు. కాని మీకు చెప్పేంతవాణ్ని మాత్రం కాదు. మాస్టారూ మీరూ చదువుకున్నారు. అక్కా! మీరు కూడ చదువుకున్నవారే! మీ ఈ నిర్ణయం మాత్రం సమంజసంగా లేదు."

"అంతకంటే యేం చెయ్యాలి గోపన్నా! తెలియక కట్టుకున్నా తెలిసి తెలిసి చెల్లెలితో కాపురం చెయ్యమంటావా!? రాధ కిప్పుడు మూడో నెల. పిండం గట్టిదై రేపు శిశువుగా భూమ్మీద పడితే వాడి గతి యేమిటి? అన్నదమ్ముల సంతానం కావడంతో మా వివాహం చెల్లదు.

చెల్లని పెళ్ళి ఫలితంగా పుట్టిన సంతానం సంఘం దృష్టిలో అక్రమ సంతానం క్రింద లెక్క కాదా!? శిశువుకి తల్లిదండ్రులమైనా మేం అన్నాచెల్లెళ్లం! రేపా శిశువు పెరిగి పెద్దయి రాధని అమ్మా అనీ నన్ను నాన్నా అని పిలిస్తే మా మనసులు క్షోభతో కుమిలిపోవా!? ఆ శిశువుకి సంఘంలో గౌరవప్రదమైన స్థానం లభిస్తుందా?"

"అందుకని యిద్దరూ ఆత్మహత్య చేసుకుంటారా?" గోపన్న సూటిగా ప్రశ్నించాడు,

"మరో మార్గం యేముంది గోపన్నా!?" వెక్కిళ్ళ మధ్య అంది రాధ. ఏడుస్తూనే. "ఈ దుర్భర నిజం తెల్సిన క్షణం నుండీ ఆయన మొహం చూడటానికే సిగ్గుగా వుంది. వారి జీవితంలోకి రాహువులా ప్రవేశించాను పాపిష్టిదాన్ని. నేను తారసపడకుండా వుండి వుంటే వారు మరో అమ్మాయిని చేసుకుని సుఖంగా వారు...."

"రాధా...." ఆర్తిగా అన్నాడు సుధాకర్.

"అవునండీ! తాళి కట్టించుకుని జీవితంలో, తనువులో సగం భాగం పంచుకున్నందుకు మిమ్మల్ని 'ఏమండీ' అని పిలవాలా లేక స్వయంగా పెదనాన్న కొడుకైనందుకు అన్నయ్యా!? అని పిలవాలా!? అనుక్షణం ఈ సందిగ్ధంలో నలిగిపోతూ ఈ సంఘర్షణతో కుమిలిపోతూ పరస్పరం చూసుకుంటూ యెలా మనుగడ సాగించగలం?

నన్ను క్షమించండి. ఈ విషయం మీతో చెప్పి క్షమాపణ కోరుకుని మీ జీవితం నుండి, నా జీవితం నుండి నిష్క్రమించాలనే ఆగిపోయాను. ఆ క్షణాల కోసమే ఈ ప్రాణాలని బలవంతంగా నిలుపుకున్నాను. లేకపోతే ఈ నిజం నాకు తెల్సిన అరగంటకే ఎర్ర దిబ్బలో మనింట్లోనే నిశ్చలంగా నిలబడి గ్రామస్థుల కర్ర దెబ్బలకి బలి అయివుండేదాన్ని. నా కోరిక నెరవేరింది. గోపన్నా! దయచేసి నన్నాపకు...." భోరుమంది రాధ.

"అక్కా! మనిషి తన ప్రాణం తను తీసుకోవటం కూడ నేరమే! అలాంటప్పుడు నీ కడుపులో పెరుగుతోన్న మరో ప్రాణిని కూడ చంపే అధికారం నీ కెవరిచ్చారు?"

"దేవుడంటూ వుంటే వాడు. మమ్మల్ని మేము పరి

చయం చేసుకునే అధికారం యిచ్చాను. పరస్పరం ప్రేమించుకునేందు కనుమతిస్తూ అధికారం యిచ్చాడు. వివాహం చేసుకునేంచు కధికారం యిచ్చాడు. కడుపులో నలుసుని పొదుపుకునేందు కధికారం యిచ్చాడు. ఇప్పుడూ అధికారం యిస్తాను. యివ్వాలి. యిచ్చే తీరాలి."

"ఇవ్వకపోతే?"

"కంటబడితే ఆ దేవుణ్నైనా సరే-చంపిపారేస్తాను. నేరాలు చేసే మనుష్యుల్ని చూస్తూ వినోదించడమే కాకుండా మనుష్యులచేత స్వయంగా నేరాలు చేయించి కూడా వినోదిస్తాడా? అసలు దేవుడనేవాడే వుంటే యిది వాడు చేసిన నేరం కాకపోతే వాడి ఆజ్ఞ లేనిదే కథ యింతవరకూ వస్తుందా? చెప్పు గోపన్నా!!?"

"పిచ్చి అక్కా! సమస్యని సృష్టించిన దేవుడు పరిష్కారం చూపకపోతాడా? విజ్ఞులమై ఆలోచించాలి గాని! దేవుడు చేసిన నేరానికి దేవుడే పరిష్కారం చూపబోతున్నాడు. మీరు ఇస్లాముమతం స్వీకరించండి" చివరి వాక్యాల్ని గంభీరంగా పలికాడు గోపన్న.

అప్రతిభులై గోపన్నకేసి చూశారు రాధ. సుధాకర్ లు.

"అవును...." అదే గాంభీర్యంతో పలికాడు గోపన్న. "మీ విషయం నా చెవిని సోకిన వెంటనే నేను లాయర్ని సంప్రదించాను. వారు యిచ్చిన సూచనే యిది. ఆ తర్వాత ఇస్లాం మతగురువుల్ని మౌలిసాహెబ్ని కలిశాను. సహజంగా కాక ఒక తప్పును కప్పిపుచ్చుకోవాలనే సంకల్పంతో మతం స్వీకరిస్తే అది ఆక్షేపణ కాని అభ్యంతరం కాని అవుతుందా అని. అంతరంలో స్వచ్ఛ

తని నిలుపుకొని అంతర్యాన్ని అల్లాపై కేంద్రీకరించి మనః పూర్వకంగా మత స్వీకరణకి అంగీకరిస్తే యెవరినైనా ఇస్లాం మతం ప్రేమగా అక్కున చేర్చుకుంటుందని తెలియజేశారు.

"మాస్టారూ! మీరు ఉపాధ్యాయులు. 'కులాలూ మతాలూ ఒక్కటైనా మానవత్వ మొక్కటే మన అభిమతం' అని విద్యార్థిలోకానికి చాటిచెప్పినవారు, చాటి చెప్పాల్సినవారు.

"స్త్రీ పురుష సంపర్కంలోని వావివరసలు, సంబంధాలు, నిషేధాలు వేర్వేరు మతాల్లో భిన్నంగా వుండొచ్చు. ఒక మతంలో తప్పు మరో మతంలో ఒప్పు కావచ్చు. మీ వరస మన మతంలో నిషిద్ధమని నే నంగీకరిస్తాను. కాని ఇస్లాం మతంలో సమర్థనీయమే! అది వివరంగా మరోసారి విశదీకరిస్తాను. అసలు మన మతంలో కూడ యెందుకు నిషిద్ధమైంది? చెబుతాను వినండి.

"మన మతంలో వివాహ వ్యవస్థ యిలా వుంది: మనలో తల్లి అక్కకొడుకుని గాని కూతుర్ని గాని చేసుకోవటం- సైంటిఫిక్ రీజన్సుని ప్రక్కకి పెడితే ఆమోదయోగ్యమే కాక ఆనందదాయకం కూడ! కాని తండ్రి సోదరుని కొడుకుని చేసుకోవటం నిషిద్ధమే కాదు, చట్టవిరుద్ధం కూడ!

"తండ్రి తమ్ముడు రక్తబంధం అయినప్పుడు తండ్రి చెల్లెలు మాత్రం రక్తబంధం కాదా!?

"అయితే యిక్కడో మెలిక వుంది!

"మన దేశంలోని పల్లెల్లో పూర్వం నుండీ ఉమ్మడి కుటుంబ వ్యవస్థ సాగుతోంది. అందువల్ల ఒకే యింట్లో అన్నదమ్ములు, వారి సంతానం కలిసివుంటారు. వాళ్ళలో

ఎదిగిన ఆడపిల్లలు, మగపిల్లలు పరస్పర శారీరక ఆకర్షణలకి లోనై అనర్థాలు జరక్కుండా నివారించటం కోసం సోదరుల సంతానం మధ్యవున్న సంబంధం అన్నాచెల్లెళ్ల అనుబంధమని పెద్దలు నిర్ణయించి ఆ బాంధవ్యం గురించి పిల్లల మనసుల్లో ఆ భావన బాల్యం నుండీ నాటుకుపోయేలా నూరిపోశారు. నూరిపోస్తారు. అందువల్ల వారి మధ్య లైంగిక వాంఛ కలగటానికీ వివాహప్రసక్తికీ తావు లేదు.

"అదే తండ్రి చెల్లెలు చూడండి. ఆమె అత్తారింటికి— మరో ప్రాంతం వెళ్ళిపోతుంది. ఆమె సంతానం, తండ్రి సంతానం ఒకేచోట పెరగరు కాబట్టి వారి మధ్య యిలాంటి అనర్థాలు జరిగే వీలులేదు. పైగా బాల్యం నుండీ ఒకరినొకరు ప్రతిరోజూ చూసుకునే వీలులేదు గాబట్టి మేనత్త సంతానాన్ని పెళ్ళి తంతుకి సమర్థించారు.

"మీరు అన్నదమ్ముల సంతానమైనా మీరు పరస్పరం తొలిసారి చూసుకోగానే ఆకర్షించబడ్డారు. ఎందుకు? మీరు బాల్యం నుండీ ఒకేచోట పెరగలేదు గాబట్టి. అలాగని లోకంలోని అన్నాచెల్లెళ్ళని వివాహానికి ప్రోత్సహిస్తున్నానని భావించకండి. మీ కొచ్చిన సమస్యని సామరస్యంగా విడదీస్తున్నానంతే!

"కాబట్టి దీన్ని దేవుడు చేసిన నేరంగా పరిగణించి దేవుణ్ని తిట్టి మిమ్మల్ని మీరు తిట్టుకుని ఆత్మహత్య లాంటి సాహసాలకి పూనుకుని మూడు ప్రాణాలని బలి పెట్టక, దేవుడు చూపిన మార్గంగా భావించి సాగిపొండి. తెల్లవారితే శుక్రవారం. మహమ్మదీయులకు పవిత్రమైన రోజు. నాయుడు పట్నంలో మిమ్మల్ని ఆదరించి

అక్కడన చేరుకుని నేందుకు ఆహ్వానిస్తూ పెద్ద మసీదులో మౌలానా ఆత్రంగా ఎదురుచూస్తున్నాడు. ఏర్పాట్లన్నీ చేసివచ్చాను.

"ముందుగా మతం స్వీకరించండి. ఆ తర్వాత ఆ మత పద్ధతి ప్రకారం వివాహం చేసుకోండి. మీ కుటుంబంలో నిత్యమూ శాంతికపోతం ఎగుర్తూ వుంటుంది. మీకు జన్మించబోయే శిశువు ఔరసుడవుతాడు. దాంపత్య జీవితంలో మీ నిర్ణయం యెలావున్నా అక్కడకు సంక్రమించిన ఆస్తితో మీ బాబుకి ఉజ్వల భవిష్యత్తు కల్పించండి. ఆత్మహత్య గురించి ఆలోచించమని నాకు మాట యివ్వండి...." చెయ్యి చాపాడు గోపన్న.

మంచిని బోధించడానికి ఉపాధ్యాయుడే కానక్కర లేదు.

మంచిని గ్రహించడానికి విద్యార్థే కానక్కరలేదు.

నాలుగు కళ్ళలోంచీ రాలిన నాలుగు అశ్రుబిందువులూ విడివిడిగా ఆ అరచేతిలో పడి ఒకటిగా కలిసిపోయాయి.

ఆ నాలుగు అడుగులూ నాయుడు పట్నంవైపుకి సాగిపోయాయి.

దగ్గరి పల్లెలోంచి నమాజు మైకులో లీలగా విన్పిస్తోంది....

—: అయిపోయింది :—

సీరియల్

వి.యస్.రావ్



(గత సంచిక తరువాయి)

ఉదయం పది దాటింది.

క్రైమ్‌బ్రాంచ్ చీఫ్ ఆత్మారామ్ తన యెదురుగా కూచున్న మనోజ్‌ని చిరునవ్వుతో చూశాడు. కానిస్టేబుల్ రెండు కప్పుల్లో టీ పోసి, ఇద్దరిముందూ పెట్టాడు.

"గిరీ, మళ్ళీ నేను తిరిగి వచ్చేదాకా యెవర్నీ లోపలికి రానీయొద్దు. నువ్వుకూడా రావొద్దు!" చీఫ్ ఆత్మారామ్ ఆజ్ఞాపించాడు.

"యస్సర్!" అంటూ కానిస్టేబుల్ గిరి తలుపు మూసుకుంటూ గదిలోంచీ నిష్క్రమించాడు.

కరోనా సిగార్ వెలిగించి ఆత్మారామ్ టీ కప్పు అందుకున్నాడు. ఒకసారి చప్పరించి కప్పుని కిందపెట్టి

మనోజ్ వైపు చూశాడు. అతని చుట్టూ సిగార్ పొగ పల్చటి మేఘం లా అలుముకుంది.

"మనోజ్, జయసింహా గారి సిఫార్సుకి విలువ ఇస్తూ ఐజీగారు నీకు సహాయం చేయమన్నారు. ఇలాంటివి నాకు నచ్చకపోయినా, ముక్కుకి సూటిగా వెళ్ళే ఇద్దరు పెద్దమనుషుల అంచనాని నిర్లక్ష్యం చేయడం ఇష్టంలేక నేను అంగీకరించాను...."

"థాంక్యూ సర్!" మనోజ్ వినయంగా అన్నాడు.

చీఫ్ ఆత్మారామ్ పొగని చుట్టకొసమీదికి ఊదుతూ అతన్ని సూటిగా చూశాడు.

"నీ విషయంలో జయసింహా గారి అంచనా తప్పలేదని రాత్రి నువ్వు చేసిన అడ్వెంచర్‌తో రుజువైంది. అయితే డాక్టర్ సంజీవరావు స్టేట్‌మెంట్ కొంతవరకే నీకు—ఐ మీన్ మనకు—ఉపయోగిస్తుంది. దాని ప్రకారం మీ అన్నయ్య గీతమీద అత్యాచారం చేయలేదని మాత్రం మనం రుజువు చేయొచ్చు. ఆమెని హత్య చేయలేదని నిరూపించలేం..." చీఫ్ ఆత్మారామ్ ఆగి, టీ తాగేశాడు.

మనోజ్ మౌనంగా వింటున్నాడు.

"తరవాత—కరుణాకర్ తన భార్యకి విషప్రయోగం చేయలేదనీ మనం నిరూపించలేం. ఎవరో ఇద్దరు వ్యక్తులకి డాక్టర్ సంజీవరావు సైనైడ్ ఇచ్చినంతమాత్రాన, వాళ్ళు మీ వదినకి దాన్ని తాగించారని మనం టెక్నికల్‌గా రుజువు చేయలేం...."

"మా అన్నయ్య వదినచేత హార్లిక్స్ తాగించేముందు అందులోకి ఆ వ్యక్తులు సైనైడ్ కలిపివుంటారు. ఇదే ఖచ్చితంగా జరిగింది. ఒక పొడుగాటి వ్యక్తికీ ఒక పొట్టి వ్యక్తికీ తనని ఇంట్లోంచి దౌర్జన్యంగా తీసికెళ్ళినట్టు

అన్నయ్య కోర్టులో చెప్పాడు!" మనోజ్ ఉద్రేకంతో అన్నాడు.

"నీ రీజనింగ్ ని నేను నమ్ముతాను. అంతే జరిగి వుంటుంది. అంతే జరిగింది అనీ ఒప్పుకుందాం. కానీ నమ్మకం ఒక్కటే మనకు చాలదు!" చీఫ్ ఆత్మారామ్ నవ్వుతూ అన్నాడు.

మనోజ్ అతన్ని బలహీనంగా చూశాడు. "సార్, అయితే ఏం చేయమంటారు?"

"ఏం చేయమనీ నేను చెప్పను. నువ్విచ్చిన క్లూస్ ప్రకారం దీని వెనక ఎవరున్నారో మనకి తెలుస్తోంది. మేం ఆ వ్యక్తి మీదకి మాకి ఏదో చేయలేం. మన చేతిలో వున్న జల్లెడలో నీళ్ళని ఉంచలేం!"

"యూ ఆర్ కరెక్ట్ సార్ ...." మనోజ్ మెల్లగా అన్నాడు. "నిజాన్ని నిలబెట్టే ఆధారాలకోసం ప్రయత్నిస్తాను...."

మనోజ్ లేచాడు. చీఫ్ ఆత్మారామ్ అతన్ని సానుభూతితో చూశాడు.

"గుడ్ లక్!"

"థాంక్యూ సర్" మనోజ్ సెల్యూట్ చేసి వెనక్కి తిరిగి, గుమ్మం ముందుకు నడిచాడు.

"మనోజ్ ...."

మనోజ్ తిరిగి, చీఫ్ ఆత్మారామ్ వైపు ప్రశ్నార్థకంగా చూశాడు. ఆత్మారామ్ లేచి నిలబడ్డాడు. కాలుతున్న చుట్టని ఒకసారి చూసి, చూపుల్ని మనోజ్ వైపు తిప్పాడు.

"మనోజ్ ....,మరిచిపోవద్దు, బాబ్జీని హత్య చేసింది

నుక్వే అని డిపార్ట్ మెంట్ కి ఇన్ఫర్ మేషన్ అందింది. ఆ ఇన్ఫర్మేషన్ న్యూస్ పేపర్స్ కి తెలిస్తే ప్రమాదం! పైగా ఆ వార్త ఇట్టేకాలం న్యూస్ పేపర్స్ కి తెలీకుండా వుం టుందని అనుకోడానికి లేదు. సో, యూ హావ్ నాట్ గాట్ మచ్ టైమ్!" చీఫ్ ఆత్మారామ్ చిన్నగా నవ్వాడు.

మనోజ్ నవ్వలేదు. "గుర్తుచేసినందుకు ధన్యవాదాలు సార్."

"ఇట్సాల్ రైట్. ఎక్కడికెళ్తున్నావ్? ఏం చేస్తావ్?" చీఫ్ ప్రశ్నించాడు.

"ఎక్కడికి వెళ్తున్నానో, ఏం చేయబోతున్నానో తెలీదు సార్. తెలిసిన మరుక్షణం మీకు తెలియజేస్తాను. థాంక్స్ ఫర్ ఎవ్విరిథింగ్ సర్!" అంటూ మనోజ్ తలుపు తెరుచుకుని వెళ్ళిపోయాడు.

చీఫ్ ఆత్మారామ్ మనోజ్ వెనకే మూసుకున్న తలుపుని చూస్తూ క్షణకాలం అలాగే నిలబడ్డాడు. మెల్లిగా అతని కనుబొమలు ముడిపడ్డాయి. కుర్చీలో కూచుని టెలిఫోన్ అందుకున్నాడు. రిసీవర్ని చెవికి ఆన్చి శాసేపు విగ్రహంలా ఉండిపోయాడు. తలపంకించుకుంటూ ఒక నంబరు తిప్పాడు.

అటువైపునుండీ బొంగురు కంఠం పలికింది. చీఫ్ ఆత్మారామ్ మొహంమీద చిరునవ్వు ప్రత్యక్షమైంది. తలుపుని చూస్తూ, తగ్గు స్వరంలో యేదో చెప్పసాగా డతను....

  

వణుకుతున్న డా॥ సంజీవరావు చూపుడువేలు నంబర్ని డయల్ చేసింది. రిసీవర్ని యెడంచేత్తో చెవికి

గట్టిగా నొక్కుతూ చేతి వణుకుని తగ్గించే ప్రయత్నం చేశాడతను. బట్టతలమీదా, నుదురుమీదా పూసల్లా పేరుకున్న చెమటని అరచేత్తో తుడ్చుకున్నాడు. అటు వైపున రిసీవర్ ఎత్తబడింది.

"ఎవరు?" బొంగురు కంఠం అతని చెవిలో నిర్లక్ష్యంగా మొరిగింది.

సంజీవరావు నాలుకతో పెదాల్ని తడుపుకున్నాడు.

"డాక్టర్ని......విరూపాక్షరావుగారితో మాట్లాడాలి. ఎమర్జెన్సీ!"

అటువైపునుండి జవాబులేదు. రెండుక్షణాల తర్వాత సంజీవరావు మొహం కొద్దిగా వికసించింది.

"ఎస్, డాక్టర్!"

"మిస్టర్ విరూపాక్షరావ్, ఉయ్ ఆర్ ఇన్ ట్రబుల్!" సంజీవరావు కీచుగా అరిచాడు.

"ఏమిటది?" విరూపాక్షరావు కంఠం తొణక్కుండా గంభీరంగా ధ్వనించింది.

"కరుణాకర్ తమ్ముడు....,మనోజ్!" సంజీవరావు క్లుప్తంగా అన్నాడు.

"కమాన్ డాక్టర్! ప్రిస్క్రిప్షన్‌లా పొడిపొడిగా వద్దు. నాకు ఫుల్ రిపోర్టు కావాలి!" విరూపాక్షరావు విసుగ్గా అన్నాడు. అతని కంఠంలోని ఆత్రుతని సంజీవరావు గుర్తించాడు.

సంజీవరావు బరువుగా నిట్టూర్చాడు.

"డాక్టర్, గాలితీసేసిన సైకిల్ ట్యూబులా నా చెవిలోకి నిట్టూర్చొద్దు! కమాన్! టాక్!" విరూపాక్షరావు అరిచాడు.

"రాత్రి అతను నన్ను కల్సుకున్నాడు...రివాల్వర్‌తో,

కోర్టులో తప్పుడు సాక్ష్యం చెప్పినట్టు ఒప్పేసుకుంటూ స్టేట్ మెంట్ రాసిమ్మన్నాడు...."

"రాసిచ్చావా?" విరూపాక్షరావు కంఠధ్వని చిటికలో మారింది.

"....లేదు......ఎలాగో తప్పించుకున్నాను. ఇవాళ రమ్మన్నాను...."

"వెరీగుడ్! వస్తాడా?"

"రాత్రి పదకొండు దాటాక వస్తే ఆలోచిస్తా అన్నాను. పాతిక వేలు ఇస్తానన్నాడు...."

"డాక్టర్, ఎప్పుడూ ఫీజు గురించే మాట్లాడతావ్" విరూపాక్షరావు యేదో చెప్పబోయాడు.

"మిష్టర్ విరూపాక్షరావ్. సీరియస్ గా మాట్లాడుతున్నా. నాకు గుండెదడ వచ్చేలా వుంది. ఈ ఊబిలోకి మీరే నన్ను దించారు; మీరే పైకి లాగాలి! ప్లీస్ డూ సమ్‌థింగ్! లేకపోతే అతను నన్ను కోర్టుకి లాగేలా ఉన్నాడు...."

"లాగుతాను. భయపడకు! రాత్రికి అతను రాగానే, మాటల్లోకి దింపు. మనవాళ్ళొస్తారు. ఆపైన వాడి పోరుండదు! వోకే?" విరూపాక్షరావు గంభీరంగా అడిగాడు.

"ఖచ్చితంగా మీరు యేదో చేయాలి. లేకపోతే నాచేత అతను రాగం తానం పల్లవి—అంతా పాడించేలా ఉన్నాడు. అప్రూవర్ గా మారిపొమ్మని సలహా యిచ్చాడు...."

"ఐసీ." విరూపాక్షరావు అడ్డుతగిలాడు. "డాక్టర్, నాకు ఫోన్ చేసి మంచి పని చేశావు. అతను నీ గదిలోకి రాగానే మనవాళ్ళు వాణ్ని స్వాధీనం చేసుకుంటారు.."

"నా ఇంట్లో యుద్ధాలూ, ఖూనీలు జరగటానికి వీల్లేదు!" సంజీవరావు కంగారుగా అడ్డుకగిలాడు.

"డోంట్ గెట్ అప్ సెట్ డాక్టర్! వాడు నాకు అర్జెంటుగా కావాలి. పట్టిచ్చినందుకు రేపు నీ అకౌంటులో పాతిక వేలు జమ అవుతాయి! ఓకే?"

"థాంక్యూ.........పాతిక వేలకన్నా నాకు పరువు ముఖ్యం!" సంజీవరావు గంభీరంగా అన్నాడు.

విరూపాక్షరావు గొల్లున నవ్వాడు. ఉటాలున నవ్వు ఆపేశాడు. అతని కంఠం స్పష్టంగా ధ్వనించింది: "డాక్టర్, అతను వచ్చిన అయిదునిమిషాల్లో మనవాళ్ళు రంగంలోకి దూకుతారు. అంతవరకూ వాణ్ని మాటల్లో వుంచు. నిమ్మకునీరెత్తినట్టు ఉండు. చేతనయితే విపరీతంగా భయం నటించు!"

అటువైపున క్లిక్ అంది. డా॥ సంజీవరావు రిసీవర్ని పరేసి, రెండు అరచేతుల్తో మొహాన్ని తడిపేస్తున్న చెమటని తుడుచుకున్నాడు.

"చాలా?" అన్నట్టు, తన యెదురుగా విగ్రహంలా కూచున్న వ్యక్తి వేపు ఎర్రటి కళ్ళతో చూశాడు.

పెదాల మధ్య ఇరుక్కున్న సిగరెట్ని ఇవతలికి లాగి, పొగ వూదుతూ సంజీవరావుని చిరునవ్వుతో చూశాడు మనోజ్...

• • •

రాత్రి పదకొండూ ఇరవై అయింది.

తోటలో గాఢాంధకారంగా వుంది. అరగంట క్రితం నుంచీ చెట్లచాటున దాక్కున్న ఆ వ్యక్తులిద్దరూ నీడల్లా కదిలారు. భవనం వెనుకభాగం నుంచీ చప్పుడు చేయకుండా ముందువైపుకి నడిచారు. పోర్టికోకి ఎడంవైపు వున్న

కిటికీ షట్టర్ గుండా లోపలి వెల్తురు మసగ్గా అవుపిస్తోంది.

అనుచరుణ్ని పోర్టికోలో స్తంభం చాటున ఆపి, పొడుగాటి వ్యక్తి కిటికీ దగ్గరగా జరిగాడు. కొంపాన్ని అర్ధానికి అన్ని రెండు నిమిషాలు రాతిబొమ్మలా వుండిపోయాడు. నీళ్ళల్లోంచీ మసక మసగ్గా అవుపించే ఆకారాల్లా రెండు ఆకారాలు గదిలో అతనికి లీలగా అవుపిస్తున్నాయి. చిరునవ్వుతో అతని పెదవులు విచ్చుకున్నాయి. జంతువు బోనులో దూరింది!

చీకట్లో పళ్ళు ఇకిలించుకుంటూ అతను కదిలాడు. అనుచరుడు నీడలా అతని పక్కకి చేరాడు. గుమ్మంముందు, వరండాలో నిలబడి అతను చెవులు రిక్కించాడు. లోపల్నుంచీ యే చప్పుడూ రావడంలేదు.

పాంటు జేబులోంచీ పిస్టల్ని తీశాడతను. అతని ఎడమ చెయ్యి తలుపుమీద వెడల్పుగా ఆనింది. తలుపు చప్పుడు చేయకుండా కొద్దిగా లోపలికి జరిగింది. వెల్తురు గీతలా వరండామీదికి సాగింది. ఎడమకంటిని తలుపు సందులో వుంచి, అతను హాలుని కాసేపు పరిశీలిస్తూ వుండిపోయాడు. అనుచరుడు వదుల్తున్న ఊపిరి అతని మెడని తాకుతోంది.

తృప్తికరంగా తల పంకిస్తూ అతను తలుపుని పూర్తిగా మెల్లిగా లోపలికి తోశాడు. తలమార్చి, హాలుని మరో సారి సర్వే చేసి, అతను తన భారీ శరీరాన్ని తలుపు గుండా సరఫరా చేశాడు. అనుచరుడు రెప్పపాటులో లోపల దూరి, తలుపుని యధాప్రకారం మూసేశాడు. ఇద్దరూ ఊపిరి పీల్చుకోకుండా, గుమ్మంలోపల రాతి స్తంభాల్లా నిలబడ్డారు. వాళ్ళ నాలుగు కళ్ళూ హాలుని

క్షుణ్ణంగా వెతికేశాయి. ఎడమవైపున్న గదిలోంచీ ఏవో మాటలు అస్పష్టంగా వినిపిస్తోన్నాయి. చిరునవ్వులో ఇద్దరూ మొహాలు చూసుకున్నారు.

పక్కకి తిరిగి, గండు పిల్లుల్లా గదివేపు అడుగులు వేయడం ప్రారంభించారు.

"ష్!" గది లోపల్నుంచీ యేదో కంఠం కంగారుగా కీచుగా అరిచింది.

వాళ్ళిద్దరూ ఆగలేదు. లోపలున్న వ్యక్తులు వాళ్ళ పనిలో వాళ్ళున్నారు. తమ రాకని వాళ్ళు గుర్తించరు! నాలుగు కాళ్ళు మొసాయిక్ మీద పిల్లి కాళ్ళలా కదుల్తున్నాయి....

"కదలకండి! చేతులెత్తి వెనక్కి తిరగండి!"

హాల్లో ప్రతిధ్వనించిన కంఠాన్ని విని ఇద్దరూ వులిక్కిపడి, అప్రయత్నంగా ఆగారు. అదే క్షణంలో తటాలున వెనక్కి తిరిగారు. కానీ యిద్దరూ చేతులు యెత్తలేదు....

కుడివైపు గది గుమ్మంముంవు, రెండు పాదాల్ని యెడంగా వుంచుకుని నించున్న మనోజ్‌ని యిద్దరూ ఆశ్చర్యంగా చూశారు. మనోజ్ ఎడమచేతిలోని రివాల్వర్ యిద్దర్నీ చూస్తోన్నట్టుంది. అతని కుడిచెయ్యి తొడ వెనక వేళ్ళాడుతోంది.

"ధర్మరాజా, విభీషణ్....విషాన్, పోతరాజా, జాకీ....రివాల్వర్లని కిందికి వదిలి చేతులెత్తండి! క్విక్!" మనోజ్ కంఠం స్పష్టంగా ధ్వనించింది.

ఇందాకా ఎడమవైపు గదిలో వున్నాడనుకున్న మనోజ్ కుడివైపు గదిముందుకి యెలా చేరాడు? పోతరాజు ఆశ్చర్యంతో అనుకున్నాడు. క్షణంలో సగంలో

అతను ఆశ్చర్యంనుండీ తేరుకున్నాడు. జాకీ పోతరాజుని వోరగా చూస్తోన్నాడు. పోతరాజు చెయ్యి యెత్త లేదు.

"మనోజ్....నీ కోసమే చూస్తున్నాం, మమ్మల్ని తప్పించాక నువ్వు మాయమైపోయావ్! రావుగారు నిన్ను తీసుకురమ్మన్నారు....పోతరాజు మనోజ్ కళ్ళల్లోకి చూస్తూ మాట్లాడసాగేడు. మనోజ్ కళ్ళు అతని కళ్ళల్లోకే చూస్తున్నాయి. పోతరాజు కళ్ళల్లో ఏదో మార్పు తళుక్కున మెరిసి మాయమైంది. అది, మనోజ్ చూపుల్నుంచీ తప్పించుకోలేకపోయింది....

పోతరాజు చేతిలోని రివాల్వర్ కి ఉన్నట్టుండి ప్రాణం వచ్చింది. కానీ, ఆ ప్రాణం రావడంలో రెప్పపాటు ఆలస్యం జరిగిపోయిందని పోతరాజుకి తెలీదు....

మనోజ్ యెడమ చేతిలోని రివాల్వర్ నిప్పులు కక్కింది. తూటా వేడిగా పోతరాజు మణికట్టుని చీల్చేసింది. అతని చేతిలోని రివాల్వర్ పేలుతూ, దూరంగా యెగిరిపడింది.

అనుచరుడి ఉద్దేశాన్ని గ్రహించిన జాకీ చేతిలోని రివాల్వర్ని తటాలున గురిపెట్టాడు. కానీ మనోజ్ ఎడమ చేతిలోని రివాల్వర్ పేలక ముందే, అతని కుడిచేతిలో వేళ్ళాడుతున్న కత్తి వెలుగుకిరణంలా తనవేపు దూసుకు రావడం అతను చూడలేకపోయాడు....

అప్రయత్నంగా జాకీ అరిచాడు. రివాల్వర్ దూరంగా ఎగిరిపడింది. మణికట్టులో పిడిదాకా దిగిపోయిన కత్తిని అతను కంగారుగా చూసుకున్నాడు.

చేతిలోంచీ దూసుకెళ్ళిన కత్తి, రివాల్వర్ లోంచీ దూసుకెళ్ళిన తూటాల వెంట మనోజ్ పరుగెత్తాడు. రక్త

సిక్తంగా వున్న తన అరచేతిని చూసుకున్న పోతరాజు, జాకీ చేతిలో గుచ్చుకున్న కత్తిని కళ్ళ కొనల్నుంచీ చూశాడు. తెగించిన పోతరాజు జాకీ చేతిలో బలంగా నాటుకుపోయిన కత్తిని నిర్దాక్షిణ్యంగా లాగాడు. బడితె దెబ్బతిన్న పందిలా జాకీ కీచుగా అరిచాడు. అసంకల్పితంగా, పోతరాజు ఎడమ చేతిని పట్టేసుకుని, కత్తిని లాగకుండా ఆపాడు.

ఆ క్షణంలో మనోజ్ చేతిలోని రివాల్వర్ పోతరాజు చెంపమీద సుత్తిలా తాకింది. పోతరాజు అరిచాడు. చెంపమీంచి రక్తం కాలువకట్టింది.

"చేతులెత్తండి!" మనోజ్ హుంకరించాడు.

ఓడిపోయిన పోతరాజూ, జాకీ చేతులెత్తేశారు.

"వెనక్కి తిరగండి!" రివాల్వర్ కొనతో పోతరాజుని పొడుస్తూ మనోజ్ ఆజ్ఞాపించాడు.

ఇద్దరూ వెనక్కి తిరిగారు. పోతరాజు బుసకొడుతున్నాడు. ఏడుపుగా మారుతున్న మూలుగుని దిగమింగడానికి జాకీ విఫలప్రయత్నం చేస్తున్నాడు. పోతరాజు లాగడంతో కొద్దిగా కదిలి, యేటవాలుగా వేళ్ళాడుతోంది అతని చేతిలో గుచ్చుకుపోయిన కత్తి.

"కదలండి! ఊ!" మనోజ్ అదిలించాడు. ముక్కు తాళ్ళు వేయబడిన, మదించిన ఆబోతుల్లా యిద్దరూ కదిలారు.

"డాక్టర్, తలుపు తెరు!" మనోజ్ అరిచాడు.

గది తలుపులు బార్లా తెరుచుకున్నాయి. గుమ్మంలో నిలబడ్డ డాక్టర్ సంజీవరావుని పోతరాజూ, జాకీ ఆశ్చర్యంగా చూశారు. సంజీవరావు ధరించిన కళ్ళజోడులో ఒక అద్దం గజిబిజిగా పగిలింది. అతని ముక్కుల్లోంచీ

రక్తం కాలువలుగా కారుతోంది. చొక్కా రక్తంతో తడిసి భయానకంగా అవుపిస్తోంది. అతను వణుకుతున్నాడు....

మనోజ్ యిద్దర్నీ గదిలోకి తోసి, కాలితో తలుపు మూశాడు.

"డాక్టర్ ఆ రెండు బెంచీలని వెల్లకిలా తిరగేయ్!" మనోజ్ ఉత్తరువిచ్చాడు.

"ఎ....ఎందుకు?...." సంజీవరావు తడబడుతూ అడిగాడు.

"డాక్టర్, ప్రశ్నలు అడక్కూడదనీ, జవాబులు చెప్తూ, చెప్పింది చేస్తూ వుండాలనీ నీకు యిందాకే చెప్పాను!" మనోజ్ హుంకరించాడు.

తడబడుతూ, వొణుకుతూ డాక్టర్ సంజీవరావు బెంచీలవైపు తాగినవాడిలా అడుగులేశాడు. రెండు బెంచిలనీ వెల్లకిలా పక్కపక్కనే పడేశాడు.

మనోజ్ కదిలి, వారిద్దరి ముందూ ఆగాడు. వాళ్ళ మొహాల్లోకి తీక్షణంగా చూశాడు.

"బెంచీల కాళ్ళ మధ్య యిరుక్కుని వెల్లకిలా పడుకోండి! క్విక్!" మనోజ్ కంఠం తూటాలా పేలింది,

పోతరాజు అర్థంకానట్టు చూశాడు. పైకెత్తిన చేతి గుండా రక్తం కిందికి కారిపోతోంది.

"మనోజ్....మా దారిన మమ్మల్ని పోనీ....లేకపోతే తర్వాత విచారిస్తావు! బాస్ సంగతి నీకు..."

మనోజ్ పిడికిలి సమ్మెటలా పోతరాజు మూతిమీదికి దిగింది. అతను చెప్పబోయిందాన్ని మధ్యలో ఆపేసింది. చిట్లిపోయిన పోతరాజు పెదవులు రక్తం చిమ్మడం ప్రారంభించాయి.

"బెంచీల మధ్య వెల్లకిలా...." మనోజ్ మాట పూర్తి చేయక ముందే పోతరాజు కదిలాడు.

బెంచి మధ్య కూచుని కాళ్ళు జాపాడు. మెల్లిగా వెనక్కి వాలాడు. భయానికి పట్టిన అద్దాల్లా వున్న కళ్ళతో మనోజ్ వైపు చూశాడు.

జాకీ తన అనుచరుడిలాగా బెంచీ మధ్యలో కూచున్నాడు. వెల్లకిలా పడుకోబోతూ ఆగాడు. రక్తంతో తడిసిపోతున్న చేతినీ, కత్తినీ ఆందోళనతో చూశాడు. చూపుల్ని దీనంగా మనోజ్ వైపు తిప్పాడు.

"నా చెయ్యి....క త్తి ..." నత్తిగా అన్నాడతను.

"పడుకో!" మనోజ్ గర్జించాడు. జాకీ కిక్కురుమనకుండా పడుకున్నాడు.

మనోజ్ డాక్టర్ వైపు వోరగా చూశాడు, సంజీవరావు పోతరాజునీ, జాకీనీ కంగారు చూస్తున్నాడు.

"డాక్టర్ కుర్చీని వీళ్ళ కాళ్ళవైపు లాక్కుని కూచో!" మనోజ్ ఆజ్ఞాపించాడు.

సంజీవరావు క్షణంలో కుర్చీ లాగి, కూచుని వెల్లకిలా బెంచీల మధ్య యిరుక్కున్న యిద్దర్నీ రెప్ప వేయకుండా చూడసాగేడు.

మనోజ్ టేబుల్ మీదవున్న తన లెదర్ బాగ్ లోంచి నైలాన్ తాళ్ళని తీశాడు. నవ్వుతూ పోతరాజువైపు చూస్తూ, నడిచి అతని తలవైపు కూచున్నాడు.

రెప్పలు దించుకుంటూ పోతరాజు అతనివైపు ఎర్రటి కళ్ళతో చూశాడు. నైలాన్ తాడు కొసని ఉచ్చులా ముడేసి, మనోజ్ తన పనికి ఉపక్రమించాడు. జాకీ పిచ్చి వాడిలా చూడసాగేడు.

* * *

మనోజ్ హాల్లోకి నడిచాడు.

గోడవారగా పడున్న పోతరాజు రివాల్వర్‌నీ, మధ్యలో పడున్న జాకీ రివాల్వర్నీ జేబురుమాలుతో పట్టుకుని గదిలోకి ప్రవేశించాడు. వాటిన్ని టేబుల్ సొరుగులో పడేశాడు.

గోడవారగా వున్న బీరువామీదున్న ఎలక్ట్రిక్ ఐరన్ బాక్స్‌ని తీసుకుని పోతరాజూ, జాకీ పడున్న బెంచీల మధ్యలో నిలబెట్టాడు. లేచినిలబడి యిద్దర్నీ నవ్వుతూ చూశాడు.

పోతరాజు కాళ్ళూ, చేతులూ శిలకీలా వున్న బెంచీ కాళ్ళకి గట్టిగా కట్టబడ్డాయి. చేతుల్ని బిగించిన తాడు అతని గడ్డ కింద గొంతుకమీదుగా సాగింది.

పోతరాజు గుటకలు మింగుతూ చూశాడు. అతని మొహం చెమటతో మెరుస్తోంది చేతినుంచీ యింకా రక్తం కారుతూనే వుంది.

జాకీ సన్నగా మూలుగుతున్నాడు. అతని కాళ్ళూ చేతులూ బెంచీ కాళ్ళకి బంధించబడ్డాయి. మణికట్టు లోంచి కత్తి వేళ్ళాడుతోంది.

ఐరన్ బాక్స్‌కి వైర్ తోసని కనెక్టు చేసి, మనోజ్ గోడవారగా కదిలాడు. చేతిలోని ప్లగ్‌ని సాకెట్‌లో గుచ్చాడు. పోతరాజూ, జాకీ, డాక్టర్ సంజీవరావు—ముగ్గురూ అతన్ని అయోమయంగా చూస్తున్నారు.

మనోజ్ జాకీ తల దగ్గరగా ఆగాడు. అతని బూటు జాకీ చేతిని తొక్కింది. జాకీ కంగారుగా పైకి చూశాడు. మనోజ్ కిందికి వంగి, కత్తిపిడిని పట్టుకున్నాడు. అతని చెయ్యి మెరుపులా కదిలింది. జాకీ కెవ్వుమన్నాడు.

తనచేతిలోకి ఊడివచ్చిన రక్తసిక్తంగా వున్న కత్తిని

ఒకసారి చూసి, మనోజ్ సంజీవరావువైపు చూశాడు. సంజీవరావు కళ్ళు గోలీల్లా పైకి పొడుచుకువస్తున్నాయి.

"డాక్టర్, వీళ్ళిద్దరి చేతులకీ గాయాలయ్యాయి. కొంచెం టింక్చర్ పోయి!" మనోజ్ సలహా యిచ్చాడు.

సంజీవరావు క్షణకాలం తటపటాయించి కుర్చీలోంచీ లేచాడు. టింక్చర్ బాటిల్ కాటన్ పట్టుకుని వాళ్ళ దగ్గరగా కూచున్నాడు.

"క్లీనింగ్, డ్రెస్సింగ్ అవసరంలేదు. డాక్టర్. మంట పుట్టేలా టింక్చర్ పోయి! మరో పాతిక నిమిషాల్లో నీ స్నేహితులిద్దరి శరీరాలూ కొత్త కొత్త గాయాల్తో నిండిపోతాయి! ఒకేసారి అన్నింటినీ మరమ్మత్తు చేద్దువు గానీ!" మనోజ్ నవ్వుతూ అన్నాడు.

పోతరాజూ జాకీ గాభరాగా చూశారు. సంజీవ రావు మొహం పాలిపోయింది. వణుకుతున్న చేత్తో టింక్చర్ బాటిల్ని అందుకుని కార్క్ తీశాడతను. కాస్సేపట్లో పోతరాజూ, జాకీ అరిచారు.

"డాక్టర్, నీ సింహాసనంమీద కూచో!" అన్నాడు మనోజ్ మరో నైలాన్ తాడుని అందుకుంటూ. రెండు నిమిషాల్లో డాక్టర్ని కుర్చీకి బంధించి అతను ఐరన్ బాక్స్ దగ్గరగా నడిచాడు. మధ్యలో నిలబడి ఇద్దరి మొహాల్లోకీ నవ్వుతూ చూశాడు.

కత్తిని వాటంగా పట్టుకుని పోతరాజు దగ్గరగా కూచున్నాడు. ఎడంచేత్తో ఎత్తిపట్టుకుని, అతని కాలర్ని కత్తితో పర్రున కోశాడు. తరవాత చొక్కా చేతుల్ని కోసేశాడు పోతరాజు బనియన్ వేసుకోలేదు, పీలికలై పోయిన చొక్కా ముందుభాగాన్ని మనోజ్ దూరంగా విసిరాడు. పోతరాజు ఛాతీ కంబళిలా ఉంది. అతని

పొట్ట కొలిమితిత్తిలా కదుల్తోంది. క్షణంలో జాకీ చొక్కానీ కోసి, తీసేసిన మనోజ్ నిలబడ్డాడు.

"అడ్వొకేట్ కరుణాకర్ భార్య తాగే హార్లిక్స్‌లో మీరిద్దరూ సైనైడ్ కలిపారు. ఆయన అసిస్టెంట్ గీతని అమానుషంగా రేప్ చేసి, మర్డర్ చేశారు. అదంతా ఎలా చేశారో, ఎందుకు చేశారో, ఎవరో చేయమన్నారో—అంతా పూసగుచ్చినట్టు ఇప్పుడు మీరు చెప్తారు...."

"నో!" పోతరాజు కంగారుగా అరిచాడు.

మనోజ్ అతన్ని చిరునవ్వుతో చూశాడు. "పోతరాజూ, కరుణాకర్ భార్య, గీత, కోర్టులో సాక్ష్యం చెప్పిన అమాయకులూ, అడ్వొకేట్ అన్నారావూ, ఆయన తల్లీ—వగైరా వ్యక్తుల్ని ఎలా, ఎందుకు చంపింది నువ్వు బుర్రకథలా చెప్తావు. జాకీ దాన్ని సర్టిఫై చేస్తాడు. నువ్వు అబద్ధం ఆడినప్పుడు జాకీ సరిదిద్దుతాడు" మనోజ్ ఆగి టేబుల్ దగ్గరగా నడిచాడు. నీళ్ళున్న గాజు లోటాని పట్టుకుని తిరిగొచ్చాడు.

వేడెక్కిన ఐరన్ బాక్స్‌మీద కొద్దిగా నీళ్ళుపోశాడు, 'సుయ్'మంటూ చప్పుడైంది. పోతరాజూ, జాకీ ఒకే సారి ఉలిక్కిపడ్డారు. మనోజ్ పోతరాజుని చిరునవ్వుతో చూశాడు.

"పోతరాజూ, పాటకచ్చేరీ ప్రారంభించు! ఆపకుండా, అబద్ధాలాడకుండా అంతా కక్కేయ్....! ఇస్త్రీపెట్టె బాగా—బాగా వేడెక్కింది. నోరు విప్పకపోతే ముందట నీ రెండు చెంపల్నీ, బోడిగుండునీ ఆ తరువాత ఛాతీని ఇస్త్రీ చేసేస్తాను...." మనోజ్ ఆగి చూశాడు.

"నో....నో.... మేం ఏ పాపం ఎరగం....అవన్నీ మేం చేయలేదు. శత్రువుల చేతుల్లో మగ్గుతున్న మమ్మల్ని నువ్వే రక్షించావ్!" పోతరాజు బొంగురుగా అరిచాడు.

మనోజ్ మాట్లాడకుండా పైకిలేచాడు. గోడవారగా నడిచి, ప్లగ్ తీసేశాడు. హాండిల్ పట్టుకుని ఇస్త్రీపెట్టెని పైకెత్తాడు. దాన్ని పోతరాజు మొహంమీద, రెండంగుళాల యెత్తులో పట్టుకున్నాడు.

పోతరాజు పెదవులు అదరసాగేయి. ఇస్త్రీపెట్టె వేడి అతని మొహానికి తాకుతోంది. అప్రయత్నంగా అతను కళ్ళు మూసుకున్నాడు.

"మనోజ్...." డాక్టర్ కంగారుగా పిలిచాడు.

"యస్ డాక్టర్!" మనోజ్ కంఠంలో వెటకారం ధ్వనించింది.

"కాలిన లోహం మనిషికి తాకితే యేమవుతుందో నీకు తెలీదనుకుంటాను....చర్మం కాలి, మాంసం వూడి వచ్చేస్తుంది! డోంట్ డూ ఇట్!"

"షటప్!" మనోజ్ హుంకరించాడు. "ఈసారి మాట్లాడితే నీ నోటిమీద దీన్ని అదిమి పెడతాను!" అంటూ అతను చేతిని కొద్దిగా కదిల్చాడు.

పోతరాజు భయంకరంగా అరిచాడు. ఇస్త్రీపెట్టెని దూరంగా లాగి, మనోజ్ అతన్ని నవ్వుతూ చూశాడు. పోతరాజు ఎడమ బుగ్గమీద బొటనవేలి గుర్తులా చర్మం మాడింది. ఇస్త్రీపెట్టె పాయింట్ తాకిన గుర్తు....

"అరుపులు కాదు. అసలు సంగతి కావాలి నాకు!" మనోజ్ పోతరాజు కళ్ళల్లోకి చూస్తూ గద్దించాడు. పోతరాజు మొహంమీద భయం, ఆశ్చర్యం ముద్ర

వేళాయి. అతని కళ్ళు ఉచ్చులో తగులుకున్న చిరుతపులి కళ్లలా ఉన్నాయి.

"పోతరాజూ, ఇప్పుడే నీ దవడలు ఊడిపోడం నాకు ఇష్టంలేదు! నీ గోళ్ళమీద శాంపిల్ ట్రీట్‌మెంట్ ఇస్తాను!" అంటూ మనోజ్ ఇస్త్రీపెట్టెని అతని వేలికి దగ్గరగా జరిపాడు.

"వొద్దు!" పోతరాజు అరిచాడు. మనోజ్ అతన్ని నవ్వుతూ చూశాడు.

"అయితే మాట్లాడు!"

"నేను.... నేను... ఇరుక్కుపోతాను...." పోతరాజు ఏడుపు గొంతుతో అన్నాడు.

మనోజ్ నవ్వాడు. "ఇప్పటికే ఇరుక్కున్నావు! నిజం చెప్తే నిన్ను వదిలేస్తాను. నాకు అసలు క్యాష్ కావాలి!"

"గురూ, చెప్పు!" జాకీ వొంగురుస్తూ సలహా ఇచ్చాడు.

పోతరాజు గుటకలు మింగాడు. ఇస్త్రీపెట్టె పాయింట్ అతని ఎడమచేతి బొటనవేలి గోరుమీద ఆనింది. పోతరాజు ఆపుకోలేక అరిచాడు.

"....చెప్తాను!"—హీనంగా అన్నాడతను.

"వెరీగుడ్! ప్రారంభించు. శ్రీనుంచీ శుభందాకా అంతా అప్పగించు!" మనోజ్ అన్నాడు.

పోతరాజు ప్రారంభించాడు....

* * *

మనోజ్ మౌనంగా అంతా విన్నాడు. డా॥ సంజీవరావు ఆశ్చర్యంతో నోరు తెరుచుకుని విన్నాడు. మనోజ్ ఇస్త్రీపెట్టె ప్లగ్‌ని మళ్ళా సాకెట్‌లో గుచ్చాడు. సిగరెట్ వెలిగించి వెల్లకిలా పడుకుని ఆదుర్దాతో

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క మాటలో గాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డుపై వ్రాసి, ఈ నెల 6 వ తేదీలోపు మాకు చేరే టట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు ఏడాది పాటు పత్రిక లేదా సప్లమెంట్ బహుమతిగా పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

'హోమ్ డెలివరీ' సభ్యులకు 'అపరాధ పరిశోధన' పత్రిక మరియు సప్లిమెంట్ కాపీలు వాటి అసలు ధరకే అందజేయబడతాయి. అంతేకాదు - వారికి పత్రికలను ప్రతి నెలా రిజిష్టరు లేదా బుక్ పోస్ట్‌లో పంపుతాము.

ప్రతి 6 నెలలకు ఒకసారి అంటే - జనవరి మరియు జులై నెలల పత్రికలు మాత్రం V. P. ద్వారా పంపబడతాయి. దానికి మీరు అర్థ సంవత్సర చందా రు. 90/-లు చెల్లించవలసి వుంటుంది. పోస్టు ఖర్చులన్నీ మేమే భరిస్తాము. పత్రికల ఖరీదుకు మించి మీరు పైసా చెల్లించ నవసరంలేదు.

'హోమ్ డెలివరీ' వల్ల పత్రికలు మీకు మరింత త్వరితంగా, గ్యారంటీగా అందుతాయి. ఇంకా నెలనెలా, రెండేసి నెలలకు V. P. ద్వారా తెప్పించుకునే సౌకర్యంకూడా వుంది.

మరి - మీరు చేయవలసిందల్లా వెంటనే రు. 0/-లు పంపి శాశ్వతంగా 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరటమే.

**పూర్తి వివరాలకై 'అపన' చూడండి!**

చూస్తున్న జాకీ ముఖంలోకి చూశాడు.

"జాకీ, నీ తోడుదొంగ చెప్పిందంతా నిజమేనా?"

"....నిజమే" జాకీ కంఠం వణికింది.

"కాసేపట్లో మీరు చెప్పిందంతా నిజమో కాదో తెలుస్తుంది. ఏమాత్రం అబద్ధం ఆడివున్నా, ప్లగ్ కనెక్షన్ అలాగే వుంచి, ఇస్త్రీ పెట్టెని మీ ఇద్దరి ఛాతీలమీద పెడ్తాను!" అంటూ మనోజ్ టేబుల్ వైపు నడిచాడు.

కుర్చీలో కూచుని టెలిఫోన్ రిసీవర్ ఎత్తి, ఒక నెంబర్ తిప్పాడు. అటువైపున యెవరో పలికారు. మనోజ్ తనకి కావల్సిన వ్యక్తి పేరు చెప్పాడు.

"మీ రెవరు?" అవతలి కంఠం ప్రశ్నించింది.

"మనోజ్."

"విరూపాక్షరావ్ హియర్!" అందో కంఠం క్షణకాలం తర్వాత.

"విరూపాక్షరావ్, నన్ను వేటాడ్డానికి పంపించిన నీ రెండు వేటకుక్కలూ తోకలు తెగి, ముక్కులు పగిలి ఇక్కడ మూలుగుతూ పడున్నాయి!" మనోజ్ నవ్వుతూ అన్నాడు.

"వాట్ డూయూ మీన్? యింతకీ ఎవరు నువ్వు? యేమిటి నీ పిచ్చి వాగుడు?" విరూపాక్షరావు కోపంగా అరిచాడు.

"అమాయకత్వం నటించొద్దు! పోతరాజా, జాకీ చిక్కిన పేనుల్లా నా ముందు పడున్నారు. నీకు పొటాషియం సైనైడ్ లాంటి పదార్థాలు సప్లై చేస్తూ, కోర్టులో నువ్వు నేర్పించిన పాట పాడుతూ తప్పుడు సాక్ష్యాలు పలికే చిలక—గవర్నమెంట్ డాక్టర్

సంజీవరావు కూడా తోడుగా పేషెంటులా మూలుగు
తున్నాడు...."

"ఇంతకీ....నువ్వు చెప్పేదేమిటి?" విరూపాక్షరావు గర్జించాడు. ఆ గర్జనలో యిందాకటి దర్జాలేదు.

"జరిగిందంతా వాళ్ళు బృందగానం పాడుతూ, అమరంలా అప్పజెప్పేశారు...."

"వాట్?"

"నన్ను మభ్యపెట్టి, నీ శత్రువుల పిడికిలిలో యిరుకున్న నీ తొత్తుల్ని విడిపించుకున్నావు. మా అన్నయ్యకి జరిగిన అన్యాయానికి కారకులు వేరే వున్నారని కథలు చెప్పి తెలివిగా నన్ను నమ్మించావు. విరూపాక్షరావ్, దానికంతకీ చక్రవడ్డీతో పరిహారం చెల్లించాలి!" మనోజ్ గంభీరంగా అన్నాడు.

విరూపాక్షరావు తాత్కాలికంగా మూగవాడై పోయాడని టెలిఫోన్ చెప్తోంది.

"మనోజ్, ఎక్కడో పొరపాటు జరిగింది. నువ్వు తాడుని చూసి పాము అనుకొంటున్నావు...."

"బుర్రకథలు వింటానికి నాకు టైంలేదు! నిజం చెప్పాలంటే బుర్రకథలు వినిపించడానికి నీకు టైమ్ లేదు. నీకు కేవలం నలభైఅయిదు నిమిషాలు మాత్రం వ్యవధి యిస్తున్నా. ఆ వ్యవధిలోగా నేను ఆడమన్నట్టు నువ్వు ఆడకపోతే నీ శిష్యుల్ని నీ పర్సనల్ ఫిజీషియన్ తో సహా, నీ శత్రువులకి అమ్మేస్తాను...."

"వాట్....!" విరూపాక్షరావు ఆశ్చర్యంగా అరిచాడు.

"రెండోసారి చెప్పను...." మనోజ్ కటువుగా అన్నాడు.

"ఆల్ రైట్....నీకేం కావాలి?" విరూపాక్షరావు బుకాయింపులు మాని బేరంలోకి దిగాడు.

మనోజ్ చిన్నగా నవ్వాడు. "అలా అడిగావ్; బావుంది. ఏ శిష్యుల్ని నాచేత బంధవిముక్తుల్ని చేయించావో, వాళ్ళని నీ శత్రువులకి విక్రయించకుండా వుండా లంటే నువ్వు రెండు పనులు చేయాలి...."

"ఏమిటవి....?" విరూపాక్షరావు అడ్డొస్తూ అడిగాడు.

"ఒకటి: నలభై అయిదు నిమిషాలు—మినిమమ్ నలభై రెండు నిమిషాల్లోగా నువ్వు పాతికలక్షలు నాకు చెల్లించాలి.

"నువ్వు చేస్తున్న నేరం యెలాంటిదో నీకు తెలుసా? పోలీసులకి...."

"వాళ్ళని నీ శత్రువులకి కాకుండా పోలీసువాళ్ళకి అప్పగింతలు చేయాలని కూడా నాకు ఆలోచన లేక పోలేదు...." మనోజ్ వెటకారంగా నవ్వాడు.

"ఆల్ రైట్ నీ రెండో కోరిక యేమిటి?" విరూపాక్షరావు కంఠంలో అసహాయతా, ఆగ్రహం కలిసి ధ్వనించాయి.

"కోరిక కాదు: ఆజ్ఞ! ఆయినా అదేమిటో నీకిప్పుడు చెప్తాను. పాతికలక్షల్ని సూట్‌కేసులో సర్ది వొంటరిగా—గుర్తుంచుకో—వొంటరిగా నువ్వే రావాలి. కార్ని నువ్వే డ్రైవ్ చేయాలి. టవర్ క్లాక్ దగ్గర కారాపి అక్కణ్ణుంచీ సూట్‌కేసు మోసుకుంటూ యిక్కడికి రావాలి. నీ జేబుల్లో కారుతాళంచెవులు తప్ప, పెనాకత్తి, రివాల్వర్, బాల్‌పాయింట్ పెనా వగైరా వస్తువులేవీ వుండకూడదు...." (ఇంకా వుంది)

